# భారతి

1967 మార్చి



చిఱుమర్తి నరసింహకవి

లక్షణ నవరత్నమాలిక

(పూర్వ గ్రంథం)

పాపజాతి

(కథ)

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం




జినవల్లభుని గంగాధరం

శిలాశాసనం

డా॥ నేలటూరి వేంకటరమణయ్య



వ్యవస్థాపకులు

## దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

---

వెల ఒకరూపాయి

Recd
31.3.67

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్






మార్చి 1967



సంపుటము 44 : : సంచిక 3 :

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మార్చి 1967



---

# ప్రార్థన

శ్రీ బండి నాగరాజు

సహారా యెడారిలో ఒయాసిస్సులే వున్నా యనుకున్నాను
నాలుక పీక్కు పోతున్నప్పుడు,
కళ్లు బైర్లు గ్రమ్ముతున్నప్పుడు
తటాలున కనిపించిన ఒయాసిస్సులో
తల మునకలుగా పేద దీర్చు కున్నాను,
మళ్లీ ఒయాసిస్సు వచ్చేదాకా,
చావు బ్రతుకుల ఇరుకులో ప్రయాణిస్తున్నాను.

ఆ ఒయాసిస్సులే నా మానస సరోవరాలని
నా జీవితపు ఎడారిలో అంతకంటే వరాలు లేవని
సంతృప్తే సరైన జీవిత మార్గమని
నా కున్న జీవితానుభవంతో ముడిపెట్టుకుని
సాగిస్తున్నాను ఈ యాత్రని!

ఓ భగవంతుడా!
నేను కోరుకో గలవి యివ్వ గలిగితే
నీవు కరుణా పయోధివి!
నా కోరిక కంటే గొప్పవరం ప్రసాదించే నీవు
ఎవడవో నే నేమని చెప్పగలను?

ఖరకిరణుని గర్భంలో హిమాలయ మున్నదట!
నా కేమి ఉపయోగం?
నా జీవితపు ఎడారి భావాల వెడల్పు పద్యాలలో
శబ్ద చమత్కృతులే రసధ్వనులుగా భావించుకుని,
పరితృప్తి పొందు తున్నాను!

సహారా యెడారి గర్భంలో* సరోవరం వున్నదట, నీ కరుణమాదిరి
నాకేమి ఉపయోగం ?
నీ దయకు నేను తట్టుకోలేకుండా వున్నాను :
సహారాలు వద్దు ; సరోవరాలూ వద్దు ;
పచ్చిక బీళ్లూ, బావులూ....అన్నీ సమపాళ్లలో వుంచి,
ఒడిదుడుకులు లేకుండా చెయ్యి !
నీ లీలలు గుర్తించే శక్తి, కాదు ఓర్పు, లేకుండా వున్నాను.

ప్రభూ !
నీ నియంతృత్వం మాని,
మా సామ్యవాదం అనుసరించు !!
అనుగ్రహించు !!!

---

* సుమారు 9,850 అడుగుల లోతువ 5,21,950 చ. మై. సరోవరం (11,77,000 కోట్ల ఘనపు అడుగుల మంచినీరు గంది) సహారా యెడారిలో వున్నదట.



# శ్రీ సముద్రగుప్త చక్రవర్తి కృష్ణచరితము-2

## శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి

సమ్రాట్సముద్రగుప్తుడు పేర్కొన్న మునికవుల వర్ణనము మున్నె వివరించితిని. భారతదేశ దురదృష్టము వలన యెన్నియో ప్రాచీన గ్రంథములు నశించుటయూ తగిన చరిత్ర లభించకపోవుటయూ తలచుకొన్నపు డెంతయో విచారము కల్గును.

ఆనాడు వైదేశిక పండితులు కూడా ఆర్యావర్తమునకు వచ్చి, భారతదేశ విద్వాంసులతో సమానాదరమంది ఆనాటి రాజుల గుణగ్రాహిత్వమున కమందానందమును పొందిరనుటకు సమ్రాట్సముద్రగుప్తుని చీనదేవ మిహిరదేవ సంస్తవనమే యుదాహరణము.

అంతియేగాక అంత్యజుడైన దేవలుడు ఋషికవి వర్గమున ప్రస్తుతింపబడుటయు నేటి గుణహీనులగు కేవల కులపక్షపాతులకు చపేటికగా గ్రహింపవలసిన విషయమై యున్నది.

ఆనాటి భారత మెంత మనోహరముగా నుండెనో కదా యని యనిపించుచున్నది. ఇప్పటివలె ఈ కాలమున మనదేశమున గాన్పించు నింద్యమైన జాతి కుల మత పక్షపాతములు ఆనాడు లేవనుటయు స్పష్టము. సముద్రగుప్తుడు కేవలార్షమత మవలంబించినవాఁడైనను తద్విరుద్ధమగు బౌద్ధమును, తన్మత కవులను, వారి ప్రాశస్త్యమును ఏలాటి స్వమతాభినివేశము లేక కీర్తించి యుండుట గణనీయమైన మహోదాత్త విషయము.

ప్రాతస్స్మరణీయు లగు వాల్మీకివ్యాసులనేమి పాణిని కాత్యాయన పతంజలులనేమి వ్యాడి మొదలగు మహర్షియులగు సత్కవిలోకమునేమి సద్భక్తిభావముతో తలంచని వాడుండడు. అట్టివారితో సమముగా వైదేశికులైనను అంత్యజులైనను లెక్కింపక సద్గుణలుబ్ధుఁడై కీర్తించి నిజముగా తన విశిష్ట యోగి హృదయమును వ్యక్తీకరించి సముద్రగుప్తుడు కీర్తిసాంద్రుడయ్యెను. ఇట్లు మునికవులను సంస్తుతించి సముద్రగుప్తుఁడు ఇపుడు రాజకవులను గూర్చి స్తుతించుచున్నాడు.

ఎవ్వ రీ రాజకవులు? అను విషయముపై ఈ రాజకవి వర్ణన యొక్క కడపట సముద్రగుప్తుఁడే ఇట్లు వచించి యున్నాఁడు. మునికవులు రాజానుగ్రహమును కోరక ముని వృత్త్యా జీవించుచు కేవలము లోకమునకు ధర్మోపదేశము కొరకు, పర స్వాత్మారాధన కొరకు, వినోదము కొరకు, లోకోపకారమునకున్నై కావ్యములను నిర్మించువారైరి.

### సు బం ధు డు

ఇఁక రాజకవు లెట్టివారనఁగా రాజాశ్రయమును కోరి రాజాదులను తమ కనుకూలమైన వారింగా చేసుకొనదలంచి, రాజాశ్రయ మొనర్చి వారి కింపుగా కావ్యములను రచించినవారునూ లేక తాము రాజులై ధర్మావిరోధికర్మమును లోకమున కుపదేశ మొనర్పఁగోరి కావ్యరచన గావించినవారును. ఇందు మొదటి శ్లోకము సమస్తలైన సత్కవిలోక వర్ణనము.

మహాకవి సుబంధుఁడు మనోహరముగా వత్సరాజచరితము అను నాటకమును రచించెనని ఈ పద్యము తెల్పుచున్నది. ఈ సుబంధుఁడను కవి యెవ్వరు? వాసవదత్తాగ్రంథ నిర్మాతయగు సుబంధు కవి యొక్కడు ప్రసిద్ధుఁడున్నాడు. ప్రత్యక్షర శ్లేషఘటనచే చెలువారుచున్నట్టి ఆ వాసవదత్తా ప్రబంధమును చూచుచున్నాము.

సముద్రగుప్తుఁడు పేర్కొన్న సుబంధుఁడు ఇతడు కాడు. వాసవదత్తలో కాళిదాసీయ శకుంతలా కథాంశ మొకభాగ ముద్ధృతమైనది. ఈ సముద్రగుప్తుఁడు పేర్కొన్న సుబంధుఁడు కాళిదాసు కన్న ముందువాఁడు. అందుచేతనే ఈ కృష్ణచరితములో కూడ కాళిదాసుని కన్న మున్నుగా సుబంధుఁడు కీర్తింపబడినాడు. ఇతఁడు రచించిన వత్సరాజచరిత మిపుడు లభింపదు. ఈ సుబంధకవి బిందుసారుని యాస్థానకవిగా నుండె ననుచున్నాఁడు. ఈ బిందుసారు డెవ్వడు? ఈ సుబంధుఁ డెవ్వరు?

అభినవగుప్తాచార్యునిచే నాట్యశాస్త్రటీకలో వాసవదత్తా నాట్యధారమును రచించిన సుబంధుని నామము గ్రహింపబడినది. ఆ గ్రంథము నుండి నాట్యాయితోదాహరణ ముద్ధరింపఁబడినది.

"విఫలమేవ దిష్యంతివ్యకృతే దుర్వాసః శాప మను భూవ శకుంతలా." (వాసవదత్తాయాం). నాటకగర్భితం నాటకం నాట్యాయితం.)

ఆ గ్రంథమునుండి నాట్యాయితోదాహరణ ముద్ధరింపఁ బడినది. సవృత్తి కావ్యాలంకార సూత్రగ్రంథములో వామనునిచే

నొక పద్య ముద్ధరింపఁబడినది. ఆ ప్రకరణ సంగమమున సుబంధుఁడను పేరు వ్రాయబడినది. అందుచే తెలియఁబడున దేమనఁగా వసుబంధుఁడో సుబంధుఁడో యొక కవి చంద్రగుప్త తనయునికి సాచివ్యమొనర్చెననుట స్పష్టము. కొందరు విద్వాంసులు ఇట్లు తలంచెదరు. చంద్రప్రకాశుఁడైన ఈసముద్రగుప్తుఁడే చంద్రగుప్తుని తనయుఁడై యున్నందున ఈతని యాస్థానమందే పై కవి యుండియుండవచ్చునని యున్నారు. అతనికే ఇతఁడు మంత్రియై యుండవచ్చును. సుబంధుఁడను యధార్థ పాఠము స్పష్టము. వాసవదత్తా కర్తయగు సుబంధుని కాలములో సముద్రగుప్తుని కాలమునరివడదు. కాని యపుడీ సుబంధుఁడు యెవ్వరు? మౌర్య సంరాట్టు అయిన చంద్రగుప్త తనయుఁడైన బిందుసారునిసభలో నీ సుబంధుఁడుండుట సరిపడుచున్నది. ఎందులకనగా రెండవ పద్యములోని విషయమునకు సరిపడుచున్నది. ఇదియె మొదటి సుబంధుని విషయమున గల్గిన సంశయములకు పరిహారమార్గముగా కనుపడుచున్నది. ఈ కృష్ణచరిత్రలోని కవిక్రమము కూడా ఆయా కవుల కాలమునకు కూడా సరిపోవుచున్నదిగా యున్నది. ఆ మొదటి సుబంధుని వత్సరాజ చరితమే అభినవ గుప్తునిచే నుదాహరణముగా గ్రహింపబడి యున్నది. ఈ సుబంధ కవి బిందుసారునిచే సభలో సన్మానింపబడి యా సభను పరిత్యజించెను. అటుపై మిక్కిలి కోపము గల బిందుసారునిచే నీ కవి చెరబెట్టింపబడెను. అటుపై ఈ కవి యందు గల దివ్యశక్తిచే సరస్వతి ప్రత్యక్షమై ఇతని కారాగృహ విముక్తుని గావించెను. లేదా యొకానొక సరస్వతి యనునామె రహస్యముగా నీతని చెర నుండి తప్పించియుండవలెను. అటుపై ఇతఁడు వత్సరాజ సమీపమునుచేరె. మిగత విషయము స్పష్టము. వత్సరాజా ఈ సుబంధ కవికి తన అక్కనిచ్చి వివాహ మొనరించెను. ఇది నిర్ణయించుటకు శక్యము కాకున్నది. అయినను అక్కగారి భావన గల యామెనైననూ ఈ కవి కొసంగి అయిదు గ్రామము లొసంగి సత్కరించియుండును. ఇంతకూ ఆనాటి కవులకు రాజబాంధవ్యము కూడ నున్నట్లు ఇందుచే స్పష్టము. ఇట్టి మర్యాద లందుకొన్న ఆ కవు లెంత ధన్యులో.

## శూద్రకుఁడు

సంస్కృత వాఙ్మయమున నానావిధ రూపములు గల చరిత్రగల శూద్రకుని కవిత్వమున ఇతని రాజత్వమును గూర్చిన మహత్తరమైన కీర్తి ఈ భారతభూమిలో పరిపూర్ణమైనది. కాదంబరిలో ఇతనిని విదిశాపట్టణమునకు రాజుగా వర్ణింపబడినది. కథాసరిత్సాగరములో శోభావతీ పట్టణపు రాజుగా శూద్రకుని వర్ణించియున్నారు. హర్షచరిత్రలో చకోరరాజైన చంద్రకేతు నృపతికి శత్రువని వచింపబడినది. బేతాళ పంచవింశతిలో వర్ధమాన నగరమునకు శూద్రకుడు రాజై యుండెనని యున్నది. రామిల సోమిల నామధేయులైన కవులచే శూద్రక కథ రచింపబడియుండుట ప్రసిద్ధమే. ఇట్టి స్థితిలో శూద్రక నాములు కవులు రాజులు పెక్కురై యుండురా లేక యొకనినే ఇట్లు ఆయా కవులు కీర్తించియుండురా యను విషయమై సాధ్యమైనంతవరకు మా నిశ్చయము నీ క్రింద లిఖించుచున్నాము.

శూద్రకుని సత్కీర్తి స్వచ్ఛము. అతని సాహసోపేతములైనను లనితర సాధారణములైన నగుటయే గాక అందరి వాక్కులను అతని కీర్తిని గానమొనర్చినవి. శూద్రకుని యనంతరము కాలక్రమమున అతనిని గూర్చి పెక్కురు కవులు అనేక రీతుల ఈతని వీరగాథలను గాన మొనర్చియున్నారు.

మరియు నీ శూద్రక నృపాలుఁడు ఒకొక్క సమయమున నొకొక్క పట్టణమును రాజధానిగా వేలుచున్న సమయములలో ఆయాయి కథా సందర్భములు జరిగియుండవచ్చును. ఒకొక్క చరిత్ర నధికరించి తమ తమ గ్రంథముల యందు ఆయా వర్ణనములను గావించియున్నారు. ఇతడు శాస్త్రపాండిత్యము చేతనూ బాహుబలము చేతనూ శత్రువులను జయించెను. ఇవ్విషయమునుగూర్చి మృచ్ఛకటికములో స్పష్టముగా నిట్లున్నది. తిలకింపుడు.

"ద్విరదేంద్ర గతి శ్చకోరనేత్రః
పరిపూర్ణేందుముఖ స్సువిగ్రహ శ్చ.
ద్విజముఖ్యతమః కవి ర్బభూవ
ప్రథిత శ్శూద్రక ఇత్యగాధసత్వః.

మరియు.

"ఋగ్వేదం సామవేదం గణితమథ కలాం
వైశికీం హస్తిశిక్షాం,
జ్ఞాత్వా శర్వప్రసాదాత్ వ్యపగత తిమిరే
చక్షుషీ చోపలభ్య,
రాజానం వీక్ష్య పుత్రం పరమ సముదయే
నాశ్వమేధేన చేష్ట్వా
లబ్ధ్వా చాయుశ్శతాబ్దం దశదినసహితం
శూద్రకోఽగ్నిం ప్రవిష్టః.
సమరవ్యసనీ ప్రమాదశూన్యః
కకుదం వేదవిదాం తపోధనశ్చ
పరవారణ బాహుయుద్ధ లుబ్ధః
క్షితిపాలః కిల శూద్రకో బభూవ."

అని ఇతని యశస్సు కీర్తింపబడియున్నది. అందుచే ఇతఁడు ధనుర్వేదమును చౌరశాస్త్రము అనగా అరువదినాల్గు కళలలో నొక్కటియైన చోరవిద్యనుగూర్చి రెండుగ్రంథములను నిర్మించి యున్నట్లు స్పష్టము. కాని ఆ రెండు గ్రంథములు నేడు దొరక కున్నవి.

చోరశాస్త్ర సిద్ధాంతము లితనికి కరబదరాయమానమై యున్న ట్లితని మృచ్ఛకటికములోని తృతీయాంకము ప్రబల సాక్ష్యముగా నున్నది. ఇతని పాండిత్యమును బలపరాక్రమములను

శత్రువులైన బౌద్ధధర్మావలంబి రాజులునూ పండితులును సహింపరైరి. అంతియేగాక ఇతనిని వారు చంపుటకును కూడ నుద్యమించిరి. అపుడు వారు శాస్త్ర శస్త్రములచే పరాభూతులై యుపశమావితులైరి. అటుపై ఇతఁడు తపస్వివ్రతమాచరించు వాఁడై కూడ ముఖ్యముగా ధర్మరక్షార్థమై రాజ్యపాలన మొనర్చెను. ఏయే రాజులైతే పూర్వమితనిచే పరాభూతులై యుండిరో అట్టివారే అనంతరము గుణానురక్తులై ఇతని కత్యంత ప్రీతిపాత్రులై యుండిరి. ఇతని సభలో నున్న రామిల సౌమిలులను కవు లిరువురు శూద్రక కథను రచించిరి. అటుపై ఇతఁ డశ్వమేధయాగ మొనర్చెను. అటుపై నీతఁడు శకరాజులను జయించి తనదైన విక్రమశకమును స్థాపించెను. ఇతనిచే స్థాపితమైన విక్రమాదిత్య శకము నిప్పటికి కూడ ప్రచారములో నున్నది. అనేకులైన పండితులీ విషయమే సోపపత్తికముగా నున్నదనుచున్నారు. ఇతడు మృచ్ఛకటికమను పేరుగల తొమ్మిది యంకముల నాటకమును రచించెను. మృచ్ఛకటికములో తన కథనే తాను వేరువాని పేరుతో చిత్రించెను. మృచ్ఛకటికములోని ఆర్యక రాజ్య లాభ కథ శూద్రకునిదే. మృచ్ఛకటికమునకే ఆర్యకజయమని అభిధాంతర మున్నది. ఇపుడు దొరకుచున్న మృచ్ఛకటికము పది యంకములు కలదిగా నున్నది.

“జర్మన్ దేశస్థుఁడైన పిశల్ పండితుఁడు కావ్యాదర్శ కర్తయైన దండికవియే మృచ్ఛకటికమును రచించెనని తలంచుచున్నాఁడు. ఈవిషయమున మా యభిప్రాయమేమనగా శూద్రకుడు రచించిన తొమ్మిది యంకముల నాటకముపై దండి పదియవ యంకమును వ్రాసి తొమ్మిది యంకముల మృచ్ఛకటికముతో కలిపియున్నాడు. ఎందుకనగా శూద్రకుని అగ్ని ప్రవేశానంతర కథ శూద్రకుఁడు రచించుట యసంభవముగాన దండియే ఆ యంకమును పూర్తిచేసి శూద్రకుని తొమ్మిది యంకముల మృచ్ఛకటికతో జోడించియుండునను నూహ సమంజసముగా దోచుచున్నది. ఇదియే మా యభిప్రాయమై యున్నది, జర్మను పండితుని యూహ కిది యనురూపమై యున్నది కూడ. దండి మహాకవి ఇంతియే గాక మృచ్ఛకటికములోని కొన్ని సంనివేశములలో మార్పులు కూర్పులు కూడ చేసి యున్నట్లుగా కూడ కనుపడుచున్నది. శూద్రకుఁడు తన పుత్రుని రాజుగా భావించెనని మృచ్ఛకటికము వలననే తెలియుచున్నది. ఇక్కడ శూద్రకుని కొడుకు పేరు దేవమిత్రుఁడని తెలియుచున్నది. కాని ఈ దేవమిత్రుఁ డెవ్వరు? అను విషయమును, ఇతఁ డనంతరమేమయ్యె నేమి చేసియుండెనను విషయమును చారిత్రకులు నిర్ణయించెదరుగాక. ఈ శూద్రకుడు వార్ధక్యమున ముని వృత్తి నవలంబించి యుండెనుట ఏమాత్ర మసంభవ విషయము కాదు.’’ అని ఇంతవరకు శూద్రకునే విక్రమార్క చక్రవర్తిగా శ్రీ జె. కె. శాస్త్రిగారు సమర్థించుచూ స్వాభిప్రాయమును వచించియున్నారు.

అసలు శకకర్తయగు విక్రమార్క నరపాలుని ఆస్థానములో నవరత్నములనబడు కవు లుండెడివారని ప్రసిద్ధి. వారు “ధన్వంతరి క్షపణ కామరసింహ’’ త్యాదులు. ఈ శూద్రకుని విషయములో వారి పేర్లేమియు రాలేదు. మరియూ విక్రమమహీజాని సుక్షత్రియుఁడని ప్రతీతి. ఇతఁడు స్పష్టముగా బ్రాహ్మణుఁడు. అతనికీ సాహసాంకుఁ డను నామ మున్నది. శూద్రక మహారాజు కట్టి యభిధయున్నట్లు తెలియరాదు. ఈ విషయమును జర్మన్ పండితుల పరిశోధన ఆవశ్యకమని నా తలంపు. ఇంకను శకకర్తయగు విక్రమార్కునికిని శూద్రక మహారాజునకును ఏకత్వమును గూర్చిన చర్చ మిగిలియున్నదనియే నా యభిప్రాయము.

ఆట్లే మునికవుల పౌర్వాపర్యములను గూర్చియూ వారివారి యుదాత్త విషయములను గూర్చియూ చారిత్రకులు వెతికివెతికి తేవలసిన విషయము లనేకములు గలవు.

సముద్రగుప్తుఁడు వదలిన-వారునూ ఉండియుందురు. వారిని, ఆ నాటి రాజకీయ చరిత్రను కూడా గమనింపవలసి యున్నది.

సముద్రగుప్తుని వరుసలో 'కాళిదాసు' కూడ శూద్రకుని యాస్థానకవిగా వర్ణింపఁబడినాఁడు.

## కా ళి దా సు

14–15–16 ఈ మూఁడు శ్లోకములలో నీతడు వర్ణింపఁబడియున్నాఁడు. అభిజ్ఞాన శాకుంతల కర్తయు కవికుల గురువు అయిన కాళిదాసుఁడు ప్రసిద్ధుఁడే. రసభావములకు వారిరాశియైన కాళిదాసు నెక్కడివాఁడు? ఎప్పటివాడు? అను విషయమును గూర్చి పలువురు పండితులు పెక్కువిధముల నభిప్రాయములను వెలిబుచ్చియున్నారు. ఇప్పటివరకు ఇంద రీతని విషయమును గురించి వ్రాసిననూ ఇదమిత్థమని ఇంతవరకు నిర్ధారణగా వ్రాసినవారు ఎవ్వరూ లేరు. ఇట్లు అనవగమ్యమైన విషయ మిదియై యున్నది. భారత వర్షమున కమితమైన గుణాధిక్యమైన వాఙ్మయముతో గౌరవమును సంపాదించిన కీర్తిసాంద్రుఁడు కాళిదాసు ఇప్పటివాఁడేయని ఈ కృష్ణచరిత్రము ద్వారా నిర్ణయింప వీలుపడుచున్నది.

మహాకవి గుణాలంకృతుఁడైన శూద్రక మహారాజుయొక్క కాలములో కాళిదాసుఁ డున్నాఁడని ఈ గ్రంథము వలన తెలియుచునే యున్నది. శూద్రకుని కాలము కూడ కాళిదాసు కాలనిర్ణయమువలె ఇంతవర కయోమయముగా నుండినను ఈ కృష్ణచరితమువలన ఆ పనియు సులభ్యసాధ్యమే యయినది. ఏలయనగా శూద్రకుని చారిత్రక విషయము లీ కృష్ణచరితమువలన అనేకములు తెలియవచ్చినవి. కాళిదాసు ఆ శూద్రకుని యాస్థానమందుండెను. శూద్రకుఁడు రసభావాది విశేషదీక్షా గురువుగా ఖ్యాతి జెంది విక్రమాదిత్య నామధేయము గైకొనె. అట్టి సరస్వతీప్రియుఁడైన శూద్రకుడు కాళిదాసాది కవి గ్రామణులను చేరదీసి తత్తదుచిత ప్రకారము పోషించె నన

టలో విప్రతిపత్తి యేమున్నదని శ్రీ జె. కె. శాస్త్రిగారు వ్రాసి యున్నారు.

కావ్యరత్నభూతమైన కాళిదాసీయ శాకుంతలా నాటకము సర్వకవి వాక్కులకు ప్రత్యాదేశభూతమై యుండుట రసికులగు విద్వాంసులు సర్వులు తెలుసుకొన్న విషయమే. ఇతఁడు మరిరెండు నాటకములను రచించె. అయ్యవి ఒక్కటి మాళవికాగ్నిమిత్రము, రెండవది విక్రమోర్వశీయమునై యున్నవి. వేడయ్యవి ప్రఖ్యాతి నందియున్నవి కూడ. అటుపై పలువు రనేక కావ్యనాటకాదులను రచించి కాళిదాసాభిఖ్యను బిరుద నామముగా గ్రహించి యుండుటయు విదితమే. ఇతని సర్వజ్ఞత్వాది కథలు లోకప్రసిద్ధములే కాన వాని నిందు పునరావృత్తి యొనర్ప పని లేదు. అవ్వానిచే రసిక విద్వాంసులకు చక్కని కాలక్షేపముగా కూడ యుండినవి. ఈతని శ్రవ్య కావ్యప్రశస్తిని శ్రీ జె. కె. శాస్త్రిగారు గావించి యుండలేదు. కారణమునూహ్యము.

## శూరుడు (అశ్వఘోషుఁడు)

17–18–19 శ్లోకములలో సముద్రగుప్తుఁ డశ్వఘోషుని సంస్తుతించెను. బుద్ధధర్మమునకు జీవనభూతములైన ఇతని రెండు కావ్యములలోనను రసభావాది సమస్త కావ్యధర్మము లేమాత్రమునూ నిరాదరింపఁబడలేదు. అట్లే ఇతఁ డితరములైన తొమ్మిది గ్రంథములను నిర్మించియున్నాఁడు. (కావ్యములను వదు) ఆ గ్రంథములు తొమ్మిదియునూ అధ్యాత్మజ్ఞానపర ములో లేక ధర్మకర్మ పరములో అయియున్నట్లు విద్వల్లోక మూహించుచున్నది. రసభావభరితములైన బుద్ధచరితము మరియు సౌనంద చరితము అను నీ రెండుత్తమ గ్రంథములు అశ్వఘోషుని పేర నేటికిని మిగుల విఖ్యాతి నందియున్నవి. సౌనంద చరితము ఇతని రెండవ కావ్యముగా సముద్రగుప్తుఁడు కీర్తించియున్నాఁడు. ఇప్పటి సౌందరనంద మశ్వఘోషునిదను ప్రసిద్ధిని కొందరు అనుమానించుచున్నారు. ఇపుడు విద్వాంసులు చూచుచున్న సౌందరనంద మహాకావ్యము స్వర్గీయ మహామహోపాధ్యాయ శ్రీ హరప్రసాద శాస్త్రిగారిచే ప్రకాశింపఁబడినది. అశ్వఘోషుని సౌనందచరితమే పై విద్వద్వరులచే సంగ్రహింపఁబడినదా? లేదా మార్పు చేయఁబడినదా? యను విషయమును గూర్చి ఇద మిత్థమని చెప్పుటకు వీలు కాకున్నది. ఈ యశ్వఘోష మహాకవి జన్మతః ఆర్యధర్మావలంబియై యుండి అటుపై సౌగతధర్మము నవలంబించి తద్ధర్మ రక్షణకును దాని యభివృద్ధికిని ఎల్లప్పుడునూ పరిశ్రమించెను. సముద్రగుప్తుని కాలములో బౌద్ధుల కార్యత్వములేవని తెలియుచున్నది. ఈ మహాకవి గొప్ప తర్కపండితుఁడై యుండి అశ్వఘోషుఁడను పేరున మిగుల ఖ్యాతి గాంచెను.

ఇతనికి లభించిన గొప్పకీర్తి ఇతఁడు ప్రపంచ తృతీయ బౌద్ధ సభలో సభ్యత్వము గాంచిన నాఁటినుండియూ గల్గెనట ప్రసిద్ధము. ఇపు డీతని పేరున లభించు గ్రంథములు కాశీనగర స్థితులైన శ్రీ బలదేవోపాధ్యాయునిచే రచింపఁబడిన సంస్కృత కవి చర్చలో యేయే గ్రంథము లుదాహరింపబడినవో వానినుండి యొసంగుచున్నాము. 1. బుద్ధచరిత 2. సౌందర నందము. 3. శారిపుత్రప్రకరణము. 4. వజ్రసూచ్యుపనిషత్. 5. మహాయానశ్రద్ధోత్పాదకమైన శాస్త్రము. 6. సూత్రాలంకారము. మిగిలిన ఈతని గ్రంథముల విషయము తెలియ రాకున్నది.

## హరిచంద్రుఁడు

ఈ హరిచంద్రుని గూర్చి 20 వ శ్లోకము వర్ణించుచున్నది. ఈ హరిచంద్రుఁడు పాంచాలరాజై యుండి కవియై యుండెనని సముద్రగుప్తుఁడు వచించియున్నాఁడు. కర్ణకీర్తి యను కావ్యమును రచించి ఖ్యాతి నార్జించెననియూ వర్ణితము. ఈ కర్ణకీర్తి పద్యమయమా? లేక గద్యమయమా? యని కూడ వచింపఁబడియుండలేదు. కాని భట్టబాణుని యభిప్రాయము ప్రకారము గద్యములో రచితమైన యొక గ్రంథము హరిచంద్రునిదై యున్నదని తెలియుచున్నది. అదెట్లనఁగా హర్షచరితములో ఇట్లున్నది:

"పదబంధోజ్జ్వలో హారీ
కృత వర్ణక్రమ స్థితిః,
భట్టార హరిచంద్రస్య
గద్య బంధో నృపాయతే."

ఇందలి భట్టార శబ్దము హరిచంద్రుని రాజత్వము స్పష్టము చేయుచున్నది. ఈ పై శ్లోకము కర్ణకీర్తి కావ్యము నధికరించి బాణుఁడు వచించెనా లేక మరొక కావ్యము నెద్దానిపైన గూర్చి వ్రాసియుండెనా యను విషయము స్పష్టముకాదు. "సుబంధో భక్తిర్నః" అను శ్లోకములో కూడ హరిచంద్రుని కీర్తించిన విషయమున్నది. ఇంతకన్న హరిచంద్రుని గూర్చి కొంచమైనను తెలియఁబడదు.

## మాతృగుప్తుఁడు

21 వ శ్లోకములో మాతృగుప్తుఁడు కీర్తింపఁబడెను. ఈ కవిశ్రేష్ఠుని గూర్చిన వర్ణన రాజతరంగిణిలో మాత్రమున్నది. ఇతఁడు మిక్కిలి దరిద్రుఁడై పలుకష్టములకు గురియై అవు డుజ్జయినిని పాలించు విక్రమాదిత్య బిరుదాభిరాముఁడైన హర్షవర్ధనుని దానశౌర్య విక్రమాదులను విని తన దారిద్ర్య బాధను పోగొట్టు కొనదలంచి యుజ్జయిని కేగెను. గొప్ప విద్వాంసుఁడు తా నయియుండియూ బయట గానిపించు దారిద్ర్య చిహ్నములైన కుచేలాదులను బట్టి ద్వారపాలకులు రాజదర్శనము నీతనికి గావింప నిరాకరించిరి. ఈ కవి గూడా వేరుగా పోక రాజప్రాసాదము బయటి ద్వారసమీపముననే యాశ్రయించి యుండెను. ఒకానొక సమయమున హేమంతమున శీతాధిక్యముచే నిద్ర పోలేకపోయెను. ఆ దినమున రాజా ద్వారపాలకుని పిలిచెను. ఆ సేవకుడు గాఢనిద్రలో నుండి రాజాన కుత్తర మీయజాల డయ్యెను. ఆ సమయము తన కనుకూలమైనదిగా భావించి

కవి అప్పటి తన దీనస్థితిని రాజున కొకశ్లోకముచే నిరూపించెను. ఆ పద్య మిది.

"శీతేనోద్ధుషితస్య మాషశిమివ చ్చింతార్ణవే మజ్జతః
శాంతాగ్నిం స్ఫుటితాధరస్య ధమతః క్షుత్క్షామకంఠస్య మే।
నిద్రా క్వా ప్యవమానితేవ దయితా సంత్యజ్య దూరం గతా
సత్పాత్రప్రతిపాదితేవ వసుధా న క్షీయతే శర్వరీ."॥

పై పద్యమును విని మహారాజు మిక్కిలి సంతోషించెను. ఆ కవికి పరమ స్నేహితుఁడయ్యె. దైవవశమున అప్పటి కాశ్మీర రాజు హిరణ్యుఁడు స్వర్గతుఁ డయ్యెను. అతనికి పుత్రసంతతి లేదయ్యె. అతని యన్నకుమారుఁడు అప్పటికి కాశ్మీరదేశము వెలుపల నుండె. అప్పుడు హర్షరాజు ఆ విషయమునంతయు విని తన మిత్రుఁడైన మాతృగుప్తుని కాశ్మీర రాజ్యమునకు రాజుగా నియమించెను. మాతృగుప్తుఁడు కూడ కాశ్మీర రాజ్య మనుభవించెను. కొంతకాలము జరుగగా హిరణ్యక రాజు యొక్క అన్నకుమారుఁడు కాశ్మీరమునకు రాగా అతనికి కాశ్మీర రాజ్యము నప్పగించి మాతృగుప్తుఁడు తన చరమ జీవితమును కాశీక్షేత్రమున గడపెనని తెలియుచున్నది.

మాతృగుప్తుని యొక పద్యమును క్షేమేంద్రుఁడు తన ఔచిత్య విచార చర్చలో నుదహరించెను. ఆ శ్లోకము ఏ గ్రంథము లోనిదో తెలియజేయఁడయ్యె. అందుచే అతని దే గ్రంథమో, లేక యెన్ని గ్రంథములను రచించియుండెనో అన్న విషయము కూడా తెలియరాదని శ్రీ జె. కె. శాస్త్రి వచించె. ముమ్ముందు చారిత్రకు లీతని విషయమును వెలిపరపగలరని నమ్ముచున్నాను.

## ఆ వం తి కుఁ డు

22 వ పద్యములో ఆవంతికుఁడు వర్ణింపబడియున్నాడు. ఈ యావంతికుని కావ్యము లేవి? ఇతనిచే రచింపఁబడినదనుచున్న శూద్రక జయకావ్య మెంత యుండెనను విషయము కూడ తెలియకున్నది. ఈ సముద్రగుప్త చక్రవర్తి పద్యము వలన ఈతఁడు శూద్రకజయ కావ్యమును వీరరసభరితముగా రచించి యుండెనని, ఈతని కావ్యకథ శూద్రకరాజజయ మని గ్రంథ నామధేయము వలననే తెలియుచున్నది. ఆ సర్గములకు ఆనందములని కూడ పేరున్నట్లు సముద్రగుప్తుని సంస్తవము వలననే తెలియుచున్నది. ఎట్లు భారవి మహాకవి తన కావ్యములోని అంత్యపద్యములకు లక్ష్మీశబ్ద సంకేత మొనర్చి యుండెనో అట్లే ఈ కవియు తన సర్గాంత శ్లోకముల కానంద సంకేతమును వ్రాసియుండును. అట్లే మాఘుఁడు కూడ తన సర్గాంత శ్లోకములకు శ్రీ శబ్ద సంకేత మొనరించె. ఇట్టి సంకేతముల కేదేని మంత్రశాస్త్రాది సంబంధముండి యుండవచ్చును. సర్గాంతానందకర్తయు శూద్రకజయ కావ్యకర్తయునైన యొకానొక పంచశిఖ కవిని గూర్చిన యుల్లేఖనము భోజరాజకృత శృంగార ప్రకాశములో కనుపడుచున్నది. ఈ పంచశిఖకవికే నామాంతర మావంతికుఁడని కొందరు తలంచుచున్నారు. ఏందుచేతననఁగా ఆవంతికుఁడను పేరు పుట్టు పేరయుండదు గాన పంచశిఖుఁడను నామమే ఈతని పేరై యుండదగి యున్నది. అవంతి దేశమ్మునఁ బుట్టుటచే ఇతఁ డావంతికుఁడై యుండెననుట నిర్వివాదము. శూద్రక కథకే శూద్రక జయమను పేరు వచ్చుటయు అసంభవ విషయమేమి కాదు. ఒకవేళ కథా శబ్దము గద్యకావ్యములకే పర్యాప్తమై యుండినను గద్యకావ్యములలో సర్గవిభాగము లేదనుట ఇందుచే తెల్లము. ఈ కవి జీవన మెట్టిదై యుండెననుటయు తెలిసికొనుట కష్టము. కావ్యేతిహాసములలో ఈతని పేరు పూర్తిగా తెలియరాదు గాన ఈతని వర్తనమును గూర్చి విచారింప వీలు లేకున్నది. ఇట్లు కాలగర్భమున వెందరు మహాకవులు కలిసి పోయిరో గదా?

## హ రి షే ణుఁ డు

ఇతడు రఘుకారుఁడైన కాళిదాసుఁడో? ఈ విషయమై శ్రీ జె. కె. శాస్త్రిగారు ఈ హరిషేణుని రఘుకార కాళిదాసని తమకు దొరికిన ఈ ప్రాచీన కృష్ణచరిత్ర ప్రతిలోని శిలాక్షరములను ఎట్లో చదివించి ఈ విషయమును లిఖించినట్లు వ్రాసినారు.

నాటకత్రయకర్త కాళిదాసు ప్రాచీనకాళిదాసుఁ డొక్కఁడు. అతని నిదివరకే కీర్తించుటయైనది. రఘువంశకర్త కర్తయైన కాళిదాసును వేరుగా వీరు భావించుచున్నారు. లోకమున కాళిదాసుని శ్రవ్య కావ్యములు మూఁడు రఘువంశము, కుమారసంభవము, మేఘదూతము. నాటకత్రయము శకుంతల, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము, అను ఆరింటి నొకే కాళిదాసు రచించి యుండినట్లు లోకములో పండితుల వాడుక మాటయై యున్నది. ఇందులకు భిన్నముగా నిపుడీ విషయము వ్రాయఁ బడినది. ఇద్దానిని కాళిదాసుల బహుత్వమును బట్టి నిర్ణయించ వలసినవారు చారిత్రకులు. వారికీ విషయమును వదలి శ్రీ జె. కె. శాస్త్రిగారి కృష్ణచరిత విమర్శనమును గూర్చి వ్రాయుచున్నాను. కాళిదాసులు మువ్వురని కొందరుమా, కాదు ఆర్గురని మరికొందరుమా, మరికొందరు పదునెనిమిదిమంది కాళిదాసులు కూడ కలరనియు ఈ విషయమును గూర్చి వివరించు చారిత్రకులు గలరు. ఇదమిత్థమని నిర్ణయము జరిగిన మీదట ఆ విషయమును విమర్శింతము. ప్రకృతమనుసరాము:.

ఈ విషయమును గూర్చి సముద్రగుప్తుని శ్లోకములు, 23 నుండి 26 వరకును మొత్తము మూఁడు శ్లోకములు హరిషేణుని గూర్చి వ్రాయబడియున్నవి.

ఈ రఘుకారుఁడైన కాళిదాసు హరిషేణుఁడని రాజసభలో ప్రసిద్ధుఁడై యుండినవాఁడని చారిత్రకులు తలంచుచున్నారు. ఇతఁడే నాటకత్రయకర్త కావ్యత్రయకర్త యయి యున్నాడు. ఇతడు గుప్తాన్వయ జాతుఁడైన రెండవ చంద్రగుప్త సార్వభౌముని సభాకవియై యుండెనని చారిత్రకుల

యాశయము. ఎందుచేతననగా కవి ముఖ్యుడైన కాళిదాసు విక్రమాదిత్య బిరుదము గల యొకానొక చక్రవర్తి యాస్థానమున సుప్రసిద్ధులైన నవరత్నములను బడు పండిత ప్రకాండులలో నొక్కడై యుండెనను ప్రసిద్ధి లోకమున గలదు. విక్రమాదిత్యు డను పుట్టు పేరుగల యే చక్రవర్తియును లేడు. కాని ఆయ్యది బిరుదు పేరుగా ప్రాచీన భారతీయ చక్రవర్తు లనేకు లా బిరుదు పేరును స్వీకరించి ధరించియున్నారు. కాళిదాసుడను పేరు ఎట్లు శూద్రకుని యాస్థానమందలి శాకుంతలకర్తయైన కాళిదాసున కుండెనో ఆట్లే ఇతర కవులకు కూడా ఆపేరు ప్రతిష్ఠా పదముగా స్వీకరింపబడినదై యున్నది (శాకుంతల కాళిదాసు యొక్క అతిలోక సామాన్య కవితా ప్రాగల్భ్యమునుబట్టి యాకీర్తి మొదటి కాళిదాసుడు సంపాదించియుండినందున) ఇతర కవుల పేరులు ఆ కాళిదాసుడను పేరుతో కూర్చబడినవి. అనంతరము ఆ కాళిదాస నామములచే ఉద్యోగనామముగా కాళిదాసులుగానే అయిరి. అందుచే ముగ్గురి కాళిదాసుల యస్తిత్వమును గూర్చి రాజశేఖరుడిట్లనుచున్నాడు.

"ఏకో న జీయతే హంత కాళిదాసో న కేనచిత్,
శృంగారే లలితోద్గారే కాళిదాసత్రయీ కిము?"

మా మతమున ముగ్గురు లేదా పెక్కురు కవుల కాళిదాసు పేరుచే ప్రసిద్ధి నార్జించిన కవు లుండిరని. అట్టివారు రచించిన రాక్షస నళోదయాది కావ్యము లున్నవి. ఆ విషయ మట్లుండుగాక. ఇక్కడ రఘుకారుడు వర్ణింపబడెను. ఇతడు హరిషేణు డను పేరుచే శ్రీ సముద్రగుప్త చక్రవర్తికి మిత్రుడై యుండెనని ఇందు వర్ణింపబడియున్నది.

హరిషేణుడు నిర్మించిన యొకానొక శిలా శాసన శిథిలములో నొక దానియందు సముద్రగుప్త చక్రవర్తి ప్రశస్తిలోనను రఘువంశములోనను సంవాదమిత గల పెక్కులు శబ్దార్థములు కనుపడుచున్నవి. పరీక్షింపగా నయ్యవి రెండునూ యొక కవిచే వ్రాయబడినవిగా నూహింప వీలున్నది. మేము ఇక్కడ అవ్వాని రెంటిలోని శబ్దార్థసామ్యమును వ్రాయుచున్నాము.

| హరిషేణకృత ప్రశస్తిలో | రఘువంశములో |
|---|---|
| 1. స్వభుజ బలపరాక్రమైక బంధోః | స్వవీర్యగుప్తా హి మనోః ప్రసూతిః |
| 2. ప్రసభోద్ధరణోద్వృత్త ప్రథానమహతః | ప్రసభోద్ధృతారిః |
| 3. లోక సమయక్రియానువిధాన మాత్ర మానుషస్య | మహీతల స్పర్శన మాత్రభిన్న<br>మృద్ధం హి రాజ్యం పద మైంద్ర మాహుః |
| 4. భక్త్యవనతిమాత్ర గ్రాహ్య మృదుహృదయస్య | ప్రణిపాత ప్రతీకార సంరంభో హి మహాత్మనాం |
| 5. పృథివ్యా మప్రతిరథస్య | క్షితా వభూ దేకధనుర్ధరో పి సః |
| 6. ... గ్రహణ మోక్షానుగ్రహ | గృహీత ప్రతిముక్తస్య స ధర్మ విజయీ నృపః<br>శ్రియం మహేంద్రనాథస్య జహార న తు మేదినీం. |
| 7. చరణ తలప్రమృష్టస్య పరపతికీర్తేః | చరణయో ర్నఖరాగ సమృద్ధిభిః<br>మకుటరత్నమరీచిభి రస్పృశన్.<br>నృపతయ శ్శతశో మరుతో యథా<br>శతమఖం త మఖండిత పౌరుషం. |
| 8. సాధ్వసా దూదయప్రళయ హేతు పురుషస్య | ఉదయ మస్తమయం చ రఘూద్వహాత్<br>ఉభయమాన శిరో వసుధాధిపాః<br>నహి విదేశ మలంఘ్య గతామభూత్<br>సహృదయో హృదయః ప్రతిగర్జితాం |
| 9. ధనదవరుణేంద్రాంతకసమస్య | అనుయయౌ యమ పుణ్యజనేశ్వరౌ<br>సవరుణా వరుణాగ్రసరం రుచా |
| 10. స్వభుజబలవిజిత అనేక నరపతి విభవప్రత్యర్పణ... | ఆదానం హి విసర్గాయ సతాం వారిముచా మివ.<br>...పురప్రక్రియాభిర్గ్రీభిః శమితరాజయ వ్యలీకాః.<br>ఇత్యాదులు. |

ఇవియే గాక ఇంకనూ యెక్కువగా సాదృశ్యములు వర్ణనలో కనువడుచున్నవి. విస్తరభీతిచే వ్రాయనైతి. ఈ కవి సముద్రగుప్తుని తండ్రియైన చంద్రగుప్తునికి చిరకాలము మంత్రిగా నుండెను. అటుపైన సముద్రగుప్తుని మిత్రుడయ్యెను. ఇతడు కుమార సచివ బిరుదుచే విరాజితుడై సంధి విగ్రహాది కార్యముల యందు నియుక్తులైన మంత్రులలో ముఖ్యుడై యుండెను. కావ్య మనుటతో రఘువంశ కావ్యమే సముద్రగుప్తుని యభిప్రాయముగా తోచుచున్నది. ఎందుచేత ననగా రఘుకారుడను పేరు ఇందు చెప్పబడినందున నై యూహ సార్థకము. ఆ పేరితని పుట్టుపేరు గాకున్నను రఘువంశ కావ్యమును నిర్మించి బిరుదు నామముగా రఘుకారుఁడను ఖ్యాతి నార్జించెను.

ఈ హరిషేణుడు స్వప్రతిభా వ్యుత్పత్తులచే గొప్పకీర్తిని సంపాదించి కాళిదాస బిరుదమును దాల్చెను. కవిత్వ విషయము సందేగాక ధర్మకర్మల విషయములలో కూడా నీతని వాక్యము ప్రమాణీకరింపబడుట కాళిదాస నామము వచ్చుటకు మరొక్క కారణమై యున్నది. ఎందుచేత ననగా ఈతడు ప్రతి యజ్ఞకర్మ యందును ఎల్లపుడునూ బ్రహ్మత్వము సంపాదించె ననగా నీ విషయమున నిక చెప్పవలసిన దేమున్నది? యజ్ఞములలో బ్రహ్మత్వము రావలెనన్న అన్నివేదములను తెలిసియుండవలె. అన్నివిద్యల యందును పాండిత్యము గలవాడై యుండవలె. ఇందులకు నిరుక్తము 1–8 లో ''బ్రహ్మ సర్వ విద్యః, సర్వం వేదితు మర్హతి'' అని యున్నది. ఈతని యొక కావ్యము రఘువంశము ప్రసిద్ధమే అయియున్నది. అంతియేగాక మరినాల్గు కావ్యము లీతని వున్నట్లు సముద్రగుప్తుఁడు వచించియే యున్నాడు. ఏ వా కావ్యములని విచారింపగా మేఘసందేశము, కుమార సంభవము అను రెండు కావ్యములు కనుపడుచునే యున్నయవి. మిగిలిన రెండు కావ్యము లెవ్వియో తెలియవు. ఆ కావ్యములు నానాచరిత్ర శోధనములైనవని చెప్పియుండుటచే అట్టి కావ్య నిర్మాణముచే నీతడు శాశ్వత కీర్తిని సంపాదించెననుట స్పష్టము. ఈ కవి యొద్ద చదివియో లేక ఈ కవిచే నుత్సాహము గల్గింపబడియో సముద్రగుప్త చక్రవర్తి ఈ కృష్ణచరితము నిర్మించియుండుననుట స్పష్టము.

## ఉ ప సం హా ర ము

ఈ ద్వితీయ భాగములో రాజకవులు వర్ణింపబడినారు. ఎవరా రాజకవి సంజ్ఞను పొందిన వారనుటకు సముద్రగుప్తుడే స్వయ మిట్లు వచించియున్నాఁడు.

''ఏషాం న కేవలం కావ్యం శ్రేష్ఠం ధర్మార్థకామదం
రాజతా వా రాజనీతి రువకర్త్రీ మనస్వితా'' (27శ్లో.)
తే రాజకవయో మాన్యాః శుద్ధకర్మగుణైర్భువి
వర్ణితా అష్టగురవో దిగ్నాగప్రతిపక్షిణః (28 శ్లో.)

ఏ కవులు రాజులై యుండిరో, ఎవ్వరైతే మునికవుల వలె ధర్మార్థకామ ప్రదర్శకములైన కావ్యములను రచించి కీర్తిని సంపాదించియుండిరో, ఎవ్వరు రాజసభలలో నిలిచి రాజబంధువులై యుండిరో, లోకుల చతుర్వర్గములకై యెవ్వరు కవనమును మనోహరముగా రచించిరో ఎవ్వరు రాజనీతిజ్ఞులో ఇట్టివారు రాజకవులని వచింపఁబడియున్నది. అట్టి కవుల సముల వారి గుణములు మిక్కిలి పవిత్రములై యుండినవి. ఒకవేళ పలువురు రాజకవు లుండియుందురు. అందులో శ్రేష్ఠులైన వారి నెనమండుగురిని ప్రత్యేకముగా నేరి సముద్రగుప్తుఁడు వర్ణించెను. ఆ యెనమండుగురు కవులు దిగ్విఖ్యాతులైనవారు. ''ఇచ్చట దిఙ్నాగ ప్రతిపక్షిణః'' అను మాటను పట్టుకొని ఈ యెనమండుగురు బౌద్ధాచార్యుఁడైన దిఙ్నాగాచార్యుని విరోధులని భావింపరాదు. ఎందులకింత దూరము వ్రాయవలసి వచ్చెననఁగా మేఘదూత వ్యాఖ్యలో మల్లినాథసూరి దిఙ్నాగ పదమును చూచి ఎట్లో లాగి కాళిదాసు దిఙ్నాగాచార్య విరోధియని వ్యాఖ్యానించె. ఇక్కడ 'దిఙ్నాగ ప్రతిపక్షిణః' అను పదము ప్రత్యక్షముగనే కనువడుచున్నది. ఈ మాటకు దిగ్గజోపములని తలంచుటయే యుక్తము. కావ్యాదర్శములో ప్రతిపక్షి శబ్దమునకు కూడ ఉపమావాచకమే చెప్పబడియున్నది.

ఇంతతో గ్రంథము ముగియుచున్నది. మిగిలిన జీవికా కవులనుగూర్చి వ్రాసిన భాగము పూర్తిగా ఖిలమైనది. ముందొకవేళ యెచ్చటనైన లభించినచో నా విషయమును విచారింపనగు. శ్రీ జె. కె. శాస్త్రిగారి కృషి ఫలితముగా ముద్రితమైన కృష్ణచరితము వలన ఎన్నియో ప్రాచీన చారిత్రకాంశములు లభించినవి. ఇందులో సందేహములు కల్గుటలేదని కాదు. అయినను ముమ్ముందు చారిత్రకులకు ప్రాచీన రాజులయు మహాకవులయు చరిత్రలను వ్రాయునపు డీ విషయములు ముఖ్యముగా లెక్కింపదగినవై యున్నవి. ఇట్లు మంచి మంచి యుద్గ్రంథము లపూర్వములైన వానిని సంపాదించి వానిని ముద్రించి ప్రకటించి లోకోపకార మొనర్చిన శ్రీ జె. కె. శాస్త్రిగారికిని అట్టి వారైన పండితప్రకాండులకు కేల్మోడ్చుచు ఇంతటితో నీ విషయమును విరమించుచున్నాను.

# జినవల్లభుని గంగాధరం శిలాశాసనము

## డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య

ఈ శాసనము ఆంధ్రప్రదేశములోని కరీంనగరు జిల్లాకు చెందిన గంగాధరమను గ్రామము సరిహద్దులయందుండు బొమ్మలగుట్టయను కొండశిఖరమున నొక గండశిలమీద జెక్కబడియున్నది. ఇటీవల దీని యునికిని గనిపట్టి ఆంధ్రప్రదేశ ఆర్కియాలజీ డిపార్ట్‌మెంటు శాసనశాఖవారు దీని ప్రతిబింబమును దీయించిరి. సదరు డిపార్టుమెంటు డైరెక్టరు గారైన శ్రీ ముహమ్మదు అబ్దుల్ వహీద్‌ఖానుగారి అనుమతితో దీని నిచ్చట ప్రకటించుచున్నాడను.

ఈ శాసనమున 14 అడుగుల 5 అంగుళముల కొలతగల పంక్తులు పదియు, 4 అడుగుల కొలతగల పంక్తి యొకటియు మొత్తము పదునొకండు పంక్తుల వ్రాత కలదు. అక్షరముల పరిమాణము $1\frac{1}{8}$ అంగుళములు మొదలుకొని గుణింతము ననుసరించి తగ్గుచు హెచ్చుచున్నది. అక్షరములు లోతుగ జెక్కబడియున్నవి; శైథిల్యము అరుదు. అచట నచట ఒండు రెండు అక్షరములు రాయి పెడెత్తుటవలన రూపుమాసి పోయినను వానిని యూహించి కనుగొనుట కష్టముగాదు.

లిపి:—ఇందలి లిపి క్రీ. శ. తొమ్మిది పది శతాబ్దులలో తెలింగాణమున వాడుకయందుండిన తెలుగు కన్నడ లిపి. అక్షరము లించుక పెద్దవైనను రెండవ యరికేసరి వేములవాడ శాసనాక్షరములను మిక్కిలియు బోలియున్నవి.

భాష:—ఈ శాసనమునందు సంస్కృత కర్ణాటాంధ్ర భాషలు మూడును వాడబడినవి. ఇది గద్య పద్యాత్మకము. "ఓం నమః సిద్ధేభ్యః" అను సంస్కృత వాక్యముతో ప్రారంభ మగుచున్నది. తరువాత నొక దీర్ఘ కన్నడ గద్య, పిమ్మట మూడు సంస్కృత వృత్తములు (రెండు శార్దూల విక్రీడితములును, నొక్క పృథ్వియు), అటు వెనుక కన్నడ వృత్తము లారు (చంపక మాలలు నాలుగు, మత్తేభ విక్రీడిత మొకటి, తరళ మొకటి), పిమ్మట తెలుగు పద్యములు (కందములు) మూడు, కడపట చిన్న కన్నడ వచన మొకటియు గలవు.

గుణింతము:—ఇకార ఎకార హ్రస్వ దీర్ఘరూపములకు భేదము గాన్పించదు. సందర్భమునుబట్టి వాని భేదమును గనుగొనవలసియున్నది. కాని కొన్నియెడల ఇకారముయొక్క దీర్ఘ రూపము, లోనికి మడిగొనిన యక్షరముయొక్క గుడివలన సూచింపబడినది. ప్రాచీన శాసనములందువలె నిందును రేఫముతో గూడిన హల్లు ద్విత్వ మగుచున్నది. కాని 7—వ పంక్తిలోని 'విక్రమార్జున విజయక్కె' అనుచోట మాత్ర మట్లు కాక ఇప్పటివలెనె ద్విత్వము కాకయున్నది. ప్రాయికముగ నాయా వర్గాక్షరములకు సంబంధించిన యనునాసికము సందర్భోచితముగ నుపయోగింపబడినను పెక్కుచోట్ల వర్గానునాసిక స్థానమున పూర్ణానుస్వారము వాడబడినది. ద్విత్వణకారములందు ణ వత్తునకు బదులు న వత్తు వ్రాయబడియున్నది. 'మ'కార 'వ'కారములు రెండు విధములుగ గన్పట్టుచున్నవి. సామాన్యముగ నవి కొంచె మించు మించు యిప్పటి 'మ' 'వ' లకు చేర్పుగుచున్నను రేఫయుక్తమైనపుడు కొన్ని యెడల గొలుసు వ్రాతలో ర కు 'మ' 'వ' వత్తు లిచ్చినట్లగుపడుచున్నవి. (ర్మ, ర్వ.)

శిల్పి ఈ శాసనమును జాగరూకతతో జెక్కినను అచట నచట తప్పులు దొరలినవి. తెలుగు పద్యములలో నివి యధికముగ గన్పట్టుచున్నవి. దీనికి గారణము శిల్పికి తెలుగుతో పరిచయము లేకపోవుటయే యని తోచుచున్నది.

శాసన విషయము:—ఇది కర్ణాటక కవిరత్నత్రయమం దాద్యుడైన పంపని తమ్ముడగు జినవల్లభుని ప్రశస్తి. ఇందు అతని వంశక్రమమును, గుణసంపత్తియు, వైదుష్యమును, వదాన్యతయును, మతాభినివేశమును, ఘనకార్యములును వర్ణింప బడినవి.

వెంగినాటి వస్త్రగ్రామములోని వంగిపఱ్ఱు కమ్మ బ్రాహ్మణుడును, జమదగ్ని పంచార్షేయ శ్రీవత్సగోత్రుడును, గుండికఱ్ఱులోని నిడుగొండ వాస్తవ్యుడైన అభిమానచంద్రుని మనుమడును, భీమనయ్యయొక్క బెల్వొలములోని యణ్ణిగెరె జోస్యుడైన సింఘని మనుమడును, నబ్బణబ్బె కొమారుడును, కొండకుంద దేశిగణపు పొత్తగెమార్గపు వణ్డరంగవల్లికి సంబంధించిన జయంగొండ సిద్ధాంతదేవుని శిష్యుడునైన జినవల్లభుడు, నబ్బినాటి నట్టపడుమ నుండు ధర్మపురమున కుత్తరమున నుండు వృషభగిరియను ననాది సంసిద్ధ తీర్థముయొక్క దక్షిణ దిశా భాగమునందున్న సిద్ధశిలమీద తమ కులదైవము లగు నాద్యంత జినుల బింబములను, చక్రేశ్వరిని, యితర జిన

ప్రతిమలను, త్రిభువనతిలకమను జినాలయమును, కవితా గుణార్ణవమను చెఱువును, మదన విలాసమను వనమును నిర్మించెను.

జినవల్లభుడు భీముని కుమారుడు, పంపాఖ్యుని యనుజుడు. ఇతడు సకల కళాప్రవీణుడు, భవ్య రత్నాకరుడు, గుణపక్షపాతి. చతుర కవిత్వ రచనయందు సుప్రసిద్ధుడు. పెక్కు విధముల కావ్యములు విరచించుటయందును, కవిత్వ తత్త్వము తెలిసి తగినట్లు వివరించుటయందును, సత్పురుషులకు విద్య నేర్పుటయందును, శ్రావ్యముగ సంగీతము పాడుటయందును, రాగయుక్తముగ చదువుటయందును నితని శక్తి సామర్థ్యము లింతో సాటిలేనివి; కావున నీ జినవల్లభు డొక్కడె వాగ్దేవికి శ్రేష్ఠుడైన వల్లభుడు.

జినవల్లభుడు జిన భవనములను నిర్మించుటయందాసక్తి కలవాడు. ద్విజుల కావాస స్థానమైన యున్నత పర్వత శృంగముపై జినబింబములను జెక్కించి జినవల్లభునికి దానినొక చైత్యాలయముగ గావించెను. వృషభేశ్వరునితో గూడిన యీ కొండ (భరతఖండ) దక్షిణార్ధపు వృషభాద్రియై కవితా గుణార్ణవుని (పంపని) కీర్తిమూర్తిని బోలి ముదావహము కానగును. జినవల్లభుడు జినపూజా పరాయణుడు. జినమునుల నర్చించి వారికి వలసిన యాహారాదులను సమర్పించువాడు. వృషభాద్రియందు జినునకు క్షీరాభిషేకమును జేయించువాడు. యాత్రార్థ మచ్చటికరుగుదెంచిన భవ్య జనులకు సన్మానము జేయువాడు.

చాళుక్య వంశాధిపతియైన అరికేసరి నృపశ్రేష్ఠుడు విక్రమార్జున విజయమునకు మెచ్చి ధర్మపురమును పంపనికి దన కీర్తి శాసనముగ నిచ్చెను. అందు చెక్కబడిన పంపని బిరుదములను ప్రసిద్ధమైన జినధర్మమును వృషభాద్రియె ప్రకటించుచున్నది. ధర్మముయొక్క యశస్సు హెచ్చునట్లు హరిగడు (అరికేసరి) మెచ్చి పంపని కిచ్చిన బ్రాహ్మణ సభమైన అగ్రహారము సుప్రసిద్ధమైన కలావ గ్రామమునకు సదృశమైనది. తామ్ర శాసనము వ్రాయబడినదా? ప్రసిద్ధుడైన యరికేసరి ధర్మపురము నిచ్చెనా? సుప్రసిద్ధుడైన పంపడు దానిని పడసెనా యను పిచ్చిప్రశ్న లడుగువారు వృషభ పర్వతమునకు బోయి యందున్నత శిలాతలమునజెక్కియుండు శాసనాక్షరము లను చదివి తమ సంశయమును బోగొట్టుకొనవచ్చును.

లేఖకుడు:—జినవల్లభుని ధర్మకార్య సంతతిని, గుణావళిని యెఱిగియున్నయును నతడు వృషభగిరి యందలి సిద్ధశిలపై టంకోత్కీర్ణము గావించెను.

ఈ శాసన విషయమును చర్చించునపుడు మొట్టమొదట విమర్శింపదగిన దిందలి వంశక్రమము. ఇందు జినవల్లభుడు తాను పంపని తమ్ముడని పెక్కు పర్యాయములు వ్రాసుకొనియున్నాడు. ఆ పంప దెవ్వడనగా సుప్రసిద్ధమైన విక్రమార్జున విజయమును రచియించి దానికి పారితోషికముగ చళుక్యపతియైన యరికేసరి నృపాలుడు మెచ్చి యిచ్చిన ధర్మపురము నగ్రహారముగ బడసినవాడు. కవితా గుణార్ణవ బిరుదాంకితుడు. కావున విక్రమార్జున విజయకర్తయైన పంపడు జినవల్లభుని యన్న యని తెలియుచున్నది. కాని వీరు వివరించిన వంశానుక్రమణిక లొక్కతీరున నుండక వ్యత్యస్తముగ గన్పట్టుచున్నవి. జినవల్లభుడు గంగాధర శాసనములో దన వంశక్రమము నిట్లు చెప్పియున్నాడు. వెంగిపర్రు గ్రామములో చేరిన గుండి కమ్మలోని నిడుంగొండ వాస్తవ్యుడును, జమదగ్ని సంవార్షేయ శ్రీవత్సగోత్రుడైన యభిమాన చంద్రుని మనుమడు. భీమపయ్యయొక్క జోళాలమందరి యణ్ణిగెరె జోయ్యడైన సింఘుని మనుమడు. భీమునికిని వబ్బణబ్బెకును బుట్టిన పుత్రుడు. పంపని తమ్ముడు. తన పూర్వికుల వృత్తాంతమును విక్రమార్జున విజయమందు పంప డిట్లు తెల్పియున్నాడు. వెంగిమండలములోని వెంగిపఱ్ఱునకు జేరిన వసంతకొట్టూరు నిడుగుంది విక్రమపురములో వత్సగణ్యుడైన బ్రాహ్మణుడు మాధవ సోమయాజి. అతని పుత్రుడు అభిమాన చంద్రుడు. అభిమాన చంద్రుని కుమారుడు కుమరయ్య; కుమరయ్య సుతు డభిమాన దేవరాయడు. ఇతడు మతములలో నెల్ల జైనమతమే శ్రేష్ఠతమమైనదని నిశ్చయించి వైదిక ధర్మమును విసర్జించి జినేంద్ర ధర్మమును స్వీకరించెను. ఇతని తనయుడే పంపడు. తండ్రివలె పంపడును జైనమతము ననుసరించెను. తాను కొండకుందాన్వయమునకు జెందినవాడనియు, దన గురువు దేవేంద్రముని యనియు నతడు చెప్పుకొనియున్నాడు. అతని బిరుదులు పెక్కుగలవు. అందు 'కవితా గుణార్ణవ' యనునది ముఖ్యమైనది. విక్రమార్జున విజయములోని యాశ్వాసాంత గద్యములు పదునాల్గింటియందును 'కవితా గుణార్ణవ విరచితమప్ప' యనియే కలదు. పై వివరించిన వంశవృక్షముల నీ క్రింది విధముగ విరచింపవచ్చును:—

గంగాధర శాసనము :




విక్రమార్జున విజయము :



ఈ వంశావళులు రెండును నొకతీరుగ నుండక వ్యత్యస్తముగనున్నవి. గంగాధర శాసనమున వంశావళి అభిమాన చంద్రునితో నారంభమగుచున్నది; విక్రమార్జున విజయమునం దభిమాన చంద్రుని తండ్రియగు మాధవ సోమయాజితో ప్రారంభించుచున్నది. ఇది పరిగణింపదగిన భేదము కాదు. జినవల్లభుడు అభిమాన చంద్రుని తన వంశమునకు మూలపురుషుడని చెప్పగా, పంపడు మఱియొకతరము వెనుకకు బోయి యభిమాన చంద్రుని తండ్రియైన మాధవ సోమయాజి వంశమునకు మూలపురుషుడని చెప్పెను. జినవల్లభుడు అభిమాన చంద్రుని తరువాత భీముని పేర్కొని తా నభిమాన చంద్రుని మనుమడనియు భీముని పుత్రుడనియు వచించినాడు. పంపడు, అభిమాన చంద్రుని కొడుకైన కొమరయ్యను వాని కుమారుడును దన తండ్రియగు నభిమానదేవరాయని బేర్కొనినాడు. జినవల్లభుడు కొమరయ్యను బేర్కొనలేదు. మీఁదుమిక్కిలి తాను అభిమానచంద్రుని మనుమడనియు, దన యయ్య పేరు భీముడనియు చెప్పియున్నాడు. మనుమడన వంశీయుడని యర్థము చేసికొనవచ్చును. అట్లు సిద్ధమగుటచేత కుమరయ్యను బేర్కొనలేదని యెంచినను తండ్రినామము భిన్నమగుట యెట్లు? గంగాధర శాసనమున జెప్పినట్లు పంపడును జినవల్లభుడు అన్నదమ్ములే యైనచో వారియం దొక్కడు తన తండ్రి యభిమానదేవరాయడనియు మఱియొక్కడు భీముడనియు జెప్పుకొనుట యెటు తటస్థించినది? అభిమాన దేవరాయ డనునది భీముని నామాంతరమా? వాస్తవము పరిశీలింపగా పంపని తండ్రిపేరు అభిమాన దేవరాయడు గాదు. ఇది ప్రమాద జనితము. విక్రమార్జున విజయమును బరిష్కరించి ప్రకటించిన పండిత ప్రకాండులు తాళపత్ర ప్రతులు గొన్నిటియందు గానవచ్చు పాఠమును గ్రహించుటవలన గలిగినది. విక్రమార్జున విజయ చతుర్దశాశ్వాసములోని

> అకొమరయ్యం గనెని త
> లాకాశవ్యాప్తకీర్తి నిజగుణమణిర
> త్నాకర నబ్జాననమో
> హీకర నభిమానదేవరాయం తనయం॥

అను పద్యముయొక్క చతుర్థపాదము కొన్ని తాళపత్ర ప్రతులయందు 'తమో॥ వికరం భీమనామధేయం తనయం' అనియు, 'తమో॥ హీకరం భీమనామధేయం తనయం' అనియు పాఠాంతరములు గానవచ్చుచున్నవి.[1] పాఠాంతరములోని భీమనామమే పంపని తండ్రియొక్క నిజమైన పేరని గంగాధర శాసనము ఋజువు చేయుచున్నది; కావున యభిమాన దేవరాయ నామము ప్రమాద జనితమగుటచే విసర్జనీయము. జినవల్లభుడు తాను వబ్బణబ్బె కుమారుడనియు జోయిన సింహుని మనుమడనియు బంపని తమ్ముడనియు జెప్పుకొనియున్నాడు గదా. పంప చెప్పుటను పిదమాట ఎత్తుకొనలేదు. దీనికి కారణ మేమి? పంపడును జినవల్లభుడును సహోదరులు గారేమో. వబ్బణబ్బె పంపనికి సవతితల్లి యగునేమో. తత్కారణమున నతడు వబ్బణబ్బెనుగాని యామె తండ్రియైన జోయినసింహునిగాని కుమారుడైన జినవల్లభునిగాని పేర్కొని యుండకపోవచ్చును.

ప్రస్తుత శాసనము పంపని కులగోత్రాదులను గూర్చియు వానియొక్కయు వాని పూర్వులయొక్కయు నివాసస్థానము లనుగూర్చియు గొన్ని నూతనాంశములను దెల్పుచున్నది. విక్రమార్జున విజయమందు పంపడు తనది శ్రీవత్స గోత్రమని మాత్రము సూచించియున్నాడు. ప్రస్తుత శాసనమందు జినవల్లభుడు తాను వంగిపఱ్ఱు కమ్మబ్రాహ్మణుడనియు, జమదగ్ని పంచార్షేయ శ్రీవత్స గోత్రజుడనియు చెప్పియున్నాడు. వంగిపఱ్ఱు యన్నది యొకగ్రామము. దీనివిషయము క్రింద వివరింపబడును. వంగిపఱ్ఱు కమ్మ బ్రాహ్మణు డనగా నా గ్రామమునకు జెందిన కమ్మనాటి బ్రాహ్మణుడని యర్థము. ఆంధ్రదేశమునందీ తెగవా రుండినట్లు ప్రాచీన శాసనములవల్ల దెలియుచున్నది. మైసూరు ప్రాంతమున నిప్పుడును గమ్మె బ్రాహ్మణు లున్నారు. కర్ణాటక బ్రాహ్మణులలో నెనిమిది శాఖా భేదములు గలవు. ఆయెనిమిదింట గమ్మె బ్రాహ్మణశాఖ యొక్కటి; వీరు స్మార్తులు. వేంగిదేశమునందలి కమ్మనాటినుండి వీరు మైసూరు ప్రాంతమునకు బోయిన ట్లైతిహ్యము గలదు.

పంపడు తమవంశమునకు మూలపురుషుడైన మాధవ సోమయాజి వెంగిమండలములోని వంగిపఱ్ఱుతో జేరిన వసంత కొట్టూరు నిడుగుంది విక్రమపురము లోనగు నగ్రహారములందు ప్రముఖుడని చెప్పియున్నాడు. జినవల్లభుడు తాను వెంగినాటి వస్త్రగ్రామములోని వంగిపఱ్ఱు కమ్మబ్రాహ్మణుడనియు, తన తాత యభిమాన చంద్రుడు గుండికఱ్ఱు నిడుంగొన్న వాస్తవ్యుడనియు, తన మఱియొక తాత(మాతామహుడు) బెల్వోలములోని యణ్ణిగెఱెయందు జన్యుడనియు, తాను సబ్బినాటి పట్టణమునందు ధర్మపురమున కుత్తర దిగ్భాగమందుండు వృషభాద్రికి దక్షిణపు దిక్కునందు సిద్ధశిలపై జినప్రతిమలు జెక్కించి బసదిని గట్టించి చెఱువు త్రవ్వించితి ననియు, మఱియు చాళుక్య రాజైన యరికేసరి దనయన్నయైన కవితాగుణార్ణవ బిరుదాంకితుడగు పంపనికి ధర్మపురము నగ్రహారముగ నిచ్చెననియు, వది కళావ గ్రామమును బొందెననియు జెప్పియున్నాడు. ఇందు పేర్కొనిన దేశవిభాగములు నాలుగు: వెంగినాడు, గుండికఱ్ఱు, సబ్బినాడు, బెల్వోలము. పర్వతములు రెండు: వృషభాద్రి, సిద్ధశిల. గ్రామములు అయిదు: వంగిపఱ్ఱు, నిడుంగొన్న, ధర్మపురము, అణ్ణిగెఱె, కళావగ్రామము.

స్థలనిర్దేశము:— పైజెప్పిన దేశవిభాగాదుల యునికి పట్టులను కనుగొందము.

దేశవిభాగములు:—మొదట వెంగినాటినిగూర్చి. జినవల్లభుని వెంగినాడే పంపని వెంగిమండలము. వెంగియను పేరు ఆద్యము గృష్ణా గోదావరీ మధ్యస్థతీరాంధ్ర దేశమునకు వర్తిలుచుండినది. చాళుక్యులు క్రీ. శ. 7వ శతాబ్దిపూర్వార్ధమున

1. విక్రమార్జున విజయం. 14, f.n.

త్రిలింగ్రాంధ్ర భూమిని సమస్తమును జయించినప్పటినుండియు వారి రాజ్యాభివృద్ధి ననుసరించి దాని వైశాల్యమును వైపుల్యము నంది వారియేలుబడి క్రిందటి రాష్ట్రమున కంతటికిని పేరై చెల్లుచు వచ్చెను. తత్కారణమున కృష్ణానదికి దక్షిణమందుండు త్రిలాంధ్రమునుగూడ వెంగిమండలాంతర్గతముగ బరిగణింపబడు చుండినది. కావున పంప జినవల్లభులకు సమకాలికుడైన పొన్నడు కృష్ణకు దక్షిణపార్శ్వమున నుండు కమ్మనాటిని వెంగివిషయము నకు మకుటాయమానమైనదని ప్రశంసించియున్నాడు.

> వేంగీవిషయం త్రిభువన
> వంగోత్తుంగ శద విషయ మునమాలితం
> సంగత సమస్త మర్త్య
> తుంగ ఫలద్రుమ మమూల్యవస్తునిధానం॥

ఆ ధరణీ వధూతిలక మాధరణీలలామముఖాబ్జమం దాధరణీరమైకమనయావన మాధరణీప్రియా కటా క్షాధర విభ్రమ భ్రమణ మగ్గళదగ్గళ కమ్మనాడు వి ద్యాధరలోకమే నదిఁక పోల్పగ బర్బూమె పోలదిర్బూమే.[2]

**గుండికల్లు:**— ఇది గుండికరకు నామాంతరము. గుండి కర యనగా గుండి (గుండ్లకమ్మ) నదీతీరదేశము. గుండినది కర్నూలు మండలములోని తూర్పుకనుమలయందు దుద్భవించి గుంటూరుమండలములోని యొంగోలు తాలూకా గుండ పూర్వ వాహినియై ప్రవహించి సదరు తాలూకాలోని కనుపర్తి గ్రామము చెంత బంగాళాఖాతముతో సంగమించుచున్నది. క్రీ. శ. 9,10,12, శతాబ్దులనాటి త్రిలాంధ్ర శాసనములలో నీ గుండి కర ప్రస్తావము కలదు. క్రీ. శ. 9,10 శతాబ్దులలో ప్రచార మందుండిన తెలుగు— కన్నడ లిపిలో వ్రాయబడియుండు కర్నూలు మండల సంగమేశ్వర శాసనములం దొక్కదానియందు సదరు గ్రామమందలి సంగమేశ్వరాలయము (రాతిరథము)ను గుండికళ్లితి దోయూరి యూచార్యుల కొడుకు నడిపి యోవాజు కట్టినటు ల్లున్నది.[3] శకాబ్దము 1069 నాటి గుంటూరు మండల మందలి కొణిదెన శాసనమందు 'గుండికల రాచకొడు కులు దేవట్ల నాకనాయకులు'ను బేర్కొనబడి యున్నారు. శకాబ్దము 1072 నాటి మరియొక శాసనమునం దప్పుడు కొణిదెనయందు రాజ్యముచేయుచుండిన త్రిభువనమల్లదేవు డను రాజు 'కమ్మనాండును, గుండికల్లు నొట్టవాడియుం జేకొని' నటుల చెప్పి యున్నది.[4] ఈ శాసనముల వలన గుండికల లేక గుండికల్లు యనునది గుంటూరు మండలమందు గుండి నదీ తీరమున నుండు రాష్ట్ర విభాగమునకు పేరై యుండినట్లు తెలియుచున్నది.

**సబ్బినాడు:**— తెలంగాణ ప్రాచీన శాసనములు గొన్నింట సబ్బినాడును, నందలి గ్రామములు గొన్నియు బేర్కొనబడి యున్నవి. శకాబ్దము 888 నాటి పర్భణి తామ్రశాసనము నందు లేంబులవాటిక (వేములవాడ) రాజధానిగ దత్ప్రాంత దేశమును బాలించుచుండిన చాళుక్య ముమ్మడి యరికేసరి మహారాజు సబ్బి సాయిరాంతర్గతమైన రేపాక 12 లోని కుత్తం వృత్తి వనికటుపలు అను గ్రామమును సుప్రసిద్ధ జైనమతా చార్యుడైన సోమదేవసూరికి దానము జేసినట్లు చెప్పియున్నది.[5] పై జెప్పిన రేపాక యందే ముమ్మడి అరికేసరి యొక్క శిలా శాసన మొక్కటి కూడ గలదు.[6] శకాబ్దము 1092 నాటి కాకతిరుద్ర దేవుని కరీంనగర శాసనమున సబ్బినాడును నందలి నగరూరును బేర్కొనబడినవి.[7] ఈ నగరూరే యిప్పటి నగ నూరు. మఱికి సింగనకృత పద్మపురాణోత్తరఖండ పీఠికలో దత్పుర్యధిపతి యగు ముప్ప భూపాలుడు గౌతమీ దక్షిణ తటం బున సబ్బినాటి రాష్ట్రమున రామగిరి పట్టణము రాజధానిగ రాజ్యము చేయుచుండెననియు, నతని దండనాయకుడైన వెలగందల కేసన రామగిరియందు విష్ణ్వాలయము గట్టించి ధర్మపురియం దన్నసత్రము వెలకొల్పెననియు జెప్పియున్నది.[8] పై జెప్పిన రేపాక, నగరూరు (నగనూరు), రామగిరి, ధర్మ పురి మున్నగు గ్రామములన్నియు నిప్పటి కరీంనగరు జిల్లా యందు కానవచ్చుచున్నవి. కావున పూర్వమీ కరీంనగర జిల్లాకు సబ్బినాడను పేరు చెల్లుచుండెనని నిశ్చయముగ జెప్పవచ్చును.

**బెళ్వోలము:**— బెళ్వోల మనునది బెళ + పొల అను మాటల కూడిక వలన నేర్పడినదనియు, 'ధాన్యము పుష్కలముగ నుత్పత్తియగు దేశ'మని దాని యర్థమనియు, నది పూర్వము మూడువందలు గ్రామములు గల రాష్ట్రమనియు నిప్పటి ధార్వాడజిల్లా నవల్‌గుండ తాలూకాలోని యణ్ణిగెరె యను పట్టణము దాని రాజధాని యనియు డాక్టరు ఫ్లీట్ గారు నిర్ధారించి యున్నారు.[9]

**పర్వతములు:**— వృషభాద్రిః వృషభాచలము, వృషభ పర్వతము, వృషభగిరి, వృషభమహీంద్ర మనియు దీని నామాంత రములు. ఈ వృషభాద్రి యెచ్చట నున్నదో నిశ్చయించి చెప్పుటకు వలనుగాకున్నది. శాసనమునం దిది (భరతఖండపు) దక్షి ణార్ధము నందలి సుప్రసిద్ధమైన ప్రాచీన తీర్థస్థానమనియు, సబ్బినాటి పట్టణము నుండు ధర్మపురమున కుత్తర దిగ్భాగ

---

2, శాంతి పురాణం. 1—42—3.

3. AR. AP. 703 of 66. ఇది ఇంకను ప్రకటితము గాలేదు.

4. S.I.I. VI. Nos. 639 and 640.

5. The Chalukyas of Vemulavada, PP. 93 and 97.

6. AR. AP. No. 192 of 1966. ఇది ఇంకను ప్రకటింపబడలేదు.

7. H. A. S 13, Ins. No. 56.

8. పద్మ. ఉత్త౦. 1:

9. The Gazetteer of the Bombay Presidency, Vol. II, Part I, PP.-305, n. 1, and 676.

మున నున్నదనియు జెప్పియున్నది. మొట్ట మొదట ధర్మపుర మెచ్చటనున్నదో తెలిసికొనినగాని దీని యునికి స్థలమును గుర్తించుటకు వీలుగాదు. నట్టినాటికి సరిపోవు కరీంనగర జిల్లాలో ధర్మపురి యొకటి కలదు. ఇది కరీంనగరు కుత్తరమున నలువది మైళ్ల దూరమున గోదావరి దక్షిణ తటమునం దున్నది. ఇప్పుడును నిది బ్రాహ్మణ బాహుళ్యము గల స్థలము, యాత్రా స్థానము. ధర్మపురి నివాసుడైన శ్రీ లక్ష్మీనరసింహస్వామిని సేవించుట కొరకు యాత్రికులు పరిసర ప్రదేశముల నుండి యిచటికి మూగుచుందురు. శాసనమున పేర్కొనియున్న ధర్మపుర మిదియే కావచ్చును. విక్రమార్జున విజయ రచనకు మెచ్చి యరికేసరి పంపని కగ్రహారీకరించి యిచ్చిన ధర్మపుర మిదియె కానగును. అగునేని యనాదిసంసిద్ధ తీర్థమైన వృషభాద్రి యీ ధర్మపురమున కుత్తర దిగ్భాగమున గోదావరి యుత్తర తటమున నిప్పటి యదిలాబాదు జిల్లా యందలి కొండల లోనిదై యుండవలయును. కాని యిందుల కొక యాక్షేపము గలదు. మన శాసనము ధర్మపురము నట్టినాటి పట్టనడుమ నున్నట్లు చెప్పియున్నది కదా. పై చెప్పిన గోదావరి తటమునందలి ధర్మపురి ధర్మపురమే యైనయెడల నట్టినాడు దీని నావరించి యుండవలయును. కాని ధర్మపురి కావల గోదావరి నది యుత్తర పార్శ్వమున నట్టినాడు వ్యాప్తమై యుండెనని చెప్పుటకు తగినంత శాసనాద్యాధార మెద్దియు నింత దనుక బయలు పడలేదు. కావున గోదావరి దక్షిణ తటమందలి ధర్మపురియె శాసనోక్త ధర్మపురమని చెప్పుటకు జంకవలసియున్నది. ఈ ధర్మపురి యొక్కటియే కాక ధర్మార నామ గ్రామములు కొన్ని కరీంనగరు జిల్లా యందు కానవచ్చు చున్నవి. ధర్మార మనునది యిప్పటి వాడుకలో ధర్మపురమునకు రూపాంతరము. ధర్మపురము ధర్మపురమై ధర్మవరమై ధర్మారమైనది. ఒక ధర్మారము వేములవాడకు పదిమైళ్ల పశ్చిమమున సిరిశిలకు బదియైదు మైళ్ల దూరమున పశ్చిమోత్తర దిశలో నున్నది. మరియొకటి మంథెనకు బదిమైళ్ల దక్షిణమునను, వింకొకటి యోరుగంటికి పశ్చిమమున నిరువది మైళ్ల దూరమునను గలవు. ఇవి యన్నియు నట్టినాటి లోనివే. కావున ప్రస్తుత శాసనోక్త ధర్మపురి యిందేదియైనను గావచ్చును. భావి పరిశోధన వలన నిజము వెలువడవలసి యున్నది.

సిద్ధశిలః— వృషభాద్రివలె కాక సిద్ధశిలను గుర్తించుట సులభము. శాసనమునం దిది వృషభాద్రికి దక్షిణ దిగ్భాగమునం దున్నట్లు చెప్పియున్నది. ఇది కరీంనగరుకు పశ్చిమమున పదమూడు మైళ్ల దూరమున కరీంనగర— కామారెడ్డి రోడ్డునకు ఉత్తరపు వైపు మూడు మైళ్ల దూరమున నుండు గంగాధర గ్రామములోని బొమ్మలగుట్ట యగుట నిశ్చయము.10 శాసనమునందు వివరించినట్లు ఈ కొండకొమ్మ పైనుండు పెద్ద నిలువుబండ మీద ప్రస్తుత శాసన ముల్లేఖింపబడి యుండుటయు దాని పైభాగమున నాద్యంత జినబింబములును జక్రేశ్వరియును మఱికొన్ని దేవతా ప్రతిమలును జెక్కియుండుటయు నీ విషయమును ఋజువు సేయు చున్నవి. కాని యచట జినవల్లభుడు కట్టిన త్రిభువన తిలకమను బసదిగాని మదన విలాసమను వనముగాని కానరావు. బొమ్మలగుట్ట వానుకొని దాని కుత్తరపు తట్టున కెఱువు కలదు. ఇదియే జినవల్లభుడు తన యన్నపేరట గట్టించిన కవితాగుణార్ణవమను చెఱువై యుండవచ్చును. జినవల్లభుడు సదరుబసదిని, వనమును, సిద్ధశిలయొద్ద కాక తత్సమీపస్థమైన గంగాధర గ్రామము చెంత నిర్మించి యుండెనేమో. గంగాధర గ్రామము చుట్టును పొలములలో గానవచ్చు జైన తీర్థంకరుల విగ్రహములను జూడ నది యొకప్పుడు జైనుల కాటపట్టై యుండెనని తోచు చున్నది.

గ్రామములు:— శాసన మందు పేర్కొని యుండు గ్రామము లైదింటిలో నల్లిగె ధర్మపురముల యునికిపట్టులు పైన చర్చింపబడి యున్నవి. వాని గూర్చి యిచట మరల వివరించుట యనవసరము. మిగిలి యుండు మూడింటిలో నొక్కటియైన వంగిపఱ యిప్పటి గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని వంగిపురమని పరిశోధకులు నిర్ధారించి యున్నారు. పంపడు తన పూర్వులలో నాద్యుడైన మాధవసోమయాజికి నివాస స్థానమని చెప్పిన వెంగిపఱు నిదియే. వెంగిపఱు వనునది వ్రాయసకాండ్ర పొరపాటు వలన నేర్పడిన భ్రష్టరూపము. ఆయూరికి సరియైన పేరు వంగిపఱయని ప్రస్తుత శాసనము వలన విదితమగు చున్నది. వంగిపఱ వేంగినాటి సప్త గ్రామములలో నొక్కటియని జినవల్లభుడు తెలుపు చున్నాడు. ఈ సప్త గ్రామవర్గమునకు జెందిన దక్కినయూళు గ్రామము లెవ్వియో

---

10. ఈ గ్రామముయొక్క యునికిపట్టును గుర్తింప జాలక పరిశోధకులు చిక్కుపడుచున్నారు. సర్ ఆర్. జి. భండార్కరుగారి యభిప్రాయము ననుసరించి శ్రీ కె. కె. హండికి గారు ''యశస్తిలక అండ్ ఇండియన్ కల్చర్' అను గ్రంథములో (PP.4) నిదియొక కుగ్రామ మనియు నిది ధార్వాడ ప్రాంతమునం దెచ్చటనో యుండవలయుననియు ధార్వాడకు సమీపస్థమైన రాయచూరి జిల్లాలోని గంగావతి గావచ్చు ననియు వ్రాసి యున్నారు. ఇటీవలి చరిత్ర పరిశోధనతో బరిచయ ముండిన వీరిట్లు వ్రాసియుండరు. వేములవాడ చాళుక్యులు కర్ణాటమునసే రాజ్యము జేయుచుండిరను భ్రమ వలన వీరు తమ దృష్టిని కర్ణాటకమునకు వెలుపట పొరింప జాలరైరి. ఇమ్మడి యరికేసరి కుమారుడైన వాగదేవుడు గంగధార నుండి రాజ్యము సేయుచుండినట్లు సోమదేవసూరి తన యశస్తిలకయందు చెప్పియున్నాడు. 'గంగధార' యను పేరు సరియైనది కాదు. గంగాధరమనియే సరియైనపేరు. ఇది జైనుల కాటపట్టయి యుండెనని యచట గానవచ్చు జైన సముదాయావశిష్టముల వలన దెలియవచ్చుచున్నది. దాని మత ప్రాశస్త్యము వలన జైనమతాభినివిష్టుడైన వాగరాజు కులక్రమాగత రాజధానియైన వేములవాడను విడచి గంగాధర గ్రామమున నివసించు చున్నట్లున్నది.

తెలియదు. త్రిలోచన పల్లవుడను రాజు సప్తర్షుల పేర సప్తాగ్రహారములను నిర్మించి బ్రాహ్మణులకు దానము జేసినట్లు గుంటూరు మండల ప్రాచీన శాసనములలో నొక యైతిహ్యము గానవచ్చుచున్నది. బెంగినాటి సప్త గ్రామము లా పల్లవరాజు నిర్మించిన సప్తాగ్రహారము లగునేమో. పంపడు వంగిపఱ్ఱుతో చేరినవని చెప్పిన వసంత కొట్టూరు నిడుగుంది విక్రమపురాగ్రహారములు ప్రాయశః ఈ సప్త గ్రామములలో జేరినవి కావచ్చును.

నిడుంగొండ:— మీద జెప్పిన వసంత కొట్టూరాది గ్రామములలో నొక నిడుగుంది తప్ప తక్కిన వెచ్చట మున్నవో చెప్పుటకు వీలుకాదు. నిడుగుంది యను పేరు సరికాదు. దాని నిజమైన పేరు నిడుంగొండ యనియు నది గుండికఱ్ఱ సీమలోని గ్రామమనియు మన శాసనము తెల్లము సేయుచున్నది.

కలాప గ్రామము:— ఇక కలాపగ్రామమును గూర్చి యొక మాట. దీని యునికిపట్టును గుర్తించుటకు వీలు గాకున్నది. కాని పురాణములలో దీని ప్రస్తావము గలదు. ఉదా: భాగవత పురాణమందు ఇక్ష్వాకువంశజుడగు మరుడను రాజు కల్యంతమున నష్టమైపోయిన సూర్యవంశమును పునః ప్రతిష్ఠ చేయగలవాడని చెప్పియున్నది.

'యోఽసౌ వాస్తే యోగసిద్ధః కలాపగ్రామ మాశ్రితః|
కలే రంతే సూర్యవంశం నష్టం భావయితా పునః||'11

ఇట్టి సందర్భమందే పురాణములు మరి కొన్నిటియందును నీ కలాపగ్రామ ప్రస్తావము గలదు.

మీద చేసిన రాష్ట్ర విభాగాది వివరణ వలన పంప జిన వల్లభుల పూర్వులు మొట్ట మొదట తీరాంధ్రమందలి వెంగి మండలాంతర్గత కమ్మనాడు గుండికఱ్ఱసీమలో నివసించుచుండి రనియు కాలక్రమమున వా రా ప్రాంతమును విడిచి తెలంగాణపు పశ్చిమోత్తర భాగమునందు సబ్బినాటికి బోయి యచట స్థిరనివాసము లేర్పఱచు కొని యుండిరనియు తెల్లమగుచున్నది. వారు ఏ కారణమున తమ యాదిమ నివాసస్థానమును విసర్జించి సబ్బినాటికి బోయిరో నిశ్చయించి చెప్పుటకు తగిన సాక్ష్యము లేదు. కాని యది పంపని తండ్రియైన భీముని కాలముననే జరిగి యుండవచ్చునని యూహించుట కవకాశము గలదు. పంపడు విక్రమార్జునవిజయమునందు తన తండ్రియైన భీముడు మతము లన్నిటిలో జైనమత ముత్తమమైనదని గ్రహించి యామతమును స్వీకరించినట్లు చెప్పియున్నాడు.12 మతమువార్పే భీముని యన్య దేశగమనమునకు దారి తీసినట్లున్నది. వెంగిదేశమం దప్పుడు జైన మతము లేకపోలేదు. కాని జైనుల సంఖ్య యల్పాల్పము. జైన సమయము జనాదరణ లేక హీన స్థితియం దుండినది. దేశపాలకులైన పూర్వ చాళుక్య రాజులును వారినాశ్రయించి యుండిన సామంతులును దొరలును వైదికాభిమానము గల శైవులు. వారి యాదరాభిమానముల వలన వైదిక శైవ ధర్మములు రెండును ప్రబలి సర్వజనసమాదరణీయములై వర్ధిలు చుండినవి. వేదబాహ్యమైన జైన మతానుయాయులు జన సామాన్యముచే పాషండులని గర్హింప బడుచుండిరి. వైదిక శైవ మతములకును జైనమతమునకును బరస్పర వైరము సహజమై మతకలహముల కాస్పద మగుచుండెను. ఇట్టి పరిస్థితులలో ననాది కాలమునుండి తన పెద్ద లనుసరించుచు వచ్చిన వైదిక ధర్మమును విసర్జించి జైనమతమును స్వీకరించినందువలన భీమునికి తన వారిలో దావు లేకపోయియుండ వలయును. స్వజనముచే బహిష్కృతుడై స్వస్థానమున నిలువ నీడలేక పోవుటచే మనికి దుర్భరమగుటచేత నతడు దేశత్యాగము జేసి తన నూతన మతమును నిరాటంకముగ నవలంబించుట కనుకూలమైన చోటికి బోవ నమకట్టి యుండును. సబ్బిదేశ మతని దృష్టి నాకర్షించినది. వేములవాడ రాజధానిగా నా ప్రాంత భూముల బాలించుచుండిన చాళుక్యులు జైన మతాభిమానులు. వారు జైన విద్వాంసులను గవులను జేరదీసి యాశ్రయ మిచ్చుచుండిరి. వారి యాశ్రయమున జైనమత మభివృద్ధి జెంది సర్వజన సమాదరణ నందియుండినది. కావున సబ్బినాటియందు తన నూతన మతమును నిరవధికముగ నాచరింప వచ్చుననియు తన కచట రాజాశ్రయము లభించి జీవనము నిరుపాధిగ సాగగలదనియు దలంచి వేములవాడను జేరెను. అందే యతనికి కణ్ణిగెఱె జోయిన సింఘునితో పరిచయము గలిగి యతని పుత్రిక యైన వబ్బణబ్బను బెండ్లాడియుండవలయును.

అరికేసరి:— చాళుక్య వంశప్రభువైన యరికేసరి విక్రమార్జున విజయమునకు మెచ్చి పంపనికి ధర్మపురము నగ్రహారముగ నిచ్చెనని యీ శాసనమందు చెప్పియున్నది కదా. ఈ చళుక్య ప్రభు వెవ్వడు? బాదామి చాళుక్య రాజవంశ ముత్పన్నమై పోయిన పిమ్మట నా వంశమునకు జెందిన యొక శాఖవారు రాష్ట్రకూటుల యాధిపత్యము నంగీకరించి వారికి సామంతులై యిప్పటి కరీంనగరుజిల్లాలోని వేములవాడను రాజధానిగ జేసికొని తత్ప్రాంతభూములను క్రీ. శ. 8 వ శతాబ్దోత్తరార్థమునుండి 10 వ శతాబ్ద మధ్యమువఱకు పాలించుచుండిరి. వీరిని చరిత్రకారులు వేములవాడ చాళుక్యు లందురు. ఈ వంశమునకు జెందిన వాడే విక్రమార్జున విజయ కృతిపతియైన యరికేసరి. పంప డీ చాళుక్య రాజవంశ చరిత్రను విక్రమార్జున విజయపీఠికయందు సంగ్రహముగ వర్ణించియున్నాడు.

చళుక్యవంశమున యుద్ధమల్లుడను రాజు కలడు. అతడు సపాదలక్ష భూమిని పాలించుచుండెను. అతని పుత్రు డరికేసరి. నిరుపమదేవునికాలమునం దీతడు వెంగి కళింగములను సాధించెను. ఇతనికి నరసింహభద్రదేవులను పుత్రు లిరువురు పుట్టిరి. వీరిలో నరసింహునికి యుద్ధమల్లుడను కొడుకు పుట్టెను. ఇతని కుమారుడు బద్దెగడు; నలువదిరెండు రణ

11. భాగ. 9–12–6.

12. విక్రమార్జున విజయం. 14 : 48

క్షేత్రములలో మగటిమిని చూపి 'పోలద గండ'డను బిరుదునందిన శూరవరునిని; నీటియందు ప్రవేశించి మొసలిని పట్టిన ట్లితడు భీముని పట్టెను. బద్దెగనికొడుకు దుగ్ధమల్లుడు. ఇతనికుమారుడైన నరసింహుడు లాటమును, నేడు మాళవమును జయించెను. ఘూర్జరరాజైన మహీపాలుని యుద్ధమున నోడించి యతని గజములను బట్టుకొనెను; గంగాపర్యంతము దాడిపోయి, యందు దన తురంగములను నీరు ద్రావించెను. కాళప్రియరణమున గెల్పుగొని నిజ పరాక్రమమును బ్రకటించెను. నరసింహుడు సుప్రసిద్ధ రాష్ట్రకూట చక్రవర్తియైన ఇంద్రవల్లభుని సోదరిని జాకవ్వను బెండ్లాడెను. ఈ దంపతులకు బుట్టిన సుపుత్రుడే విక్రమార్జున విజయ కృతిపతియైన యరికేసరి.13 ఈ నామధేయముగల యీ వంశపు రాజులలో నితడు రెండవవాడగుటచే నితనిని చరిత్రకారు లిమ్మడి యరికేసరి యను చున్నారు.

పై వివరించిన చళుక్య వంశావళి యీ యిమ్మడి యరికేసరియొక్క వేములవాడ శిలా శాసనమందును వర్ణింపబడి యున్నది. అందీ యిమ్మడి యరికేసరి రాష్ట్ర కూట చక్రవర్తి ఇంద్రవల్లభుని కుమారితను రేవకనిమ్మడిని, లోకాంబికయను రాష్ట్రకూట వంశజయగు మణియొకరాజపుత్రికను వివాహము జేసికొనెననియు, నాల్గవ గోవింద చక్రవర్తియొక్క కోపమునకు గురియైన బిజ్జని శరణయు నిచ్చి రక్షించినందులకు క్రుద్ధుడై గోవింద చక్రవర్తి తనపైకెత్తిరాగా వాహవమున నాతని గూల్ద్రోసి యతని స్థానమున బద్దెగదేవుని రాష్ట్రకూట సింహాసనముపై బ్రతిష్ఠించెననియు జెప్పియున్నది.14

ధర్మపుర దాన శాసనము—విక్రమార్జున విజయమును గూర్చి యీ శాసనమునందు క్రొత్త యేమియును గానరాదు. అది యంతయు బంపని కృతియందే కలదు. విక్రమార్జున విజయమందు విస్పష్టము గాక యుండు విషయమొక్కటి మాత్ర మిందు వలన విదిత మగుచున్నది. తన కరికేసరి యిచ్చిన ధర్మపురమును పంపడు 'శాసనగ్రహార' మని, శాసనబద్ధమైన యగ్రహారమని తెల్పియున్నాడు. కాని శాసన రూపమెట్టిదో వివరించి యుండలేదు. సంశయగ్రస్తులగు పృచ్ఛకులకు సమాధానము చెప్పు వ్యాజమున జినవల్లభు డీ శాసన మెందు కలదో తెలిపి యున్నాడు. 'తామ్ర శాసనము లిఖింపబడెనా? అరికేసరి ధర్మపురము నిచ్చెనా? పంపడు దానిని గ్రహించెనా? యని మాటిమాటికి యున్మాదముతో పలువుర వడుగవలదు. పోయిచూడుడు, మందర వృషభ పర్వతోన్నత శిలా తలమున జెక్కి యుండు నక్షరములను' అని. ఇందువలన ధర్మపుర దాన శాసనము శిలా శాసనమనియు, నది వృషభపర్వతము మీద చెక్కబడియున్నదనియు దెల్లమగుచున్నది. వృషభ పర్వతము యొక్క యునికిపట్టు తెలియ వచ్చినప్పు డీ శాసనమును నందు తప్పక కానవగును.

ప్రాచీనతమ కందపద్యములు—ఈ శాసనమునకు ఆంధ్రసారస్వత చరిత్రయందు ప్రత్యేక స్థానము గలదు. ఇది ప్రాచీనతమాంధ్ర పద్య శాసనములలో నొకటి. ఆంధ్ర భాషయందు కావ్యరచన క్రీ. శ. 11 వ శతాబ్ద మధ్యభాగమున నన్నయభట్టారక కృతాంధ్ర మహా భారతముతో ప్రారంభమైనను దత్పూర్వము రెండు శతాబ్దములనుండియు ఆంధ్రులు కవిత చెప్ప నేర్చియుండిరని శాసనముల మూలమున దెలియుచున్నది. గుణగవిజయాదిత్యుని నాటి యుద్ధమల్లుని, కందుకూరు శాసనములును, మొదటి చాళుక్య భీముని కొలపుధర్మవర శాసనమును, రెండవ యుద్ధమల్లుని బెజవాడ శాసనమును బద్యాత్మకములు. వీనిలో మొదటి దానియందు తరువోజయు, రెండుమూడు లందు సీసమును, కడపటి దానియందు మధ్యాక్కరలును వాడబడినవి. ప్రస్తుత శాసనమునందు మూడు కందపద్యములు గలవని మీద చెప్పియున్నాము. ఇవియే తెలుగుభాషలోని ప్రాచీనతమ కందపద్యములు. అప్పటి వ్రాత పద్ధతి ననుసరించి యీ పద్యము లిట్లు లిఖింపబడి యున్నవి.

కన్దం॥ జినభవనంబు లెత్తించుట
జినపూజ శ్చేయుచున్కి జినమునులకు న
త్తిన యన్నదానం బీవుటం
జిన వల్లభు బోలంగలరె జిన ధర్మపరుల్॥

దినకరు సరి వెల్గుదు మని
జినవల్లభు నెట్టు నెత్తు జితకవిననను
మనుజు ల్గలరె ధాత్రిం
వినుతిమ్పదు సవియువృత్త విబుధ కవీంద్రుల్॥

ఒక్కొక్క గుణంబు కల్గదు
రొక్కణ్డం గా కొక్క లక్క లే వెవ్వరికిం
లెక్కింప నొక్క లక్కకు
మిక్కిరి గుణపక్షపాతి గుణ మణి గణంబుల్॥

వీనినిట్లు చదువ వలయును:

జినభవనము లెత్తించుట
జిన పూజ శ్చేయుచున్కి జినమునులకు నె
త్తిన యన్నదాన మీవుట
జినవల్లభు బోం గలరె జిన ధర్మపరుల్॥

దినకరు సరి వెల్గుదుమని
జినవల్లభు నొట్టు నెత్తు జితకవిజనుఁ
మనుజు ల్గలరే ధాత్రిన్
వినుతిచ్చుదురని యువృత్త విబుధ కవీంద్రుల్॥

ఒక్కొక్క గుణము కల్గదు
రొక్కటఁగా కొక్కలక్క లే వెవ్వరికిన్
లెక్కింప నొక్క లక్కకు
మిక్కిరి గుణపక్షపాతి గుణమణి గణముల్॥

13. విక్రమార్జున విజయము 1—15—51.

14. The Chalukyas of Vemulavada PP. 30—31.

ఈ మూడు కందపద్యములలోను మొదటి రెండును దెనుగు కవిత సంప్రదాయాను సారము యతి ప్రాసలతో కూడియున్నది. మూడవ పద్యమునందు ప్రాసము గలదుగాని యతి లేదు. ఇందు శాసన రచయిత యేలనో కన్నడకవిత్వ సంప్రదాయము ననుసరించినాడు.

**శాసన గ్రంథకర్త**:—శాసన గ్రంథకర్త తనపేరు చెప్పలేదు. కాని యితడు చక్కని కవిత్వము చెప్పగల నేర్పరియె. ఇందలి మూడు భాషలలోను గల పద్యములు మనోజ్ఞములై యున్నవి. ఒకవేళ జినవల్లభుడె శాసన గ్రంథమును రచించెనేమో! అతడు విద్వాంసుడనియు గలాకోవిదుడనియు బహుకావ్యరచనాసమర్థుడనియు కవిత్వ తత్త్వ విశారదుడనియు శాసనమందు చెప్పియున్నది.

గీతం గాతు మనేక భేదసుభగం కావ్యాని సౌచ్ఛ్రావచం
వాచా వాచయితుం ప్రియాణి వదితుం సాధ్వ్యాకర్తుం సతాం।
భోగా న్సేవితు మంగనా రమయితుం పూజాం విధాతుం జినే
జానీతే జినవల్లభః పర మిదం సంపాళిధానామజః॥

చదుర మయ్యెమ్మిరు సత్కవిత్వద నన్ద సంపన తమ్మనా
వ్యాకరె పొగళ్తెయు బాజిన ల్పరెయ లక్కవిత్వద తత్త్వదో
ళ్పుదిదు నేవ్వడె పేళయివ్వి గప్పొర్వ్వ మాగిరె బల్లిన
ప్పుదరి నొప్పిణావె వాగ్వధూ వర వల్లభం జినవల్లభం॥

కావున జినవల్లభుడె ఈ శాసన గ్రంథమును రచియించి యుండవచ్చునని తోచుచున్నది.

**శాసన కాలము**—శాసనకాల మిందు చెప్పలేదు., కాని యిందలి లిపి స్వరూపమునుబట్టి యిది క్రీ. శ. 10 వ శతాబ్ది మధ్యకాలమునాటిది కావచ్చునని యీ వ్యాసారంభమందు చెప్పియున్నాడను. ఇది పంపని తమ్ముడగు జినవల్లభుని ప్రశస్తి యగుటయు నిందు పంప కృత విక్రమార్జునవిజయ ప్రశస్త ముండుటయు పైని వివరించిన కాలనిర్ణయము సంగతమైన దని సూచించు చున్నవి. పంపడు శ. 824 దుందుభి వర్షము (క్రీ. శ. 902) న బుట్టెననియు, నాదిపురాణమును శ. 8. 3 ప్లవ (క్రీ. శ. 941) సంవత్సరమున రచించెననియు నందు చెప్పియున్నది.[15] ఆదిపురాణమును పంపడు విక్రమార్జున విజయమునందు పేర్కొనియున్నాడు.[16] కావున క్రీ. శ. 941 వ సంవత్సరమునం దాదిపురాణమును విరచించిన పిమ్మట పంపడు విక్రమార్జున విజయము వ్రాసెనని చెప్పుట యొప్పగును. విక్రమార్జున విజయమును ప్రస్తుత శాసనము ప్రశంసించు చుండుటవలన ఇది విక్రమార్జున విజయ రచనానంతరము క్రీ. శ. 945 ప్రాంతమున నెలకొల్పబడియుండును.

ఈ వ్యాసరచనయందు ఉస్మానియా విశ్వవిద్యాలయము నందు పూర్వము ప్రధాన కర్ణాట భాషోపాధ్యాయులై యుండిన ఆచార్య డి. కె. భీమసేనరావుగారి సాయమును బడసినాడను. శాసన గ్రంథమును నాతో గూడ చదివి యిందలి విషయమును చక్కగ వివరించినందులకు వారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములను సమర్పించుచున్నాడను.

15. కర్ణాట కవి చరిత సం. 1. పు. 31.
16. విక్రమార్జున విజయం. 14—59.

# శాసన ప్రతిబింబము

[ఈ శాసనము 14 అడుగుల ఐదు అంగుళాల పొడవైనది. దీనిని ఒకమారుగా ఫొటో తీయుట సాధ్యము కానందున, మూడు భాగాలుగా ఫొటో తీయవలసి వచ్చినది. వీటిని నిలువుగా ఒక దాని పైన ఒకటి అమర్చి పాఠకులు చదవగోరివాను. నే. వెం.]



# శాసన పాఠము

1. * ఓం నమః సిద్ధేభ్యః [।*] స్వస్తి సమస్త సకళ కళాళాప ప్రవీణం భవ్య రత్నాకరగుణ పక్షపాతి బెంగినాడ సప్తగ్రామగ కౌళగణ వంగిపఱ్ఱి కమ్మె బ్రాహ్మణం జమదగ్ని పంచాషేఁయం శ్రీవత్సగోత్రం గుణ్డికఱ్ఱు నిడుంగొణ్డె యభిమాన చన్ద్రన మమఁం భీమపయ్యన బెళ్వొలదణ్ణిగెఱెయ జోయిస పింఘన మమఁ[ం*]

2. వబ్బణబ్బెయ మగం కొణ్డకున్దెయ దేసిగ గణద పొత్తగెయ బఱియ పణ్డరంగ వళ్లియ జయ [ం] గొణ్డ సిద్ధా[న్త] భటారర గుడ్డం జినవల్లభం సబ్బినాడ నట్టనడువణ ధమ్మఁపుర దుత్తర దిగ్భాగద వృసభగిరియెం బనాది సంసిద్ధ తీత్థఁద దక్షిణ దిశాభాగ దీ సిద్ధశిలయొళ్ తమ్మ కులదైవ మాద్యన్త జినబింబంగళుమం చక్రేశ్వరియుమం పెఱవుం జినప్రతి

3. మెగళుమం త్రిభువన తిలకమెంబ బసదియుమం కవితాగుణాణ్ణఁవమెంబ కెఱెయుమం మదనవిళాస మెంబ బనముమం మాడిసిదం । * వృత్తం॥ ప్రాత ర్ధఁమ్మఁ పురం ప్రయాము కి మతో జైనాభిషేకోత్సవ క్షీరప్లావిత తుంగ శృంగ వృషభక్ష్మోఁద్ర మీ క్షామహే । యాత్రాయాత సమస్త భవ్యజనతా సన్మాన దానోద్యతం పంపాయ్యాఁ

4. నుజ మత్ర భీమతనుజం సమ్యక్త్వరత్నాకరం ॥। [౧॥*] గీతం గాతు మనేక భేద సుభగం కావ్యాని సోచ్ఛ్వాసవం వాచా వాచయితుం ప్రియాణి వదితుం సాద్వ్యపకత్తుఁం[1] సతాం భోగా న్సేవితు మంగనా రమయితుం పూజా విధాతుం జినే జానీతే జినవల్లభ ల్పర మిదం పంపాభి ధానానుజః॥। [౨॥*] అజ్ఞస జినవన్ద నాగత మునీ

5. శ్వర శ్రావక ప్రజా స్తవరవ[2] ప్రతిధ్వనిత శబ్దకోళాహళై[ః] అధిష్ఠిత దిగంబరో వృషభశైల ఏష స్వయం పరాం వదతి వాచకాభరణకీత్తిఁ[3] మాకళ్పతః॥ [3॥*] బగెయ ళళుం బ మీఱిబగెయ నాబ్బఁగె వెబ్బఁగె[4] గాసెయల్లు దిట్టెగె[5] పాలనల్లు నీళ్ద నళియొళ్ ళ్జిన బింబమ నీత నీగళే న్నగలిసి[6] దప్ప నెన్నబగె వన్నెవరం జినబింబ

---

1. "సాద్వ్యపకత్తుఁం" అని చదువవలెను.
2. "రవా" అని చదువవలెను.
3. 'కీత్తిఁ' అని.
4. 'వబ్బఁగె' అని చదువవలెను.
5. 'దిట్టిగె' అని.
6. 'న్నెగలిసి' అని చదువవలయును.

6. మల్లితొట్టగె నెగణ్దెఱ్ద వేం[7] చరిత మచ్చరియో జినవల్లభేన్ద్రనం[8]॥ [౧॥*] ఇదు కవితా గుణార్ణవనకీర్త్తి [ఽ*] య మూర్త్తి [ఽ*] వొలగి దక్షిణార్ద్ధద వృషభాద్రి యక్కె వృషభేశ్వర బింబ సనాథ మెంబలం పొడవె నిజద్విజావసథ పర్వ్వతముం జిన చైత్యమాగె మాడిద జినవల్లభంగె జినవల్లభనప్పదు మొన్దు చోద్యవో॥[9] [౨॥*] చదురనుయ్మెయ సత్క

7. విత్వద సన్దపంపనతమ్మ నొర్వ్వదె పొగడ్తెయె బాజిస ల్బరెయు ల్కవిత్వద తత్వదొ ళ్పుదిదు నేర్వ్వడె పేళలువ్విగపూర్వ్వ మాగిరె బల్లి నప్పదటి నొర్వ్వనె వాగ్వధూవర వల్లభం జినవల్లభం॥ [౩॥*] వినుత చళుక్య వంశపతి మిక్కరికేసరి సన్ద విక్రమార్జున విజయక్కె ధర్మ్మపురంమెన్దు[10] మదీయ మిదెన్దు కీర్త్తి [ఽ] శాసన మెనె కొట్ట శాసనద పం

8. పన[11] నా బిరుదొన్దు జైన శాసనద నెగఱ్త్తెయుం వృషభపర్వ్వత మన్తదు లానె పేళ దే॥[౪॥][ఎన] యెల్లాళి పుగల్పతంగ కిరణం సార ల్మిగం పాఱి లాగనదొ ళ్పక్కిగళల్లి నల్ల వెనిసిర్ద్దన్యోదయం ధర్మ్మదొ ళ్జనముం పొంపులే వడె మెచ్చి హరిగం పంపంగె గొట్టా ద్విజావసథగ్రామ మదే న్నెగఱ్త్తెయ కళాప్రగామముం పోల్తుదో॥ [౫॥*] బరెదుదె

9. తామ్రబశాసన మదేయమె ధర్మ్మపురం నెగఱ్తెత్తరి గన కొట్టుదేనెగట్దే పంపన పెత్తుదె పేటిమెన్దు నీమ్మరుళె వలమ్మెయుం వలబరం బెసగొళ్లదె పొగినోడు నున్దర వృషభాచళోన్నత శిలాతళదొ ళ్బరెదక్కరంగళం॥ [౬॥*] కన్దం॥ జినభవనంబు లెత్తించుట[12] జినపూజ ల్సేయుచున్కి జినమునులకు నత్తిన యన్నదానం బీవుటం[13] జినవల్లభు బోలంగలరె[14]

10. జినధర్మ్మపరుల్॥ [౧॥*] దినకరునరి వెల్గుదుమని జినవల్లభు నెట్టునెత్తు జితకవిననను[15] మనుజు ల్గలరే ధాత్రిం వినిత చ్చుదుననియ వృత్తవిబుధకనీంద్రుల్॥[౨॥]

---

7. 'నెగర్దెఱ్దవేన్' అని.
8. 'జినవల్లభేన్ద్రనా' అని యుండవలయును.
9. 'చోద్యమో' అని.
10. 'ధర్మ్మపురమెన్దు' అని.
11. 'పంపణ' అని.
12. 'భవనము లెత్తించుట' అని చదువవలయును.
13. 'దానమీవుట' అని చదువవలయును.
14. 'బోలంగలరె' అని చదువవలయును.
15. 'నననున్' అని చదువవలయును.

ఒక్కొక్క గుణంబు[16] కల్గ్గదు రొక్కణ్డంగా[17] కొక్కలక్కలే వెవ్వరికిం లెక్కింప వొక్క లక్కకు మిక్కిలి గుణపక్షపాతి గుణమణి గుణంబుల్॥[18] [3॥*] ఎన్దు లోక మెల్లం పొగడె నెగల్ద జినవల్లభన సుధమ్మ౯ సంతతియో

11. కొ్డట్ట ,గుణావళియ నీ వృషభగిరియ సిద్ధశిలయో శెఱెయమ్మం టంకో తిక్కణ్ణ౯ వ్మాడిదం॥

---

16. 'గుణము' అని చదువవలయును.
17. 'ఒక్కఁడ' అని చదువవలయును.
18. 'గుణముల్' అని చదువవలయును.



# నడుస్తున్న నరకం

శ్రీ ఇస్మాయిల్

నడుస్తున్న నరకం ఈ బస్సు.
ఇందులో ఇరుకు ఎంతో విశాలం;
ఎప్పటికప్పుడు
ఇంకా ఇద్దరు ముగ్గురు ఇక్కడ నిలుచోవొచ్చు.
చెమటా డీసెల్ కంపుల పచ్చటి పందిరికింద
ఒరుసుకుంటున్న మసక వెల్తురులో
పోతపోసిన సజీవస్తంభాలు—
వీళ్ల కళ్లు కిటికీల కటకటాల కవతల
బూడిదరంగు గోడల కొక్కాలకి గబ్బిలాలలా
చీటీలుగా వేలాడుతున్నాయి;
చీకాకులలా, సెక్సు సమస్యలలా, సందిగ్ధావస్థలలా,
ఇంకా ఎన్నో చవక లాటరీ టిక్కెట్లలా,
చతురస్ర సమాధులుకాని కాలెండర్లో తారీఖులలా.
ఈ బస్సులో ముందు సీట్లలో
కులాసాగా కూచున్నవాళ్లు
ఆదర్శాలని గాలిలో రెపరెప ఆడిస్తున్న
అందాల జండాలని
పట్టుకునివున్నారు.
ఈ స్తబ్దస్తంభాల గుంపు
పొగని పట్టుకువేలాడే ఆఖరిదమ్ము సిగరెట్ పీకలని
అనుకుంటున్నారు
బస్సులోకి ఎగ్జిట్‌నుంచి ఎంటరైన వాళ్లు.
ఇంతకీ ఇది—
(సామాన్యుణ్ణి
మెదడులో మిగిలిన జ్ఞాపకశక్తి కణాలు కొంచెం పనిచేస్తున్నవాణ్ణి)—
నే నెక్కిన బస్సు.
దీని డ్రైవర్ తప్పతాగివున్నాడని
ఇందులో ఎందరికి తెల్సు ?

---

# పాపజాతి

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

తాతయ్య చచ్చిపోయాడు.

నాగుబాము కరిచి చచ్చిపోయాడు.

తాతయ్య నన్ను పెంచి పెద్ద చేశాడు. కాని తాతయ్యను నేను ప్రేమించలేక పోయాను.

ఈ మధ్య మూడు నెలలుగా నాకూ ఆయనకీ మాటల్లేవు!

తిరి వచ్చిందేమో, ఉన్నట్లుండి నిన్న ప్రొద్దున నామీద విరుచుకుపడ్డాడు. ఎప్పుడూ అనని మాటలు అన్నాడు. ఇంట్లో నుంచి వెళ్ళిపొమ్మన్నాడు. తనకూ నాకూ యిక ఏలాటి సంబంధమూ ఉండదన్నాడు!

వెళ్ళి ఆలోచిస్తూ కూర్చుండిపోయాను.

నాలో పశ్చాత్తాపంలేదు! ఎందుకుంటుంది?

చివరకు వెళ్ళడమే మంచిదేమో అనిపించింది. ప్రయాణానికి సిద్ధమవుతున్నాను.

ఇంతలో వార్త! ఆయనే వెళ్ళిపోయాడని వార్త! ఈ లోకాన్ని విడిచి, నన్ను నా మానాన వదలి, వెళ్ళిపోయాడా వార్త!

నాకు ఏడుపు వచ్చింది. ఏడ్చాను.

అంతే! పశ్చాత్తాపం మాత్రంలేదు.

నా గుండెల్లో ప్రశాంతి, ఎన్నడూ ఎరగని ప్రశాంతి......

జీవితాన్ని ఒక్కసారి నిష్క్రమంగా పర్యాలోకిస్తూ నిట్టూర్పు వదలాలనే ప్రశాంతి..........

తాతయ్య పాముని ద్వేషించినంతగా లోకంలో మరెవ్వరూ దేన్నీ ద్వేషించలేరు అనిపిస్తుంది నాకు. అదేమి విచిత్రమో, ఆయన కంటబడినన్ని పాములు కూడా, సాధారణంగా ఏ ఒక్కరికీ తారసిల్లవనే నా అభిప్రాయం. బ్రతికినన్నాళ్లూ చూచిన పాముని చంపకుండా విడిచిపెట్టరాదన్న ప్రతిజ్ఞ ఆయనది! చివరకు పాముకాటువల్లే ఆయన మరణం సంభవించింది. పాపజాతి జయించిందన్న మాట!

* * *

తాతయ్యకి మా అమ్మ ఒక్కర్తే ఆడపిల్ల. ఆమెకు పూర్వమూ, తర్వాతా, మొత్తం నలుగురు మగపిల్లలు కలిగి, దక్కకుండా పోవడం జరిగింది. ఆటుపైన సంతానంలేదు. అది శాపమన్నారు. అందుకు కారణం తాతయ్య పాముల్ని, ముఖ్యంగా నాగుబాముల్ని, చంపడమే నన్నారు. తాతయ్య బ్రాహ్మ సమాజవాది, హేతువాది, సంఘ సంస్కర్త. అలాంటి మూఢ విశ్వాసాల్ని లెక్కచెయ్యలేదు. 'నేను నమ్మను పొమ్మ'న్నాడు.

మా అమ్మమ్మకి మాత్రం ఆ విషయంపట్ల గాఢమైన విశ్వాసం ఉంది. తన భర్త శ్రేయస్సును గూర్చి ఆమె ఎప్పుడూ భయపడుతూ వుండేది. కాని ఆయన ధైర్య సాహసాల ముందు ఆమె ఏమీ మాట్లాడలేక పోయేది.

మా అమ్మకు తొలిచూలు నేను మగబిడ్డ కావటం అమ్మమ్మకు ఎంతో సంతోషం కలిగించింది. ఆమె నాగుల చవితినాడు భర్తకు తెలీకుండా వ్రతం చేసుకుని నాగేశ్వరునికి ఎన్నో మొక్కులు మొక్కుకునేదట. తన ప్రార్థనలూ నోములూ ఫలించాయను కున్నది. అన్నీ నాతో చెప్పుకునేది......

తాతయ్య తన ఆస్తికి వారసుడు పుట్టాడని సంతోషించాడు.

ఇద్దరూ నన్ను పెంచుకునే ఉద్దేశంతో, నా తల్లిదండ్రుల నుంచీ నన్ను వేరుచేసి తీసుకొచ్చేశారు.

నాకు బాగా జ్ఞాపకం: చిన్నతనంలో మానాన్న ఉద్యోగం చేస్తున్న వూరు అప్పుడప్పుడు అమ్మమ్మతో వెళ్ళి వారం రోజులుండి మళ్ళీ ఈ వూరు వచ్చేస్తూండటం. వెళ్ళేరోజున ఉన్న సంతోషం, సరదా, కుతూహలం, నాలో తిరిగి వచ్చే రోజున ఉండేవికావు! మనస్సు కొండెక్కిన దీపంలా అయ్యేది. అక్కడ మా అమ్మ దేవలోకంలోని దేవతగా, ఆ వారం రోజులూ నేను స్వర్గంలో ఉన్నట్లుగా అనిపించేది. అమ్మకు దూరమై తిరిగి వస్తూంటే, లోకం, చెట్లూ, చేమలూ, ఆకాశం, నిర్జీవంగా, ఏడుస్తూ కనిపించేవి. తిరిగి వచ్చిన రెండు మూడు రోజులదాకా నా మనస్సులో రైలు పరుగెడుతున్న ధ్యాస, ఏదో పోగొట్టుకొన్న దిగులూ, అంటిపెట్టుకుని వదిలేవికావు. ఏమిటో, సర్వమూ బరువుగా బాధగా ఉండేది.!

"ఏమిటి నాయనా, అలా వున్నావు?" అని అడిగేది అమ్మమ్మ.

ఏమని చెప్పను! నాకే తెలిసేది కాదు!

"ఆ పట్నం నీళ్ళ పడక, వారం రోజులకే బెంగడి పోయాడు అబ్బాయి" అంటూ ఆమె తాతయ్యతో నన్నుగురించి వ్యాఖ్యానించేది.

ఒకసారి మా అమ్మా నాన్నా ఈ వూరు వచ్చారు. అప్పటికి నా కిద్దరు చెల్లెళ్ళు. మా తమ్ముడింకా పుట్టలేదు. వాళ్ళతో ఎన్నో ఆటలు ఆడాను. చాల సరదగా గడిపాను. "అన్నయ్యా నువ్వూ మాతో వచ్చెయ్‌రాదూ!" అన్నారు వాళ్ళు. వాళ్ళతో వెళ్ళిపోవాలని గట్టి నిర్ణయం చేసుకున్నాను. "నేనూ వెళ్తాను" అని మా అమ్మమ్మతో చెప్పాను. "తాతయ్యతో చెబుతానుండు" అన్నది. "తిరిగి రావడానికి వాడికి తోడెవరు?" అని అడిగాడు. "మీరు వెళ్ళి తీసుకు రావాలి" అన్నది అమ్మమ్మ. "నాకు వేరే పనుల్లేవను కున్నావా? అయినా యిప్పుడు చూశాడుగా అమ్మా నాన్నల్ని, ఇంతలో మళ్ళీ ఆ వూరెందుకు? ఇక్కడ చదువు చెడదూ!" అన్నాడు. అప్పుడు నేను రెండో తరగతి చదువుతున్నాను.

ఆ మధ్యాహ్నం మా అమ్మావాళ్ళు వెళ్ళిపోయారు. నేనూ వెళ్లాలని మొండి చేశాను. కాని తాతయ్యను చూడగానే నోరు మూసుకున్నాను. ఆ రాత్రి పక్కమీద పడుకుంటే, క్రితం రాత్రి మా చెల్లెళ్లూ నేనూ కథలు చెప్పుకుంటూ కలిసి పడుకోవటం, వాళ్లతో నేను తప్పకుండా వస్తానని చెప్పటం, జ్ఞాపకము వచ్చింది. నా వోటమి నాకు దుర్భరంగా వుంది. వెళ్లాలి, వెళ్లాలి, వెళ్లలేక పోయానే, అన్నదాంతో ఏడుపూ కోపం ముంచెత్తుకు వచ్చేయి. నేను సన్నగా ఏడుస్తున్నాను. అమ్మమ్మ వూరడింపు మాటలు లెక్కచెయ్యటం లేదు. తాతయ్య ఒక్క ఉదుటున నామీద లంఘించాడు. రెక్క పట్టుకుని బరబర ఈడ్చుకువెళ్లి వాకిలి బయటికి నెట్టి "వెళ్లరా, వెళ్లిపో! నిన్ను ఎవ్వరూ పట్టుకోవడం లేదు." అన్నాడు. తలుపులు మూసు కున్నాడు. బయట చీకటిగా చలిగా వుంది. ఎట్లా వెళ్ళేది? ఏడుపు మానేసి వెళ్లగలనేమో వూహించుకుంటూ కూర్చు న్నాను. రైలుస్టేషన్ ఎంతదూరం ఉంటుంది? నడవగలనా? దారిలో దొంగాడూ, బూచాడూ వస్తే? రైలు ఎప్పుడు వస్తుందో? టికెట్ లేకుండా రైలెక్కడం ఎలా? వెళ్లడం అసాధ్యమని పించింది. వెళ్లినా మా నాన్న మళ్ళీ యిక్కడికే పంపిస్తాడని పించింది. నన్ను వీళ్లకి యిచ్చేశాక ఎందుకు ఉంచు కుంటారూ! అనిపించి దుఃఖం వచ్చింది. కుమిలి ఏడ్చాను. ఇంతలో అమ్మమ్మ తలుపులు తీసుకుని వచ్చి నన్ను కావలించు కుని ఎత్తుకుంది. లోపలికి తీసుకువెళ్లి పడుకోబెట్టుకొంది. ఆమె డొక్కలో దూరాను. చప్పుడు చెయ్యకుండా అమ్మమ్మ కూడా ఏడుస్తోంది! ఎందుకో? ఆమె కన్నీళ్ళు చూచి నా మనస్సు కరిగిపోయింది.......... అమ్మమ్మకోసం యిక్కడే వుండాలి అనుకున్నాను. నాకు ఎంత కోరికగా ఉన్నా, నా చెల్లెళ్ళు పిలుచుకున్నా, వెళ్లకూడదను కున్నాను.

అప్పట్లోనే జరిగిన మరొక సంఘటన నామీద చెరగని ముద్ర వేసింది. ఒకనాడు తాతయ్య మా యింటి ఆవరణలో త్రాచుపామును చంపబోవటం, అది కస్సుమని ఆయన మీదికి ఎగరటం, ఆయన లంఘించి దాన్ని చావుదెబ్బ కొట్టటం, అది మళ్లీ కనిపించకుండా పారిపోవటం నేను కళ్లారా చూశాను. అప్పటి తాతయ్య ఆకారం, ఆవేశం, నన్ను ఆకట్టు కొన్నాయి. ఇంటి చుట్టూ శిథిలమైన మట్టి ప్రహారీగోడ, కొన్ని రాళ్ళ గుట్టలూ వుండేవి. దెబ్బతిన్న త్రాచు పగబట్టుతుందనీ, పొంచి వుంటుందనీ ప్రతీతి. వెంటనే తాతయ్య గోడ త్రవ్వించివేసి రాళ్లూ అవీ తీయించి శుభ్రం చేయించి, ఇటుకగోడ పెట్టి గమ్ము చేయించేశాడు. అలా జాగ్రత్త తీసుకున్నా, యింటి పెరటి పాదికి భయం మాత్రం పోలేదు చాల రోజులదాకా.

నాకు చాల ఏళ్లదాకా పోలేదు.

చిన్న విషయాల్లో తాతయ్య చూపించే కాఠిన్యం నా పసిమనస్సు మీద దెబ్బతీసింది. సహ్యమైన కోరికల్నిగూడా ఆయన ముందు వెలిబుచ్చటం మానేశాను. నాకేమైనా కావలసినప్పుడు నెమ్మదిగా అమ్మమ్మద్వారా సాధించే వాణ్ణి. తాతయ్యకు కోపం రాకుండా ఎలా తప్పించుకు తిరగాలో అలా తిరిగేవాణ్ణి. నేను పెద్దవాడి నవుతూ వుండగా, తాతయ్య తిట్టడం, మందలించడం మానుకున్నాడు. ఒక్కొక్కసారి బోధించడం, మెత్తగా అదుపులో పెట్టడం, సాగించాడు. అదుపులో పెట్టలేక పోయినప్పుడు గంభీరంగా ఉపేక్షించాడు. తర్వాత క్రమంగా చూసీ చూడనట్లు నా దారికి నన్ను వదిలి వూరుకున్నాడు.

చిన్నప్పటినుంచీ కూడా నా కెక్కువమంది స్నేహితులు లేరు. అందులో ముఖ్యులంటూ ఎవ్వరూ లేనేలేరు. ఉన్న స్నేహితుల్ని యింటికి తీసుకురావటానికి వీల్లేదు. చదువు చెడ తిండితో నేను వాళ్ల యిళ్లకూ వెళ్లకూడదు. చాటుగా వెళ్లినా మార్యాన్తమయం కాకుండానే యిల్లు చేరుకోవాలి. గేమ్సు ఆడుకుంటూ ఆలస్యం చెయ్యడానిక్కూడా వీల్లేదు. మేం బ్రాహ్మణులం. వూళ్లో చాలమంది యితర వర్ణాల వారు. తాతయ్య పెద్ద భూస్వామి. పైగా సంస్కృతమూ ఇంగ్లీషూ క్షుణ్ణంగా చదువు కున్నవాడు. సంస్కరణోద్యమంలో చేరడం, వూళ్లో దేవాలయానికి పోటీగా భజనమందిరం కట్టించడంద్వారా ఏనాడో మిగతా బ్రాహ్మణుల నుండి వేరుపడ్డాడు. అన్నింటా అధిక్యత ఆయనదే! ఆయన పరువూ ప్రతిష్ఠ నిలబెట్టవలసిన బాధ్యత ఆయన ఆస్తికి వారసుడైన నాకు ఉంది అని ఆయన అభిప్రాయం. ఆ బరువు మొయ్యటమే నాకు మతరాము యిష్టంలేదు!

హనుమంతు, మా పెద్ద జీతగాడు, నన్ను అప్పుడప్పుడు వాళ్లింటికి తీసుకు వెళ్లేవాడు. వాళ్ళు కాపులు. వాడి కొడుకు వెంకటేశు నాకు రేగుపళ్లూ, నేరేడుపళ్లూ యిచ్చేవాడు. వాడూ నేను చదువుతున్న స్కూల్లోనే చదివేవాడు. వాడి చదువుకు తాతయ్య ధనసహాయం చేశాడు. వాళ్లమ్మ నాకు మజ్జిగ 'దాహం' యిచ్చేది. వెంకటేశుకంటె వాడి చెల్లెలు సుబ్బులు నన్ను బాగా ఆకర్షించింది. తర్వాత తర్వాత దానికోసమే వాళ్ల యింటికి వెళ్లేవాణ్ణి. ఆరేడేళ్ళ వయసులోనే సుబ్బులు నన్ను— పదేళ్లవాణ్ణి — నిర్భయంగా కవ్వించేది. మాట్లాడుతూ మాట్లాడుతూ చప్పున కావలించుకొని ముద్దులు పెట్టుకొనేది. ఏదో చేసి పారిపోయేది. ఇద్దరం కాలవగట్టున షికారు వెళ్లేవాళ్లం...... "నేను నీ పెళ్లాన్ని" అనేది సుబ్బులు.

హైస్కూలు చదువు ముగిశాక నాలుగేళ్ళు మద్రాసులో కాలేజీలో చదువుతూ నేను వూరి మొహం చూడలేదు. సెలవుల్లో కూడా మా అమ్మా నాన్నల దగ్గరకు వెడుతూ, అమ్మమ్మని అక్కడికే రమ్మనేవాణ్ణి. అప్పట్లో తాతయ్య జబ్బుపడి కొంత కాలం చికిత్సకోసం మా అమ్మదగ్గిరే ఉండవలసి వచ్చింది.

జబ్బుతో తాతయ్య చచ్చిపోతాడనీ, నేనూ అమ్మమ్మా, శాశ్వతంగా మా అమ్మానాన్నలతో ఉండిపోతామనీ అంతరాంతరాల్లో ఏదో నాకే తెలీని ఆశ ఉండేదనుకుంటాను. ఆనందంగా గడిచిన రోజులవి. చాల ఉత్సాహంగా సాగింది నా చదువు. చరిత్ర, సాహిత్యం నా అభిమాన విషయాలు. బి. ఏ. సెకండ్ క్లాస్‌లో పాసయ్యాను. నా బి. ఏ. పూర్తయ్యేప్పటికి తాతయ్యకు జబ్బు నయమైపోయింది. బి. ఎల్. చదువుతానన్నాను. తాతయ్య సమ్మతించలేదు. బి. ఎల్. చదివితే గ్రామాన్ని వదిలిపెట్టి, భూమీ పుట్రా పాలేళ్ళకు వప్పజెప్పి, పట్నంలో కాపురం పెట్టవలసి వస్తుందని ఆయన అభ్యంతరం. మా నాన్న జోక్యం చేసుకోలేదు. తాతయ్య మాటంటే ఆయనకూ అమ్మకూ వేదవాక్కు. అందుకే మా నాన్నంటే యిష్టంవున్నా గౌరవభావంలేదు నాకు. డబ్బుకోసం, ఆస్తికోసం తను ఒకసారి అమ్ముడు పోవడమే కాకుండా నన్ను శాశ్వతంగా తాకట్టు పెట్టేశాడని అనుకునేవాణ్ణి.

విసుగుతో అయిష్టంతో గ్రామానికి తిరిగి వచ్చిన నాకు సుబ్బుల్ని చూడగానే ప్రాణం లేచివచ్చింది. నాలుగేళ్ళలో సుబ్బులు పూర్తిగా మారిపోయింది. పాలవిడిచిన గోధుమవన్నె త్రాచులా, దాని మెరిసే వళ్ళూ, కళ్ళూ, ఆ చలాకీతనం, ఆ కవ్వింపూ, దాని మాటకారితనం, నన్ను పూర్తిగా లోబరచుకున్నాయి. సుబ్బులు తండ్రి సొంతంగా కొంత పొలం కొన్నాడు. వెంకటేటుకి ఫారెస్టు డిపార్టుమెంటులో ఉద్యోగం వచ్చి వెళ్లిపోయాడు. సుబ్బులు ఎసెసెల్సీ పాసై ఉంది.

సుబ్బులు మా యింటికి రావడం, మేడమీద నా గదిలో జాప్యం చేస్తూ ఉండిపోవడం మా అమ్మమ్మ గమనించింది:

"మేడమీద యింతసేపేం జేస్తున్నావే? అప్పుడే వెళ్తానంటావే!" అన్నది అమ్మమ్మ.

"పుస్తకాలు చూపిస్తున్నారు."

"నీ చదువు పూర్తయింది కాదటే!"

"ఎక్కడా! టీచర్ ట్రైనింగ్‌కి వెళ్లాలనుకుంటున్నా."

"అయితే ఉద్యోగం చేస్తానంటావా! వయసు వచ్చిన పిల్లవు మీ నాన్న నీకు పెళ్లి చేయడటే? ఏం తిరుగుళ్లవి! నే చెపుతానుండు............"

"ఆయన్నే అడగండి. నాకేం తెలీదు." అంటూ మూతి బిగించి తుర్రున పారిపోయింది సుబ్బులు. గడుసుగా 'ఆయన' అంటే ఎవరో తేల్చుకుండానే! నేను నవ్వుకున్నాను.

అమ్మమ్మ నాతో అన్న : "ఒరే సూర్యం, దాన్ని మేడ మీదకు పిలవకురా బాబూ! నీకు పుణ్యముంటుంది...... ఎంత అప్రతిష్ఠ!....... వద్దు నాయనా, చదువుకున్నవాడివి, ఏం వనులివి?....... నా మాట వినరా! మీ తాతయ్యకు తెలిస్తే మరేమన్నా ఉందా?" నా గడ్డం పట్టుకుని ప్రాధేయపడింది.

"తాతయ్య సంస్కర్త లేవమ్మా! మరేం ఫర్వాలేదు. పెళ్లాడమంటే ఆదేస్తే పోయె...... అయినా ఈ వెర్రవ్వాల్లో నన్ను జపం చేస్తూ కూచోమంటావా? సుబ్బులు నాకు చిన్నప్పట్నుంచీ స్నేహం. బావుంటుంది కూడాను......." అంటూ నవ్వుతూనే నా అభిప్రాయం వ్యక్తం చేశాను.

అమ్మమ్మ దిగాలుపడి చూచి మౌనం వహించింది.

తర్వాత అమ్మమ్మ ఏం చేసిందో సుబ్బులు మా యింటికి రాలేదు.

నేనే వాళ్లింటికి వెళ్లాను.

సుబ్బులు లేదు. ట్రైనింగ్‌కి గుంటూరు వెళ్ళిందని చెప్పాడు వాళ్ళనాన్న.

హనుమంతుతో మాట్లాడుతూ వుండిపోయాను. హనుమంతులో చాల మార్పు వచ్చింది. కొడుకూ కూతురూ చదువుకోవడం, తనకు సొంత కమతం ఏర్పడటం ఒక కారణం. అంతకంటె గ్రామంలో బలపడుతున్న కమ్యూనిస్టు పార్టీతో సంబంధము ఏర్పడటం ముఖ్య కారణం. ఎన్నో విషయాల్ని గూర్చి తనకు తెలీనట్టుగానే నన్ను కదిపాడు. సోషలిస్టు సిద్ధాంతాలతో నాకు పూర్తిగా ఏకీభావం వుందని తెల్సుకోగానే చాల సంతోషించాడు. క్రమంగా నన్ను పార్టీ వాళ్ళకి పరిచయం చేశాడు.

మా తాతయ్య మీదేకాదు, మా తాతయ్యలాంటి వాళ్లందరి మీదా నాకెంతో అక్కసు వుంది. త్రవ్వేకొద్దీ, నాకే ఆశ్చర్యం కలిగేలా, వాళ్ళ అన్యాయాలూ అప్రభంశాలూ నన్ను ఉత్తేజితుణ్ణి చేశాయి. మా తాతయ్య పేరుకు పెద్ద సంస్కర్త. విధవా వివాహాన్ని సమర్థించాడు. విగ్రహారాధననీ, మూఢ విశ్వాసాల్నీ నిరసించాడు. అంతే! అగ్రవర్ణాలతో శూద్రులతో సహపంక్తి భోజనాలదాకా ఫరవాలేదన్నాడు. కాని గాంధీగారి హరిజనోద్యమం ఆయనకు పచ్చి వెలక్కాయవలె అయింది. మింగుడు పడక అక్కడితో ఆగిపోయాడు. ఆర్థిక వ్యవస్థలోని హెచ్చు తగ్గుల మీద ఆధారపడిన వర్గవిభేదం, వర్గాల మధ్య స్పర్థ, ఆయన సుతరామూ ఒప్పుకోలేడు. చదువూ, సంస్కారమూ, సంప్రదాయమూ, వ్యక్తుల భావాల్నీ ప్రవర్తననూ నిర్ణయిస్తాయట. అవి భగవత్ప్రసాదితమైన తెలివితేటల మీద ఆధారపడతాయట. ఆర్థిక వ్యవస్థకూ, చదువుకూ, సంస్కారానికీ, ముడి పెట్టడం సరికాదంటాడు. సంస్కారం ఉన్నవాళ్ళూ, లేనివాళ్ళూ, అంటూ రెండు వర్గాలనీ, అందులో క్రింది వర్గంవారు కృషి చేసి సంస్కారం అలవర్చుకుని పై వర్గంలోకి వెళ్లే అవకాశం కల్పించటమే కర్తవ్యమనీ వాదిస్తాడు. అలాంటి అవకాశాలు ఆర్థికమైన వ్యవస్థమీద ఆధారపడి వుండటమే కాదు, 'సంస్కారం' అనేదే ఆర్థిక వ్యవస్థాపరిణామం తాలూకు విశేష ఫలితమంటే ఒప్పుకోడు! 'సంస్కారం' మాన

పుడు తొక్కవలసిన దారి, మానవత్వపు విలువ అంటాడు. భూస్వాములూ, ధనికవర్గమూ తమ అధికారాన్ని నిలుపుకోడానికీ, పేదసాదల్ని అణగద్రొక్కడానికీ చూపిస్తున్న మృగత్వాన్న ఈ 'సంస్కారం' అంటే, దాన్ని 'కుతర్కం' అంటూ త్రోసివేస్తాడు. ఇలాంటి చర్చలు ఒకటి రెండు జరిగాక సిద్ధాంతాలను గూర్చి వాదించటం మానేశాడు తాతయ్య.

"సరే, నీ ఆస్తిపాస్తుల విషయమైనా నువ్వు జాగ్రత్త పడాలి కదా! నువ్వు చెబుతున్న సిద్ధాంతాల ప్రకారమే అయినా నువ్వు కమ్యూనిస్టుల్లో చేరటం నీకు లాభదాయకం కాదు" అన్నాడు ఒకనాడు.

"తాతయ్యా! ఆస్తి ముఖ్యమా? సంస్కారం ముఖ్యమా? నువ్వే అంటావు సంస్కారం ముఖ్యమని. న్యాయం ఎటువైపు ఉన్నదో అటువైపు మొగ్గటమే ఉత్తమ సంస్కారం. పుస్తకాలు బట్టీ పెట్టిన చదువు, పాండిత్యం, సంస్కారం కాదు. నాకు కావలసింది సర్వమానవ కల్యాణం. మానవత్వం విలువే అన్నిటినీ మించిన విలువ" అంటూ ఆయనవాదం ఆయనకే అప్పగించాను.

"మానవత్వానికి నీతి నిజాయితీ లక్షణాలు. సంయమనం కావాలి. దౌర్జన్యం, హింస వర్జించాలి. మనస్సులు పెరగాలి. అందుకు భిన్నంగా ప్రవర్తిస్తూ, దాన్ని సమర్థించుకునే వారిలో కనిపించేది మానవత్వం కాదు, పశుత్వం."

"ఇవన్నీ కడుపులు నిండినవారు చెప్పే కబుర్లు! భిన్న వర్గాల మధ్య నీతి నిజాయితీ వగైరాలు నిలవ్వు. అవి ఒకే వర్గంలోని వ్యక్తుల మధ్యే చెల్లుతాయి."

తాతయ్య కొంతసేపు మౌనంగా ఉండి,

"నీలో ఈ అసంతృప్తికి కారణం?" అని సూటిగా ప్రశ్నించాడు.

"లోకంలో కళ్లెదుట కనిపిస్తున్న అన్యాయం. తోటి మానవుల దీనావస్థ. అంతకంటే ఏం లేదు." అన్నాను గొప్పగా.

తాతయ్య మళ్లీ మాట్లాడలేదు.

తాతయ్య నాకు పెళ్లి కుదిర్చాడు. చాల చాకచక్యంతో కుదిర్చాడు. ఆ సంబంధం మా అమ్మా నాన్నా కుదిర్చినట్లుగా, వ్యవహారం యావత్తూ వారి ద్వారానే జరిగింది. మా అమ్మ ముందు నేను బదులు చెప్పలేక పోయాను. అందుకు కీలకమైన కారణం, ఆలోచిస్తే, ఇవాళ అర్థమవుతోంది. వివాహంద్వారా, నేను జీవితంలో పోగొట్టుకున్న దేమిటో తిరిగి వస్తుందనీ, మా అమ్మకు చేరువౌతాననీ ఏదో అస్పష్టమైన ఆశ నన్ను ప్రేరేపించిం దనుకుంటాను. "చెల్లెళ్ళకు పెళ్లి చేయాలి. నువ్వు వెంటనే చేసుకోవడం ముఖ్యం" అని ఉద్బోధించింది అమ్మ. ముఖ్యంగా తాతయ్య జోక్యం నా కెక్కడా కన్పించక పోవడమే నన్ను సుముఖుణ్ణి చేసిందనుకుంటాను.

శాంత తెల్లగా పిండిబొమ్మలావుంది. చాల సుకుమారంగా వుంది. ఆమె నేం చేసుకోవాలో నాకు తెలీలేదు. ఆమెతో సంసారం మొక్కు తీర్చుకున్నట్లుగా ఉంది; ఉపోషం ఉంటూ ఫలహారం తిన్నట్టుగా, నాజూగ్గా ఉంటోంది గాని, కడుపునిండా భోజనం చేసిన సంతృప్తి లేదు.

వివాహం ద్వారా క్రొత్త జీవితం ప్రారంభమౌతుందనీ, నాలో మార్పు వస్తుందనీ, నాకేదో విముక్తి లభిస్తుందనీ భావించిన నాకు ఆశాభంగం కలిగింది. నా పెళ్లి తాతయ్యే కుదిర్చిన వైనం క్రమంగా తెలిసిరాగానే ఆ పొందుతున్న కాస్త తృప్తి ఎటో మాయమైంది.

ఒక అయిదేళ్ళ కాలం, పార్టీ రాజకీయాల్లో కార్యకర్తగా పనిచేస్తూ శాంతను గూర్చి పట్టించుకోవడం మానేశాను. మాకు సంతానం లేదనే బెంగ అమ్మమ్మకు తప్ప తాతయ్యకు ఉన్నట్టు కన్పించలేదు. ఉన్నా బయటపడలేదేమో! నేను పార్టీలో పలుకుబడి సంపాదించటం గమనించిన తాతయ్య నన్ను ప్రోత్సహించటం ప్రారంభించాడు! పట్టి ఆసక్తి కనబరచటమే కాదు, డబ్బు విషయంలోనూ ఉదారంగా ఉన్నాడు. ఎన్నికల్లో పార్టీ, టిక్కెట్టు మీద శాసనసభకు పోటీ చేశాను. ఓడిపోయాను.

ఓటమి తర్వాత రాజకీయాలపట్ల వైముఖ్యం కలిగింది. కమ్యూనిస్టుపార్టీ ఈ దేశంలో కలలపార్టీ అనిపించింది. ముఖ్యంగా తాతయ్య జోక్యం, పార్టీలో కొందరి ప్రవర్తనా నాకు నచ్చలేదను కుంటాను.

తాతయ్య జబ్బుచేసి మంచాన పడ్డాడు. తాళం చెవులు నా చేతికిచ్చాడు. ఇంటి వ్యవహారాలన్నీ నేను చూచుకోవలసి వచ్చింది. రాజకీయాలనుంచి వైదొలగడానికి ఈ పరిస్థితి దోహదం చేసింది.

ధన వ్యయంలోనే కాదు, ధన సంపాదనలోనూ, 'మజా' ఉందని గ్రహించాను.

ధాన్యం నిలవ చెయ్యడంలో, ధరలు పెంచడంలో, దొంగ రవాణా చేయడంలో, ఉద్యోగుల్ని బుట్టలో వెయ్యడంలో, వాళ్లకి ఎరపెట్టడంలో— వ్యాపార జీవన వైవిధ్యంలో ఉన్న జీవన వ్యాపార వైవిధ్యం నన్ను ఆకట్టుకొన్నది. రేసెస్, మద్యం, మదవతీ అన్నీ అనుభవానికి వచ్చేయి, పేకాట తప్ప. అదంటే అసహ్యం నాకు.

సుబ్బులు తిరిగి వచ్చింది.

సుబ్బులు తిరిగి రావటం ఒకవిధంగా నా అదృష్టం. ధన సంపాదన కంటె ధన వ్యయం మితిమీరిపోతూ, నన్ను నేను అదుపులో పెట్టుకోలేక వ్యసనాలకు లొంగిపోతున్న పరిస్థితిలో ఏం చెయ్యాలో తోచక తికమక పడుతున్నాను. శాంత కాన్పుకి వెళ్లింది. పెళ్లైన ఆరేళ్లకి వచ్చిన చూలు. చికిత్సకోసం తాతయ్య మా అమ్మా నాన్నల దగ్గర ఉంటున్నాడు. నాకు పూర్తి స్వేచ్ఛ.

సుబ్బులు రెండేళ్ల ట్రెయినింగ్ చదివి, ఎక్కడో స్కూల్లో నాలుగేళ్లు పనిచేసి, స్వగ్రామం బదిలీ చేయించుకుని వచ్చింది. మళ్ళీ మాకు స్నేహం కలిసింది. మూడు

వెలల్లో సుబ్బులు నన్ను అదుపులోకి తీసుకొచ్చింది. అనవసరమైన ఖర్చు మానిపించేసింది— అంటే రేసెస్, తాగుడు లాంటివి. నాకు మనస్స్థిమితం ఏర్పడింది. ఇంటిపట్టున వుండి వ్యవహారాలు చక్కబరచుకోగలిగాను.

మా సంబంధంలో రహస్యం అంటూ ఏమీ లేదు. హనుమంతు కొంత గొడవ చేశాడు. సుబ్బులు తనకు వేరుగా యిల్లు తీసుకుంది. మా సంగతి అమ్మమ్మకూ తెలుసు. గ్రామంలో అందరికీ తెలుసు.

శాంతకు పిల్లాడు పుట్టి చచ్చాడో, చచ్చి పుట్టాడో ఏదో జరిగింది. నేను వెళ్లలేదు. వెళ్లలేదని గొడవ జరిగింది. ఆ వూరి నుండి మనిషి వచ్చాడు. సుబ్బులు సంగతి వాళ్లదాకా వెళ్లిందట. మా అమ్మమ్మ నా గొంతు మీద కూచుంది.

"సరే వెళ్లి చూచి వస్తా" నన్నాను.

"కాదు, అమ్మాయిని తీసుకు రావాలి" అన్నది.

"సరే, వస్తే తీసుకొస్తాను." అన్నాను.

"సుబ్బులు సంగతేమిటి?" అని ప్రశ్నించింది.

"దాన్ని వదిలిపెట్టను."

"అది యిహ మళ్ళీ ఈ యింటి గడప తొక్కితే నేను బావిలో దూకుతాను."

"లాభంలేదు! నేనే ఈ యిల్లు విడిచి పోవాల్సి వస్తుంది." అన్నాను.

"అఘాయిత్యం పిల్లాడా, శాంత ఏం చేస్తుందిరా?" అంటూ ఏడ్చింది.

"నాకు తెలీదు."

"పోనీ........ ఈ యింటికి తీసుకురాకుండా ఆ ముండతో మరో చోటెక్కడైనా రహస్యంగా ఏడు...... ఏం? శాంతను రోష్టు పెట్టకు........"

నాకు నవ్వు వచ్చింది. "అలాగే" అన్నాను.

"నా మీద ఒట్టు!...... మా నాయనే!...... నా మాట విను........ శాంత మంచిదిరా, దాన్ని నొప్పి పెట్టకు....." అంటూ భోరున ఏడ్చేసింది.

నాకూ ఏడుపు వచ్చింది. చేతిలో చెయ్యిపెట్టి "శాంతనేమీ కష్టపెట్టను లేవే!" అన్నాను.

నేనటు శాంతను తీసుకు రావటానికి వెళ్లానో లేదో, తాతయ్య యింటికి తిరిగి వచ్చాడు. సంగతంతా బోధపరచుకున్నాడు. తాతయ్య ఆరోగ్యం కోలుకుంది. ఆయనకు ఎక్కడలేని ఓపికా వచ్చింది. వెంటనే వెళ్లి తన పలుకుబడిని తా ఉపయోగించి సుబ్బులికి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ వేయించాడు. నేను శాంతతో తిరిగి వచ్చేప్పటికి ఆయన మళ్ళీ తాళం చెవులు చేతికి తీసుకుని కూర్చున్నాడు.

శాంతను దిగబెట్టి నేను సుబ్బుల్ని చూడటానికి వెళ్లాను. సుబ్బులు తన బదిలీ విషయమై చాల కోపంగా వుంది. "నాకు హక్కులంటూ ఏమీ లేవా? మిమ్మల్ని వివాహమాడేందుకు ఎన్నో అవాంతరాలు, పోనీ లెమ్మనుకున్నా, మీరున్న వూళ్లో ఉండటానికీ, మీరున్న యింటికి రావటానికీ కూడా హక్కు లేదా?.. ఏమైనా సరే, మీరు నన్ను పెళ్లి చేసుకుని తీరాలి." అన్నది.

"అలాగే" అన్నాను అనాలోచితంగా.

"ఊరికే అనడం కాదు! ఆరేళ్లైనా పిల్లలు కలగలేదు, ఆమె ఆరోగ్యం ఎప్పుడూ బాగుండదు, ఆమె మీకు దాంపత్యానికి పనికి రాదు, అనే కారణాల మీద డైవోర్స్‌కి పడెయ్యండి......" అన్నది.

నేనేమీ మాట్లాడలేదు.

శాంతకు క్షయ అని డాక్టర్లు నిర్ణయించారు. ఆమె పుట్టింటి వారికి కబురుపెట్టి శాంతను మదనపల్లి తీసుకు వెళ్లాను. నేను తిరిగి వచ్చేస్తూంటే, మొదటిసారిగా, శాంత సుబ్బులు ప్రసక్తి తెచ్చింది: "నేను ఎట్టి అనారోగ్యం మనిషిని.. మీరు ఆమెనే ఎందుకు చేసుకోరాదు....... నాకేం బాధలేదు" అన్నది శాంతంగా, నిర్వికారంగా.

నాకు ఆశ్చర్యం కలిగింది. అది యించుమించు నా మనస్సులో వున్న భావనే! కాని శాంత అలా అనగానే ఆ భావన చెదరి పోయినట్లయింది. నేను చలించి పోయాను. నాకు మొదటిసారిగా శాంత అంటే చెప్పరాని అభిమానం, అనురాగం, కలిగింది. ఆమె చేతిని నా చేతిలోకి తీసుకుని "అది ఎప్పటికీ సాధ్యం కాదు! నేను నిక్కమ్మట్టీ...... నాకు చేతనైతే మారుతాను. మారటానికి ప్రయత్నిస్తాను. లేకపోతే నేనింతే అని సరిపెట్టుకో. నువ్వు నా దానివి." అన్నాను.

నా జీవితం పాములా ఎన్నో మెలికలు తిరిగింది. ఎన్నడూ తిన్నగా నడవలేదు!

నేను నీతికీ ఆదర్శానికీ బద్ధుణ్ణి కాలేక పోయాను.

పోతే, కోరిన విముక్తినీ స్వేచ్ఛనూ కూడా పొందలేక పోయాను.

అర్థం కాని శక్తి ఏదో నన్ను నాగపాశంలా చుట్టివేసింది. ఈ విషవలయంలో నుంచి ఎటూ నాకు విముక్తి లేదనే నిస్పృహ నాలో ప్రవేశించింది.

ఒకవైపు సుబ్బుల్ని వివాహం చేసుకుంటానని మాట యిచ్చాను. మరోవైపు శాంతతో 'మారటానికి ప్రయత్నిస్తాను' అంటూ అయాచితంగా ప్రమాణం చేశాను. ఈ రెండింటిలో ఎటువైపు మొగ్గటానికీ కావలసిన సంకల్పమూ, ప్రేరణా నాలో బొత్తిగా లోపించాయి. మాడు మీద దెబ్బతగిలిన మనిషి లాగ, చైతన్యమూ స్వయంనిర్ణయ శక్తీ కోల్పోయి రోజులు వెళ్ల దీస్తూ ఉన్నాను.

సుబ్బులు కోసం వెళ్ళినప్పుడు "డైవోర్స్ కేసు పడేశారా? ఎప్పుడు పడేస్తారు?" అంటూ విలపిస్తుంది. శాంత వ్రాసే ప్రతి ఉత్తరంలోనూ "మీరు నా కిచ్చిన మాట జ్ఞాపకము ఉందను కుంటాను. పనుల తొందరవల్ల మీరిక్కడికి రాకపోయినా నేను నిరాశ చెందటం లేదు. నా ఆరోగ్యం యిప్పుడు మెరుగ్గా వుంది." అని వ్రాస్తుంది.

ఏడాది తర్వాత ప్రయత్నించి సుబ్బుల్ని మళ్ళీ మావూరు బదిలీ చేయించాను. ఈ వూరు వచ్చిందో లేదో సాధికారంగా మొన్నరాత్రి నా మేడమీదకు వచ్చింది. కాని రాత్రంతా సాధింపే. "డైవోర్స్ ఎప్పుడు? పెళ్లెప్పుడు?"

తెల్లవారి సుబ్బులు మెట్లు దిగి వెళ్తుండగా తాతయ్య చూశాడు. మూడు నెలలుగా నాతో మాట్లాడ్డం మానేసిన తాతయ్య నా మీద ఉన్నట్లుండి విరుచుకు పడ్డాడు:

'నీతి జాతి లేని అప్రాచ్యుడి' వన్నాడు.......

'నీకూ నాకూ సంబంధం పోయిందిరా! నువ్విక్కడ ఉండటానికి వీల్లేదు' అని అరిచాడు......

'తక్షణం యింట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు.

అనేసి కర్ర తాటించుకుంటూ పొలం వెళ్ళిపోయాడు....

నా చిన్నతనంలో తాతయ్యచేత దెబ్బ తిన్న ఆ త్రాచే పెంచి వుండి ఇన్నాళ్లకు పగ తీర్చుకుందా? అది ఒక ఊహ! త్రాచుపాము ఎన్నాళ్ళు బ్రతుకుతుందో ఎవరికి తెలుసు? అది పగమీద ఎన్నేళ్ళు అయినా బ్రతకవచ్చు.

ఏమైతేనేం? తాతయ్యచేత దెబ్బలు తిన్న పామూ చచ్చి పోయింది, పాముకాటుతో విషమెక్కిన తాతయ్యా చచ్చి పోయాడు.

మిగిలింది నేను!!

*   *   *

మూడు నెలల తర్వాత ముగింపు:—

శాంత జబ్బు నయమై తిరిగి వచ్చింది.

సుబ్బులు నాతో సంబంధం త్రెంచుకున్నది.

"నీకు విశ్వాసం లేదు, కృతజ్ఞత లేదు. నా జీవితం నాశం చేశావు" అన్నది.

ఒకరు మరొకరి జీవితాన్ని నాశం చెయ్యటం సంభవమా?

నాకు పశ్చాత్తాపం లేదు. నాది పాపజాతి!



# ఋత - చిత్ - [illegible]

## The Supreme truth - Consciousness

శ్రీ వేలూరి శివరామ శాస్త్రి

వేరిమి లేని యీ యెరుక—యీ ఉన్నదంతా ఒకే ఒకటి అనే సత్యం, అతిమానసతత్త్వంలో ఎన్నడూ ఎడబాయకుండా ఉంటుంది! ఈ సత్యాన్ని అనుసరించే అక్కడ ఎప్పుడూ పని జరుగుతూ ఉంటుంది! మన మనస్సు కయితేనో ఈ ఏకత్వజ్ఞానం ఎరువు తెచ్చుకోవాలి. సాధనబలం వల్ల అప్పుడప్పుడు ఈ సత్యాన్ని తెలిసికొన్నా దాని స్వరూపసత్యం వేరు. విశ్వంలోనూ దాని గర్భంలోనూ ఉన్నదాని నంతా అతిమానసం తన స్వరూపంగా—ఆత్మస్వరూపంగా—ఒకే ఒక అఖండ అవిభాజ్య జ్ఞానంగా చూస్తుంది. ఈ అఖండభావమే దానికి ప్రాణం, అఖండత్వ జ్ఞానంతో చేసే పనిచేతనే దాని స్వప్రకాశం; కాబట్టియే సర్వాధారమయిన ఈ దివ్యచేతన తన సంకల్పం లేక ఇచ్ఛాశక్తి అనే తన ఒక ఆకృతి (Aspect) బలంచే విశ్వజీవన పరిణతిని నియంత్రితమూ పరిచాలితమూ చేస్తున్నదని చెప్పినా సమస్తమూ చెప్పినటులు కాదు! ఇది విశ్వజీవనాన్ని తనలో పరిపూర్ణం చేస్తూంది—,సత్తా జ్ఞానశక్తి క్రియలు తనలో తాము వేరుకాని అఖండ రూపమయిన ఒకానొక మహాక్రియా శక్తి ద్వారా చేస్తూంది అని చెప్పాలి. కారణమేమిటంటే విశ్వచి ద్విశ్వశక్తులు ఒకటే అని మనం తెలిసికొన్నాం, విశ్వచేతనే క్రియలో విశ్వశక్తి రూపంగా ప్రకాశిస్తుంది. అట్టి దివ్య జ్ఞానమూ దివ్య—ఇచ్ఛ, లేక సంకల్పమూ ఒకటే; సత్తా యొక్క ఒకే క్రియతో, ఒకే స్పందంతో ఈ ఉభయమూ ప్రకాశిస్తవి.

అతిమానసం అఖండమయిన సర్వాధారం, ఏకత్వం నుండి తొలగకే బహుత్వానికి గూడు. మన మనసుకు ఈ సత్యం తేటతెల్లంగా అనుభవం కావాలి. కాకపోతే విభజించి చూచే మనఃప్రమాదం నుంచి బుద్ధిని విడిచేసి విశ్వవిషయమయిన సత్యం తెలుసుకోడానికి ఏ విధంగానూ వీలుండదు. విత్తులోంచి మొక్క బయటికి వస్తూంది, అది విత్తులోనే ఇంతకాలం నుంచి ఉంటున్నది; మళ్లా మొక్కలోంచి విత్తు లభిస్తున్నది. ఏనాటి నుండో వస్తున్న ఈ రీతిని చూచి మనం 'మొక్క' అని అంటున్నాం. దానిలో తప్పని నియమమూ అపరివర్తనీయమయిన ప్రవర్తనము ఉన్నవి. కాని మొక్కయొక్క పుట్టుపూర్వోత్తరాలూ వంశ విస్తారమూ మన మనస్సు చూచి 'ఇది ఒక స్వతస్సిద్ధ వ్యాపారం' అనే చూపుతోనే తన విజ్ఞానాన్ని ప్రకటిస్తుంది. ఆ మనస్సు మొక్కను విత్తు గుండా విత్తును మొక్క గుండా వ్యాఖ్యానించి, ఇది ఒక ప్రాకృతనియమం అని అంటుంది. కాని ఇది తత్త్వానికి వ్యాఖ్యానమా? దీనివల్ల ఏం తెలిసినట్టు? దీనివల్ల వికాసధార ఒకటి, విశ్లేషించి చూపడం మరొకటీ: ఇంతే. మనస్సు అంతరగ్రాహ్యమయిన ఒక సచేతన శక్త్యనుభవమునూ పొంది అది ఈలాటి ప్రకృతి సత్తా అనిన్నీ మిగిలిన దంతా ఈ శక్తికి స్థిరంగా ఉన్న ప్రకాశధార అనిన్నీ తెలిసికోగలుగుతుంది. అలా అయినప్పటికీ రూపం అంటే అది ఒక వేరే వస్తువు, పృథక్సత్తా, అని తెలిసికోడం వంకనే మొగ్గుతుంది, ఇంకా దాని ప్రకృతి పరిణతిప్రణాళి వేరే అని అనుకుంటుంది. పశువులూ సచేతనములయిన మనుష్యులూ భేద దర్శనం వైపే మొగ్గడం వల్ల మనస్సు తాను ఒక వేరే వస్తువని కల్పన చేయ దొడగి తన్ను సచేతనమయిన విషయిగానూ మిగిలిన రూపాల నన్నింటినీ విషయాలనిన్నీ కాబట్టి అవి తన కంటె వేరనిన్నీ తలపోసి వేరుగా చూస్తుంది. వ్యావహారిక జీవనంలో ఇట్టి ఏర్పాటు అవసరం, ఇదే లోకవ్యవహారానికి పునాది. కాని మనస్సు ఇదే నిక్కమని అనుకొంటుంది. అందువల్ల అవామికవల్ల కలిగే భ్రాంతి వచ్చిపడుతుంది.

అతిమానసం మరొక రీతిగా పని చేస్తుంది. చెట్టూ దాని జీవనప్రణాళి వేరే సత్తాగనుక అయితే స్వస్వరూపంతో అవి వికసించడానికి సమర్థములయేవి కావు. ఇంతేకాదు వానికి సత్తాయే, ఉనికియే సంభవమయేది కాదు. విశ్వసత్తాలో గూఢమై ఉన్న వేగంచేత ఈ విశ్వరూప వికాసం జరుగుతుంది. సత్తాతోటే, వివిధాలయిన దాని విభూతులతోటే అన్యోన్య సంబంధ ఫలంగా రూప వికాసం కలుగుతుంది. వస్తువుల స్వధర్మంలో గల వైచిత్ర్యం, మహాప్రకృతిలో గల సర్వగత స్వభావ స్వరూపాల లీల. వ్యష్టి విశిష్ట పరిణామం, సమష్టి పరిణామ సామంజస్యం చేతనే నియంత్రితం ఔతుంది. అనగా ప్రదేశానుకూలమైన వ్యష్టి పరిణామ వైచిత్రి, పరిణామ సామాన్యం చేతనే తత్తదనురూపంగా విత్తువల్ల మొక్క యొక్క తత్త్వంగాని మొక్కవల్ల విత్తు యొక్క తత్త్వంగాని తెలియడానికి గాని తెలపడానికిగాని వీలులేదు. విశ్వతత్త్వంవల్ల ఈ రెంటినీ తెలిసికోడానికి వీలు కలుగుతుంది. అటుపిమ్మట ఈశ్వరునివల్ల విశ్వతత్త్వం తెలియబడుతుంది. ఈ అతిమానస తత్త్వం, లేక (Super Mind) విత్తులోనూ మొక్కలోనూ ప్రతిపదార్థం లోనూ అనుప్రవిష్టమై ఉన్నది. ఆ తత్త్వం బహుత్వంలో గల

**Statement about ownership and other particulars about newspaper**

## BHARATI

1. Place of Publication: Madras
2. Periodicity of its publication: Monthly
3. Printer's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1.
4. Publishers Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: (As above)
5. Editor's Name: Sri S. Sambhu Prasad
   Nationality: India.
   Address: 29, Chamier's Road, Madras-28.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 29. Chamier's Road, Madras-28. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street' Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. RADHAKRISHNA,
1-3-67. Signature of Publisher

ఏకత్వపు నట్టనడుమ ఉండిన్నీ అవిభాజ్యమయిన ఏకత్వజ్ఞాన మధ్యమందే నివసిస్తుంది. సర్వగ్రాహియైన యీ జ్ఞానంలో (Comprehension) సత్తాకు ఒక కేంద్రం వేరేలేదు, మన మానసంలో మిగతా అన్నిటికంటె వేరుగా విభిన్నమయిన అహంకారమున్నచందంగా అతిమానసంలో లేదు. ఈ తత్త్వంలో గల ఆత్మజ్ఞానంలో సమగ్రసత్తాయే సమానంగా సంప్రసారితమై ఉంది—ఏకత్వంలోనూ అద్వయమే, బహుత్వంలోనూ అద్వయమే, సకల దేశాలలోనూ సర్వత్రా అద్వయమే. ఈ తత్త్వంలో అంతా ఒకే ఒక సత్తా. ఇచ్చట అన్నిటి సత్తాయూ ఒక సత్తాయూ సత్తాసామాన్యమే; ఇచ్చట వ్యక్తి సత్తా కూడా యుగపత్సర్వాత్మభూతమూ బ్రహ్మభూతమూ, కాబట్టి అచ్చట పరమతాదాత్మ్యంతో ఏకరసం, ఎందువల్ల నంటే ఈతాదాత్మ్యబోధయే అతిమానస జ్ఞానంలో గల గాఢసత్యం, అతిమానసం ఆత్మప్రత్యయం యొక్క అంశం. సమరస మయిన ఏకత్వం యొక్క విపులమయిన ప్రసారంచేత సత్ స్వరూపానికి విభక్తత్వంగాని విరియబారటంగాని ఉండదు, తత్ప్రసారం సమంగా వ్యాపించడంచేత ఆ ఏకత్వం అద్వయ రూపంతో విభుత్వాన్ని—అనగా వ్యాపకత్వాన్ని, (Pervading its Extension as One) ఆపాదించి బహురూపాలలో గూడా అద్వయత్వాన్ని వాసితం చేస్తూంది. కాబట్టి ఎక్కడబట్టితే అక్కడ ఆ అఖండ—అద్వయ—బ్రహ్మ, 'సర్వత్ర హి సమం బ్రహ్మ'. దేశకాలాలలో సత్ స్వరూపపు ఈ ఆత్మప్రసారణం, భూతంలో—భూతంలోనూ తన యీ నివాసం: ఇదియున్నూ నిర్విశేషమయిన తన అద్వయభావం యొక్కయే అంతరంగలీల, ఎంచేతనంటే అది నిరుపాధిక మయిన తన అఖండ స్వరూపమయిన ఏకత్వంలోనుంచే వచ్చింది. అయినా పరమైక్యంలో కేంద్రమూ లేదు మరి పరిధీ లేదు, అది కేవలంగా దేశకాలాతీతం 'ఏకమే వాద్వితీయం'. అది వ్యాప్తి లేని బ్రహ్మములో ఘనీభూతమై పరమైకత్వం ఉన్నది. వ్యాప్తిలో అది స్వభావంగా ఇట్టే సమతతో వ్యాప్తమయిన ప్రత్యయ రూపంగా అనగా జ్ఞానరూపంగా చూపబడుతుంది. అఖండమూ సర్వగాపీ సర్వగ్రాహీ అయిన ఈ సంవిత్ స్వరూపంలో, విశ్వంభరమూ అవిభక్తమూ అవికీర్ణమూ అయిన అధివాసంలో ('సర్వభూతాధివాసః') లోకోత్తర మయిన యీ అద్వైత విలాసంలో బహుత్వ లీలచే గూడా అది తరగదు అరగదు. 'సర్వభూతాలలోనూ బ్రహ్మము, సర్వ భూతాలూ బ్రహ్మములో, అన్ని భూతాలూ బ్రహ్మమే'—అనే ఇది, సర్వజ్ఞమయిన అతిమానసం యొక్క త్రివిద్యా రూప గాయత్రి. ఆత్మప్రకాశం యొక్క ఏకైక సత్యమే ఈ మూడు రూపాలను ఈ మహాత్రిపుటిలో పెట్టి ఒకటిగా ఉంచుతుంది; అసంకీర్ణమయిన ఆత్మదృష్ట్యనుభవం చేత అవిభక్తమయిన ఈ పరమ విద్యయే విశ్వంలో అతిమానస మూలమంత్రం.

ఇలా గనుక అయితే మనచేత ఈ ప్రపంచంగా చూడబడే మనః ప్రాణ జడాల సృష్టిలేక రచన—ఈ అవరచేతన లీల, ఎక్కడి నుంచి వచ్చింది? ఈ విశ్వంలో ఉన్న దేదికానీ అది అంతా, ఏదిబడితే అది చేయగల సామర్థ్యం గల అతిమానసం యొక్క సృష్టి అయినప్పుడు, ఆ అతిమానసపు సచ్చిచ్ఛక్త్యానందాల

అనాది లీల అయినప్పుడు, ఆ అతిమానసం లేక ఋత—చిత్ ఇచ్ఛాశక్తిలో ఎక్కడో ఏమూలనో ఆ సచ్చిదానందాలను భంగించి అవరలోకంలో మనః ప్రాణ జడధాతువును సృజించాలనే వృత్తి స్ఫురించి ఉండాలి. సృష్టిశీలమయిన ఋత—చిత్ గాఢశక్తిలో మన కీ వృత్తితో సాక్షాత్పరిచయం కలుగుతుంది. ఇది అతిమానస ప్రజ్ఞానశక్తి, ఇది తనలో నుండి, దేనిని పయికి వెలువరిచినా దానిని, తన యెదుట నుంచుకొని అట్లా ఉంచిన పదార్థాన్ని విషయరూపంగా[1] చూచే శక్తి, ఇంకా—సంవిత్ లేక ఆత్మజ్ఞానం తన్ను కేంద్రీభూతం చేసికొని, ద్రష్టృరూపంగా లేక జ్ఞాతృరూపంగా తనయే వనినుండి తొలగగోరెనా అన్నటులు గానూ, ఆ వనినే దృశ్యంగా లేక జ్ఞేయంగా తానటం చే చూడనూ తెలియనూ కోరుతూందా అన్న చందంగానూ అయిపోవడం ఈ శక్తి కతాననే. ఇంతకుముందు సమభావంగా వ్యాప్తమయిన సంవిద్రూపాన్ని గూర్చి చెప్పాను, అయితే ఇపుడు కేంద్రీభూత రూపం గూర్చి చెప్పనే దానివల్ల ఆ సమవ్యాప్తి తావులో విషమవ్యాప్తి చూపడుతుంది, దానివల్ల ఆత్మవిభజనం అథవా ప్రతీయమానం అయే ప్రతిభాసకు అంకురార్పణం అవుతుంది.

తొట్టతొలుత జ్ఞాత, తెలివిలో—జ్ఞానంలో కర్తగా ఏకాగ్రత చెంది తన్ను సమాహరించుకొని ముడుచుకొని ఉండి, తన చిచ్ఛక్తి తనలో నుండి ధారావాహికంగా తన మూర్తిలోకి ప్రవహిస్తున్నటులున్నా తానా మూర్తికల్పనలో అవిరామంగా మునిగిపోతూ, తన్ను తనలోకి మళ్లా చేటుకొంటున్నటులున్నా, మళ్లా ఎడతెగకుండా వెలువరిస్తూ ఉన్నటులున్నా తలపోస్తాడు. ఆత్మ వి—పరిణామం యొక్క ఈ ఒక్క చెయిదివల్లనే ప్రపంచంలో సాపేక్షికమయిన వ్యావహారిక దృష్టి సాపేక్షికమయిన కర్మ యొక్క పునాదీ ఇత్యాదిగా ఎంత భేదజ్ఞానం కలగాలో అంతా కలిగింది. జ్ఞాతా జ్ఞానమూ జ్ఞేయమూ వీని నడుమనూ ఈశ్వరుడూ శక్తీ శక్తిసంభూతి, విభూతులూ వీని నడుమనూ భోక్తా భోగమూ భోజ్యమూ వీని నడుమనూ బ్రహ్మమూ మాయా సంభూతీ వీని నడుమనూ వ్యావహారిక భేద సృష్టి అయింది.

ఇటు విదప—ప్రజ్ఞానం యొక్క[2] ఖేలలో జ్ఞానంలో సమాహృతుడయిన అనగా ఏకాగ్రతచెందిన యీ చిన్మయాత్మ—యీ పురుషుడు తనలో నుండి వెలువడుచున్న తన శక్తికి, తన ప్రకృతికి ద్రష్టయై పరిపాలకుడై తన యొక్కయే రూపాలన్నిటిలోనూ తన ప్రతిరూపాన్ని ఆవృత్తి చేస్తూ పోతాడు. అతడు తనశక్తి ననుగమించి ఆ శక్తి చేసే పను లన్నింటిలోకి తాను దిగిన చందంగా అచట ఆత్మవిభాగమను పనిని మరల మరల చేస్తూనే పోతూ వుంటాడు. ఈ ఆత్మవిభాగంవల్లనే ప్రజ్ఞాన చైతన్యం అనగా భేదజ్ఞానం పుట్టుకొచ్చింది. ఈ రీతిగా ప్రతిరూపంలోనూ తన ప్రకృతిని అమ్మట్టం చేసి పురుష డధిష్ఠించి ఉన్నాడు. ఇట్లా ఉంటూ ఆయా చేతన యొక్క కల్పితబిందువు నుండి తిరుగా రూప రూపంలోనూ తన యొక్కయే ప్రతిరూపాన్ని చూస్తున్నాడు. ఒకటే ఆత్మ, అన్నిటిలోనూ ఒకే ఒక దివ్యపురుషుని నివాసం: బహు బిందువులలో తన వినియమాదరణం, కేవలం సంవిత్తికిది వ్యావహారిక ప్రవృత్తి. దీనికి ప్రయోజనం విశ్వంలో ఎక్కడ బడితే అక్కడ భేదలీల—అన్యోన్య—జ్ఞానం, అన్యోన్య—మేళనం అన్యోన్య—సంఘాతం, అన్యోన్య—సంభోగం: వీని ఆట. వీనిలో స్వరూపగతమయిన అభేదంమీదనే భేద ప్రతిష్ఠ, తిరుగా విచిత్రాలయిన రూపాల కల్పనా కలాపంలో అభేదోల్లాసం కూడానూ.

సర్వగతమయిన అతిమానసం యొక్క ఈ కొత్త తీరు వస్తుగత—అద్వయ స్వభావ సత్యం నుంచి అఖండచేతనా సమగ్రత నుంచి కొంచెం దవుదవ్వుగా జారి చక్కాపోయినటులు కనబడుతుంది. ఇలా ఐనప్పటికీ విశ్వసత్తా యొక్క విబ్బరం, ఎన్నడూ ఎడబాయని అద్వయభావం మీదనే. ఇంకా కొంచెం దవుదవ్వుగా జారుకొన్నంతనే ఆ తీరు అవిద్యలోకి దిగిపోతుందని తోస్తుంది—ఈ అవిద్య, అసలు ఇక్కడ ఉన్నది బహుత్వమే అని అనుకొని 'అహం' రూపమయిన మిథ్యా—ఏకత్వాన్ని పట్టుకుని మళ్లా యాత్రారంభం చేస్తుంది. వ్యక్తిత్వ బిందువును జ్ఞాత యొక్క అధిష్ఠానకేంద్ర మని ఒకసారి అనుకొన్నామంటే, ఇంద్రియ సంవేదన రూపంగా, బుద్ధి యొక్క విలాసంగా, సంకల్పపు ఆకారంగా మనసు యొక్క చిత్రవిచిత్ర వ్యాపార ధార అంతా దాని సకల పరిణామాలతో మన కమల వ్రేలుతుంది. కాని అతిమానస క్షేత్రంలో ఎంతవరకు పురుషుని లీల ఉంటుందో అంతవరకూ, అవిద్య తల యెత్తలేదు—ఈ మాట ముమ్మాటికీ నిక్కం. కాబట్టే ఆ కొత్త తీరు తెన్నులలో అద్వయ భావాన్ని నిరాకరించకుండానే ఋత—చిన్మధ్యంలోనే జ్ఞానం యొక్కయు కర్మ యొక్కయు ఖేల.

దీనికి కారణమేమిటంటే బ్రహ్మము తన్ను సర్వగతమయినే అద్వయ రూపంగా తలచడమూ ఉన్నదానినంతా తన యొక్కయే పరిణామరూపంగా, అభిన్ననిమిత్తోపాదానరూపంగా చూడడమూ. ఈశ్వరుడు ఆ కొత్త తీరులో గూడా శక్తి యొక్క లీలను స్వరూపం యొక్క లీల అని అనుకోవడమూ లోపలా వెలుపలా ఉన్న అన్ని భూతాలనూ తన యొక్కయే రూపాలుగా అనుభవం పొందడమూ. ఆయా భోక్తకు నానాత్వంలో గూడా తన యొక్కయే ఆత్మసత్తాను భుజిస్తున్న జ్ఞానం అప్పుడున్నూ ఉన్నది. ప్రకృతి పరివర్తనం మాత్రమే ఒక్కటి జరిగింది, ఇపుడిక చైతన్యం సర్వదా సమానంగా ఘనీభూతంగా లేదు, ఇపుడు చైతన్యానికి (వి—సమత) వైషమ్యం ఆరంభించింది, శక్తి కూడా నానారూపంగా బహుత్వంలో వైశల్యం పొందింది. చైతన్యంలో ఒక వ్యావహారిక వైశిష్ట్యం అనగా లోకవ్యవహారంతో సంబంధం కలిగి నీవూ నేను, (విషయమూ విషయి) అనే జ్ఞాన భేదం చూపట్టిందికాని స్వస్వరూపంలోగాని ఆత్మదృష్టిలోగాని ఏ కొంచెమో ప్రకృతభేదంగాని విభాగంగాని చూపట్టలేదు. ఇది మనోమయ చేతనకు భూమిక అయినప్పటికీ మన మనస్సు

1. Projection.
2. Apprehending Consciousness.

మాత్రం కాదది. మూలస్థానంలోనికి పోయి మనస్సు ఎక్కడ పుట్టిందో దానిని పట్టుకుంటే ఈ రీతిగా వచ్చి నిండొక్కుకున్న ఈ అతిమానవ స్థితి స్పష్టంగా తెలుస్తుంది. అందుకు గట్టి ప్రయత్నం అవసరం. కారణ మేమిటంటే: అతి ఎత్తూ అతి విశాలమూ అయిన ఋత—చిత్తు యొక్క వెత్తం నుండి వేదిమిలోకి చీకటిలోకి తలకిందుగా జారిపడిన మనస్సుకు అది అది బిందువు. ఇంతవరకూ మన బుద్ధికి తిన్నగా ప్రచురంకాని, స్పష్టంకాని భాషతో దీనిని తెలపడానికి చాలా శ్రమించాను కాని కడుదవ్వుగా ఉన్న ఆ అతిమానవం యొక్క అనుభవం పొందడం కంటె ఆ అతిమానవం యొక్క ప్రజ్ఞానరూపాన్ని[3] తెలిసి కోడమూ అనుభూతిలోకి తెచ్చుకోడమూ మనకు చాలా సహజం. ఎట్లాగంటే మన కాప్రజ్ఞాన చైతన్యం ప్రతివేశి,— మన పొరుగింటిదే. మన మనస్సు యొక్క క్రియాకలాపాల పూర్వాభాగ దాంట్లో ఉంది. కాగా మనం దాటవలసిన అడ్డంకి అంత గడ్డుదికాదు.

---

3. Apprehensive truth-Conciousness' లేక ఋతంభర 'ఋతంభరా తత్ర ప్రజ్ఞా' యోగదర్శన— 1-48. 'తస్మిన్ సమాహిత చిత్తస్య యా ప్రజ్ఞా జాయతే, తస్యా ఋతంభరా ఇతి సంజ్ఞా భవతి. అన్వర్థా చ సా, సత్య మేవ బిభర్తి, న చ తత్ర విపర్యాస జ్ఞానగంధో ఽప్యస్తి,— వ్యాసభాష్యం; నిర్విచార సమాధి నైశారద్యం కలిగితే అంతఃకరణం రజస్తమస్సులుపోయి శుద్ధసత్త్వం అవుతుంది. ఏకాగ్రమయిన చిత్తంలో సమాధి కలిగితే ఆ సమాధివల్ల నిండు ప్రజ్ఞ కలుగుతుంది. అట్లా కలిగిన తరువాత ఆ ప్రజ్ఞ (ప్రజ్ఞానం) చిత్తంలో పాతుకొనిపోతుంది. అట్టి ప్రజ్ఞానానికి 'సమాపత్తి' అనిపేరు. (1—47). ఆ ప్రజ్ఞయే ఆ ప్రజ్ఞానమే ఋతంభర. ఋతం=సత్యమును, భర = భరించేది. అనగా రజస్సు తమస్సు తొలగిన బుద్ధిని బుద్ధిసత్త్వమని అంటారు. దానిలో సత్యమే గోచరిస్తుంది. మానవుని మనస్సు నిర్విచార సమాపత్తిలో దానిని సాధింపగలదు. అతి మానవతత్త్వానికి ఆ ప్రజ్ఞానం—ప్రజ్ఞ—ఋతంభర ఒక ఆకృతి. Aspect (అనువాదక.)

---



కథానిక:

# అంతస్థుకు దాసులు!

శ్రీ వి. యస్. సుఖ్‌ఠణ్‌కర్

సాయంకాలం నాలుగున్నర కావస్తోంది. పాంజిమ్ పడవల రేవులో జనసమ్మర్దం తగ్గింది. ప్రయాణీకులంతా వెళ్ళి పడవలో కూర్చున్నారు. చివరి గంట మ్రోగి లాంచీ బయలుదేరడానికి ఇంకా కొన్నినిమిషాల వ్యవధి ము వుంది. సరిగ్గా అప్పుడే కొంతమంది జనం ఆదరాబాదరా పరుగెత్తుకుంటూ రేవు చేరుకున్నారు.

పంధొమ్మిది వందల ఇరవై ఆ ప్రాంతాలలో గోవాలో పడవ ప్రయాణం ఒక కుటుంబ వ్యవహారంలా అన్యోన్యంగా వుండేది. లాంచీని నడిపే మనుషులు ప్రయాణీకుల సౌకర్యాన్నే ముఖ్యంగా ఎంచేవారు. అందుచేత ఈ రోజు ఆలస్యంగా వచ్చిన జనం పట్ల లాంచీవారు సానుభూతితో వ్యవహరించి, వారిని కూడా ఎక్కించుకోవడానికి సాయపడ్డారు.

ఈ ఆలస్యంగా వచ్చినవారికి పెద్ద ఒక హిందూ యువకుడు. వయస్సు ముప్ఫై యేళ్ళు వుండవచ్చు. ఆయన వెంట ఆయన భార్య, ముగ్గురు పిల్లలు, ఒక పనిమనిషి, గాడ్* వున్నారు.

ఆయన పేరు భూతేబాబు. ఖరీదైన మాంచెస్టర్ ధోవతి కట్టుకొని వున్నాడు. కాని ఆయన షర్టు కాలరు, టై, బూట్లు, చేతిలో వున్న సిగరెట్ చూస్తే బూజో సంస్కృతి గోచరిస్తూ వుంది. గోవాలో విద్యావంతులైన హిందువులలో అలాంటి వేషభాషలను, నాగరికతను చూడవచ్చు. ఆయన భార్య సీతాబాయి కులీన హైందవ స్త్రీవలె పూర్వాచారపరాయణురాలి వలె కన్పిస్తూ వుంది. కాళ్ళకు బరువైన వెండిగొలుసులు, కాలి వ్రేళ్ళకు మట్టెలు వున్నాయి. కాళ్ళకు చెప్పులు లేవు. విలువైన మాహేశ్వరి చీరె కట్టుకొని వుంది. తన నడక వయ్యారం చూచే వారికి కన్పించకుండా అడుగడుగుకూ చీరె సవరించుకుంటూ వుంది. మెడలోనూ, ముక్కుకూ, చెవులకూ, చేతులకూ, కాళ్ళకూ గల బంగారు ఆభరణాలూ, ముత్యాల హారాలూ, వెండి నగలూ చెప్పుకోదగ్గ బరువే అని చెప్పాలి. ఆమె సహనానికీ, శాంత స్వభావానికీ ఆ నగల భారమే ప్రత్యక్ష దృష్టాంతంగా వుంది. మరి హైందవ గృహిణికి వుండే గుణవిశేషాలలో అవి రెండే శ్రేష్ఠమైనవి కదా! తలపై పెద్ద పూల బుట్ట మోస్తున్నదా అన్నట్లు చిక్కగా పూదండలు పెట్టుకుంది. ఆమె పనిమనిషి జంగీ కూడా ఆమెను అనుసరిస్తున్నట్లుగానే వుంది. కాకపోతే జంగీ చీరె ముతకరకపు చీరె. దాని నగలలో బంగారం, ముత్యాలకు బదులు వెండి, గాజుపూసలు కన్పిస్తాయి. గాడ్ పేరు కామ్యా. వాడు ప్రకృతి జీవివలె అనాగరికంగా వున్నాడు. చిన్న ఎర్రని వస్త్ర మొకటే మొలకు చుట్టుకున్నాడు. పెద్ద తలపాగా పెట్టుకున్నాడు. ఇక వేరే బట్టలేవీ లేవు. చెవులకు ఇత్తడి పోగులున్నాయి. నడుముకు మూడుపేటల వెండి త్రాడు వుంది. అతని తెగవారిలో అతని కొక అంతస్తు వుందని ఆ వెండిత్రాడే చెబుతున్నది. కాబట్టి చూచేవారి నందరినీ అది ఆకర్షించే విధంగా దానిని కట్టుకున్నాడు.

రేవుకు వచ్చిన ప్రయాణీకులందరిలో భూతేబాబు, సీతాబాయి, జంగీ, కామ్యాలు వింతగా కన్పిస్తున్నారు. ఆదరాబాదరా ఒకరినొకరు నెట్టుకుంటూ తొక్కుకుంటూ బెదురు చూపులతో లాంచీ పైకి వారు చేరుకుంటున్న విధం లాంచీ పైతట్టున కూర్చున్న క్రైస్తవ ప్రయాణీకులకు కొంత వినోదం కలిగించింది.

ఈ గందరగోళంలో వాళ్ళ పిల్లవాడు వినూ ఏడ్పుకు లంకించుకున్నాడు. వాడు ఐదేళ్ళవాడు. కొత్తగా తొడిగిన బూట్లు వాడి కాళ్ళను కరుస్తున్నాయేమో, రేవులోనే చతికిల పడ్డాడు. భూతేబాబు వాణ్ణి సముదాయించి లేపి నడిపించబోయే లోపున జంగీ చంకలో వున్న మూడేళ్ళ ఉపీ జంగీ చేతిలోని తమలపాకుల సంచీ లాక్కొబోయి దాన్ని అందనివ్వక పోయే సరికి వినూతో శ్రుతి కలిపి ఏడవడం మొదలెట్టింది. జంగీ సంచిని దాచబోయేసరికి అది జారి క్రింద చెక్కల సందులలో నుంచి నీళ్ళలో పడింది. పాపం, జంగీ ఇక ఏం చేస్తుంది! ఎన్నో యేండ్ల నుంచీ తనను విడవకుండా అంటిపెట్టుకొని వున్న సంచీ. పావుగంట కొకసారు అందులో నుంచి ఆకో వక్కో తీసుకొని వేసుకొనేది. తన ప్రాణంతో సమానమైన సరది. లాంచీ బైలుదేరడానికి చివరిగంట కొట్టారు. కాని జంగీ అక్కడినుంచి అంగుళం కదలలేదు. పడవమనిషి ఎవరైనా నీటిపై తేలి

---

* గాడ్ అంటే గోవాలోని శ్రామికవర్గానికి చెందిన ఒక కులం. వీరి జీవనవిధానం ఆటవికుల మాదిరిగా ఆదిమ రీతిలో వుంటుంది.

కొట్టుకుపోతూన్న తన తమలపాకుల సంచిని తెచ్చి ఇస్తారేమో అనుకుంది. యజమానురాలు సీతాబాయి ఎవరూ కానకుండా దాని చేతిని గిల్లి మెలిపెట్టి చెవిలో "పదువు, తెలివి తక్కువ పెద్దమ్మ" అని కసిరేసరికి జంగి లోపల ఏడ్చుకున్నా, బైటికి కిక్కురుమనకుండా లాంచీలో అడుగుపెట్టింది.

క్రైస్తవ ప్రయాణీకులు తమను చూచి నవ్వడం గమనించి సీతాబాయి తడబడింది. తొట్రుపాటుతో చేతుల్లో పసిపాపతో లాంచీలో కాలు పెట్టబొయ్యేసరికి చీరె పైట చెరగు తలుపు గడియలో ఇరుక్కుంది. ఆమె ముందుకూ పోలేదు. వెనక్కి అడుగు వేసి పైట చెరగునూ తీసుకోలేదు. ఈ అవస్థలో వున్న తనకు దగ్గిరలోనే వున్న భర్త భూతేబాబు సాయపడవచ్చు. కాని కులీన హైందవ కుటుంబానికి చెందిన ఆయన పదిమంది ఎదుట భార్య పైట చెంగును ముట్టుకునే టంతటి అమర్యాదకు పాల్పడలేడు. ఆత్రపాటుతో ఆమె చెంగును తీసుకొనే ప్రయత్నం చేస్తూ వుంటే, అది ఎంతకూ రాకపోతూ వుంటే అతను కళ్ళప్పగించి చూస్తూ ఆమె అజాగ్రత్తకు లోపల శపించాడు కూడా. ఈ లోపల అదృష్టవశాత్తూ పడవబ్బి ఒకరు పైకి వచ్చి ఒక్క కుదుపుతో చెంగును ఇవతలకు తీసి ఆ దంపతుల ఇరకాటపు అవస్థను అంతం చేశాడు. లాంచీ బయలుదేరింది. అంతట భూతేబాబు, తలపై బుట్టతో వున్న కామ్యూ పడవ తట్టు మీద వచ్చినద్దారు.

కామ్యూ, జంగీలను పడవ దిగువ తరగతిపై కూర్చో బెట్టి, భూతేబాబు సీతాబాయి వారి పిల్లంతో సహా పడవపై తరగతికి వెళ్ళి కుర్చీలలో ఆసీనులయ్యారు.

ఎలాగైతేనేమి పడవ ఎందుకున్నామన్న సంతృప్తి కలిగినప్పటికీ భూతేబాబు ముఖంలో సీతాబాయిపై ఆయనకు కలిగిన చిరాకు, కోపం స్పష్టంగా గోచరిస్తూ వున్నాయి. అతను ఆమె పక్కనే కూర్చున్నాడు. కాని వీపు ఆమె కేసి పెట్టుకు కూర్చొని మాటామంచీ లేకుండా వున్నాడు. చివరకు కోపం ఆపుకోలేక తటాలున ఆమెకేసి తిరిగి వొసలు చిట్లించి "వెర్రి మొహమా, నువ్వెప్పుడూ ఇంతే. నీ తెలివితక్కువ వల్ల రెండు రోజుల నుంచీ మనకు లాంచీ తప్పిపోతూ వచ్చింది. ఈ రోజంతా నేను ఈ ప్రయాణ సన్నాహం చేయబట్టిగాని, లేకపోతే ఇవాళ కూడా పడవ అందక దేవమొహాలు వేసే వాళ్ళం. పశువుల మందను తోలుకుపోవడం సులభమేమో కాని నీవంటి వెర్రి మొద్దును పెట్టుకు ప్రయాణం చేయడం చాలాకష్టం. నీలాంటి గుదిబండను తగిలించుకొని ఇక నేనెన్నడూ ఎక్కడికీ ప్రయాణం చేయను" అన్నాడు.

"నేనేం చేయనండి? బంధువుల ఇంటికి వొచ్చామయ్యె. ప్రతిదీ వాళ్ళ ఇష్టానుసారం చేయవలసి వచ్చె. నాకో రవిక గుడ్డ పెడదామని పిన్ని నిన్న అంతా దేవులాడింది. ఇవాళ అంతా సిద్ధమై తీరా బయలుదేరే వేళకు తలలో పూలయినా పెట్టుకో కుండా ఎలా వెడతావని చెప్పి పూమాల కోసం పంపె. అది కొంత జాగయ్యె! శుభమా అని ప్రయాణం చేస్తూ పూలు లేకుండా ఎలా బయలుదేరనండి? పొద్దున లేస్తే వంటింట్లో జీవితం వెళ్ళబుచ్చే మాకు మీ మగవాళ్ళ గడియారాల పోకడలు, లాంచీల రాకపోకలు ఏం తెలుస్తాయి?" అన్నది సీతాబాయి. ఈ మాత్రం జవాబు చెప్పి ఆమె భర్త చూపుతో చూపు కలపలేక బిడియంతో క్రిందికి చూస్తూ వుంది. భూతేబాబు తన కుర్చీని ఆమెకు దగ్గిరగా జరుపుకొని మరి నాలుగు చీవాట్లు పెడదామని అనుకొంటూ వుండగా ఎదుటి నుంచి ముసిముసి నవ్వు వినిపించింది. భార్యాభర్త లిద్దరూ కళ్ళెత్తి చూచారు. వారి కెదురుగా ఒక క్రైస్తవ యువకుడు కూర్చొని వున్నాడు. అతను వీరి కేసి తృణీకార భావంతో చూస్తూ వీరిద్దరిని గూర్చి తన భార్య చెవిలో ఏదో వెటకారంగా చెబుతున్నాడు.

క్రైస్తవ దంపతులు మంచి విలువైన పాశ్చాత్యపు దుస్తులు ధరించి వున్నారు. పోర్చుగీసు భాషలో ధారాళంగా మాట్లాడుతున్నారు. వారి వేషభాషలను బట్టి చూస్తే ఆ యువకుడు పెద్ద ప్రభుత్వోద్యోగి అని ఎవరైనా ఇట్టే పోల్చుకోవచ్చు. తమ మాటలు ఎవరికీ వినపడకుండా వుండాలని భూతేబాబు, సీతాబాయి అక్కడికీ జాగ్రత్తపడ్డారు. కాని తమ మధ్య జరిగిన దంతా ఆ జంట విన్నదని గ్రహించి ముఖాలు చిన్నబుచ్చుకున్నారు.

ఆ క్రైస్తవ యువకుడు భార్యతో "ఎలైన్, ఈ హిందువులు భార్యల ముందు ఎంత ధూంధాం చేస్తారో చూశావా? బైటికి వస్తే వట్టి పిరికిపందలు. చూడబోతే పెద్ద భూస్వామిలా వున్నాడు. తాను ఏ ఢిల్లీ మొగలు పాదుషాయో, లేక ఆఫ్రికా దొరో అన్నట్లు భార్యతో ఎంత దర్పంగా మాట్లాడుతున్నాడో చూడు" అన్నాడు. ఆ యువతి కూడా అతనితో ఏకీభవిస్తూ "పాపం, ఆమె ఎంత చిన్నబుచ్చుకున్నది!" అన్నది సానుభూతి చూపుతూన్న దానికి మల్లే.

"భార్యను పశువుతో పోల్చాడు. ఇతని భార్యే పశువైతే ఇతను పశుల కాపరిని మించిన వాడేమీ కాడు. ఈ హిందూ భూస్వాములు వీళ్ళ ఇండ్లలో పెళ్ళిళ్ళ సందర్భంలో డాన్సింగు పార్టీలకూ, బాణసంచాలకూ ఖర్చుపెట్టే డబ్బులో పదో వంతు కూడా ఆడపిల్లల చదువుకు పెట్టరు."

తన భర్త అనే మాటలను హిందూ దంపతులు వింటున్నారనీ, తృణీకారభావం వ్యక్తమయ్యే అతని ముఖభంగిమను గమనిస్తున్నారనీ గ్రహించిన ఎలైన్ "నో, ఊరుకో" అంది. "మనం వాళ్ళను గూర్చే చెప్పుకొని నవ్వుకుంటున్నామని అనుకుంటారు" అనికూడా హెచ్చరించింది.

ఎలైన్ ఎటో చూస్తూ తనకు వచ్చిన పోర్చుగీసు పాటను మెల్లగా ఆలాపిస్తూ వుంది. ఆమె భర్త జోవో ఆమెను అనుసరిస్తూ ఈల వేస్తున్నాడు.

అంతవరకూ విశాలమైన నదీముఖం గుండా ప్రయాణించిన లాంచీ ఇక ఇరుకు కయ్య గుండా పోతోంది. అస్తమిస్తూ వున్న సూర్యుని కిరణాలు చెట్ల శిఖరాగ్రాలకు బంగారు ములామా చేస్తున్నాయి. ఏ వైపు చూచినా ప్రకృతి సంధ్యాసమయ

ధూసరవర్ణాచ్ఛాదనతో దర్శనమిస్తూ వుంది. అటూ ఇటూ గట్లపై గుడిసెలున్నాయి. వాటి చుట్టూ కొబ్బరిచెట్లు గుంపుగా వున్నాయి. వాటి కావల చిన్నచిన్న పొలాలు మిట్ట పల్లాలతో వాలుగా గనిమెలలా వున్నాయి. నదీతీరపు పచ్చిక బయళ్ళపై మేసిన పశువులు ఇంటి ముఖం పట్టాయి. పక్షులు నదిపై వాలినట్లున్న కందిళ వృక్షములపై గల గూళ్ళ కెగిరి పోతున్నాయి. మృదులమైన సంధ్యాసమయ వాతావరణం మానవ హృదయాలను వశం చేసుకొంటూ మరీ మరీ ఆకర్షిస్తోంది. ఆదివారం సెలవు రోజు గడపడానికి ఈ ప్రయాణం చేస్తూ వున్న క్రైస్తవ దంపతులు జోవో, ఎలైన్ లిద్దరూ ఈ దృశ్యాలను కన్నార్పకుండా చూస్తున్నారు. కొంతసేపటికి ఎలైన్ లాలనగా తన రెండు చేతులనూ జోవో భుజంపై వుంచి వాటిపై గడ్డం ఆనించుకొని "మన ప్రియతమ దేశమంతటా వున్న ఈ నదీనదాలు దీని ప్రకృతి శోభకు ఎంతగా దోహదం చేస్తున్నాయి!" అంది.

"నువ్వు చెప్పింది కొంతవరకు నిజమే. అయితే నదీతీరాల సౌందర్యం సంగతి చెప్పుకోవాలంటే రాజధాని నగరమైన లిస్బన్‌కు గోవా సాటిరాదు. సాంత్రీన్, ఆలివ్ ఉద్యానవనాలు, అక్కడి గోధుమ, బార్లీ చేలు, తేజో నదీతీరం పొడవునా చక్కని పచ్చికతో కమలపండువుగా కన్పించే పచ్చికబయళ్ళు డౌరోనది సమీపమున గల ద్రాక్షతోటలు—వీటన్నిటి ముందు ఈ గోవా కొబ్బరి తోటలు దిగదుడుపే" అన్నాడు జోవో ఉద్రేకంతో.

"జోవో, అలా అంటే నేను ఒప్పుకోను. పోర్చుగల్‌ను నేను చూడకపోయినా నీ ఆల్బములలోని పోర్చుగీసు ప్రకృతి దృశ్యాల చిత్రాలను చూశాను కాబట్టి ఆ దేశ సౌందర్యం ఎటువంటిదో ఊహించుకోవడం కష్టమేమీ కాదు. అన్నిచెట్లలోకీ కొబ్బరిచెట్టు రాజు వంటిది. దాని నిరాడంబరత, దాని వైభవం ద్రాక్ష తోటలలో గోధుమ బార్లీ చేలలో ఎక్కడిది? నిత్యం చూస్తూ వుంటావు కాబట్టే కొబ్బరిచెట్టు అందం నీకు అల్పంగా వుంది."

"బలే బలే ఎలైన్! నీకూ ఈ గోవా అభిమానం సంకుచిత దృష్టి అలవడిందే! నీకు అంతేలే, వెర్రి గొర్రె ఆలోచనలు కూపస్థమండూకపు దృక్పథమూ! నీకూ ఆ గాలి తగిలింది. ఈ కొబ్బరి తోటలు దాటి నీ దృష్టి అవతలికి పోదు—అంతవరకే మీ లోకం, మీ దృష్టి, కాకపోతే దక్షిణయూరపులో అత్యంత సుందరమైన నదీతీర దృశ్యాలు గల ప్రాంతమగు పోర్చుగల్లు శోభను వరుసగా అయిదేండ్లపాటు నేత్రపర్వంగా చూచి పరవశ్యం చెందినవాడికి ఈ కొయ్యలలాంటి కొబ్బరిచెట్ల సౌందర్యం గూర్చి పొగుడుతూ చెప్పడం వెర్రికాక మరేమిటి? లిస్బన్‌నగరం శివారు సింత్రా ఎంత అందంగా వుంటుంది! ఎత్తైన కొండ ప్రదేశంలో వుంటది. ఆ కొండను చుట్టూరా క్రింది నుంచి పైవరకూ రోడ్లు వేశారు. ఆ రోడ్డు కిరు ప్రక్కలా దట్టంగా కమానుల వలె చెట్లు, పూలతోటలు ఎంత శోభాయమానంగా వుంటాయి! ఇంకా ఆ ప్రదేశంలో ఎన్ని కొలనులున్నాయి! వాటిలో హంసల వంటి బాతులు ఎంత వయ్యారంగా విహరిస్తూ వుంటాయి! అక్కడే 'పక్షుల ప్రోతుప్పి' వుంది. ఆ పేరుకూ దాని అందానికీ సరిపోయింది. దాని ప్రక్కనే ఏడు శతాబ్దాల క్రిందట సిద్ధింపబడే ఆఫ్రికా విజేతలు నిర్మించిన దివ్యసౌధాలున్నాయి. వాటి వైభవం చూస్తూ వుంటే వాటికి సంబంధించిన ప్రేమగాథలు జ్ఞప్తికి వస్తాయి. సింత్రా పేరు చెబితే చాలు, ఈ కళ్ళతో చూచిన పోర్చుగల్లు సౌందర్యమంతా మరొకమారు నా ముందు ప్రత్యక్ష మవుతుంది. ప్రకృతిదృశ్యం ప్రియుడైన బైరన్ మహాకవి సైతం యూరపు ఖండంలో సుందర ప్రదేశాల నన్నిటినీ చుట్టబెట్టి వచ్చిన తర్వాత సింత్రాను పేర్కొని అది భూలోక స్వర్గమని అన్నాడు. ఆ దివ్యభూమిలో ఇంకా ఎన్నెన్ని ప్రకృతి శోభలున్నాయో నీకేమి తెలుసు?"

ఎలైన్ జోవో చెక్కిళ్ళపై కన్పించిన మరకను తన జేబురుమాలుతో తుడిచివేయ ప్రయత్నిస్తూ "బైరన్ గోవా దర్శించి ఈ ప్రాంతాన్ని చూసి వుంటే, ముఖ్యంగా మా గ్రామం పోన్‌కాలీ చూచివుంటే ఆ భూలోకస్వర్గమన్న కితాబును నీ సింత్రాకు గాక మా గ్రామానికే ఇచ్చి వుండేవాడు" అంది పరిహాసంగా.

"బైరన్ కవిరాజు. ఆ మహాకవి అన్నదాన్ని కాదనే నువ్వు నమ్మవన్నమాట. నీ ఈ మూర్ఖత్వం చూస్తే ఆడవాళ్ళ వంటింటి కుందేళ్ళని ఎవరో అన్నమాట గుర్తుకొస్తోంది" అన్నాడు జోవో చిరాకుగా.

"కవులలో బైరన్‌కు గల ఉన్నత స్థానాన్ని నేను కాదనడం లేదు. ఆమధ్య నీతో నీటోరిన్ ఇంటికి వెళ్ళినప్పుడు అతను బైరన్ కావ్యఖండిక నుంచి కొన్నిపంక్తులు చదివి వినిపించారు. నన్ను అవి ఎంతగానో ఆకర్షించాయి. కొన్నిపంక్తులు కంఠస్థమయ్యాయి కూడా. పోర్చుగల్‌ను గూర్చి, ఆ దేశ ప్రజలను గూర్చి ఆ కవి అన్నమాటలతో మనం పూర్తిగా ఏకీభవించాలి" అంటూ ఎలైన్ సరళమైన పోర్చుగీసు భాషతో బైరన్ పద్య పంక్తులను చదువుతూ కొన్ని పదాలను అధిక్షేపపూర్వకంగా నొక్కి, పలికి కొంటెగా చిరునవ్వు విసిరి తన ధోరణి అతనికి అర్థమయ్యే విధంగా హావభావాలు చూపింది.

"చాలులే, ఆగు" అని అరుస్తూ జోవో కోపంతో ఆమెకు దూరంగా జరిగాడు. "బైరన్ వ్రాసిన ఆ మాటలన్నీ పచ్చి అబద్ధాలు. అతను వ్రాసినవి వాస్తవ విషయమే అయితే యూరపుఖండంలో చాల చిన్నదేశమైన పోర్చుగల్లు ప్రజలు కొన్ని శతాబ్దాల క్రిందటే నవీన నాగరికతా శకమును ఆరంభించిన గౌరవానికి నోచుకొనేవారా? వారి మహాసామ్రాజ్యాన్ని అంత బందర్భంతో పాలించగలిగే వారా? బైరన్ అన్యాయంగా నోరు పారవేసుకున్నాడు. పోర్చుగల్లును గూర్చి అతను అలా వెటకారంగా వ్రాయడానికి ఒక కారణముంది. అది చాలా మందికి తెలీదు. చెప్తా విను. బైరన్ ఎప్పుడూ రసికుడు. శృంగార పురుషుడు. తన శృంగార లీలా వినోదాలన్నీ యూరపు అంతటా తిరిగి అనుభవించాలని ఎప్పుడూ పెట్టుపడుతూ వుండేవాడు.

పోర్చుగల్లో ఎక్కడో ఏ యువతినో చూచి అలవి చిత్తం చరించి వుంటుంది. తన చిన్నది అనుగ్రహిస్తుందేమోనని తంటాలు పడివుంటాడు. కాని కుంటెటాలు వాళ్ళ ఏ పడుచు పిల్ల దగ్గరికి రానిస్తుంది? అందులోనూ పోర్చుగీసు పిల్ల! మా నెడ్డ ఆశాభంగం కలిగి ఆ కసి అంతా పోర్చుగీసు ప్రజను నిందించి తీర్చుకున్నాడు. ఈ వెర్రిమొర్రి అభిప్రాయాలన్నీ నీకు కలిగించిన ఆ నీ బంధువు విటోరినో వున్నాడే, వాడు వట్టి అడ్డగాడిద! తాను జాతీయవాది నయ్యానని గొంతు చించుకు చెబుతూ వున్నాడుగా ఈమధ్య. అలా తయారైనప్పటి నుంచీ అతగాడికి పోర్చుగీసు వారిపట్ల ద్వేషం ప్రబలింది. కేవలం గోవాలో విద్యావంతులైన క్రైస్తవు లందరికీ జాతీయవాదినని చాటు కోవడం చవకబారు ఫాషన్ అయిపోయింది.''

''అలా అపహాస్యం చేయకు ప్రియా, మా విటోరినో నిజమైన జాతీయవాది అయ్యాడు. పోయిన వారం ప్రభుత్వో ద్యోగంలో అతనికి ప్రమోషన్ వస్తే నృత్యవినోదం ఏర్పాటు చేసి అందులో ధోవతి, లంగుడ్డతో నాట్యశాలలోకి వచ్చి అతను అందరినీ కడుపుబ్బ నవ్వించలా? ఈమధ్య కూతురు పుడితే ఆ పిల్లకు శకుంతల అని పేరుపెట్టాడు. మరి అది హిందువులు పెట్టుకొనే పేరు కదా!'' అన్నది ఎలైన్ తన బంధువును వెనకేసుకొస్తూ.

జోవో విసురుగా ''ఈ కబుర్లన్నీ నాకు చెప్పకు. అతగాడి డిపార్టుమెంటుకు ఇప్పుడున్న సివిలియన్ అధిపతి లోక ముడిచి, పోర్చుగల్లో మంచి సైనికాధికారి హెడ్డుగా రావడం జరిగిన మరుక్షణమే అతని ఈ పోకడలన్నీ నిలిచిపోతాయి. వాడికి నీతి నిజాయితీ ఎక్కడిది? ఏ యెండ కాగొడుగు పడతాడు. అన్నీ ఎత్తులు. ధోవతి, తలపాగా వేషం వేస్తున్నాడా! పిల్లకు హిందువుల పేరు పెట్టాడా! సారా తాగి సైడు కాల్వలో దొర్లడం మానలేదే'' అన్నాడు.

అంతటితో అతను ఆవేశం తెచ్చుకుంటున్నాడనీ విటోరినోను మరీ దూషిస్తాడనీ ఎలైన్ గ్రహించి అతన్ని దువ్వాలన్న ఉద్దేశంతో ''పాపం, విటోరినో అంటే నువ్వు అలా విరుచుకు పడతావు? ఇండియా అంటే అతనికి అభిమానం. ఆ అభిమానాన్ని దాచుకోడు. బహిరంగంగా తన అభిప్రాయం చెబుతాడు. కాని నీకు నీ మాతృదేశమంటే అభిమానమే లేదు. పైగా పోర్చుగల్ అన్నా, ఆ దేశ ప్రజలన్నా ఎక్కడలేని ప్రేమాభిమానాలు! నీకు నచ్చేది ఏదీ ఇండియాలోనే లేనట్లుంది'' అంది, మెత్తగా చీవాట్లు పెడుతూ.

''చక్కని మాట అన్నావు. ఈ ఇండియాలోని ప్రతిదీ నాకు కంపరం కలిగిస్తుంది.'' అని అంటూ జోవో భార్య అంటించిన చురకకు సిగ్గుపడి, అంతలోనే తన మాటను సవరించు కోవాలని ''అయితే అందుకు ఒక్క మినహాయింపు వుంది. నాకు అమితంగా అభిమానప్రదమైనది ఇండియాలో ఒకటుంది. చాలా అమూల్యమైన వస్తువు'' అన్నాడు.

''ఏమిటది?'' ఎలైన్ కుతూహలంతో అడిగింది.

జోవో చుట్ట దమ్ము గట్టిగా లాగి మెల్లగా పొగ వదలుతూ ముఖమంతా చిరునవ్వుతో, ''ఆ వస్తువు నీవే'' అన్నాడు.

సిగ్గుతో ఎలైన్ చెంపలు జాజువారాయి. కొత్త పెళ్ళి కూతురిలా ముడుచుకుపోతూ ''అబ్బ, ఏమి ముఖస్తుతి!'' అంటూ చేతిలో వున్న వన్నెల విసనకర్రతో చిలిపిగా జోవో ముక్కును తట్టింది.

వారిద్దరి మధ్య వచ్చిన మాటల పేచీ ఈ విధంగా పరిష్కారం కావడంతో ఇద్దరూ కాస్త ప్రణయచాతుర్యంలో పడటానికి ఆస్కారం కలిగింది.

జోవో చుట్ట అవతల పారేసి ఎలైన్‌కు దగ్గరగా జరిగి కూర్చున్నాడు. మృదువైన ఆమె చేతివ్రేళ్ళను తన వ్రేళ్ళతో మెలి పెడుతూ ఆమె భుజం మీదికి వంగి చిరునవ్వు చిందే ఆమె ముఖాన్ని పరిశీలనగా కొంతసేపు చూచి ''ఎలైన్, మనం మెన్‌జే ఇంట్లో మొట్టమొదటి సారి కలుసుకున్నప్పుడు నీతో కలిసి (waltz) వాల్ట్జ్ నృత్యం చేస్తూ నీ చెవిలో ఏమి చెప్పానో నీకు జ్ఞాపకముందా?'' అన్నాడు.

జోవో భార్యతో ఇలా సరస గోష్ఠి ఆరంభించిన మరుక్షణమే భూతేబాబు పిల్లలిద్దరూ ఏడ్పుకు లంకించుకున్నారు. వాళ్ళ గోలతో వీరి సరస గోష్ఠికి అంతరాయం కలిగింది. ఒక మాట చెప్పేందుకూ వీలులేదు వినేందుకూ వీలులేదు. పాపం జోవో ముఖంలో ఆనందమంతా అంతరించింది. నొసలు చిట్లించుకున్నాడు. ఎలైన్‌కు కొంచెం దూరంగా జరిగి తన స్థానంలో నిక్కి కూర్చొని ''మనకీ హైందవ ప్రయాణీకులు జతపడటం ఎంత న్యూసెన్స్!'' అని తనలో తాను గొణుగు కున్నాడు.

భూతేబాబు క్రింది నుంచి కామ్యూను కేకేసి ఉమీని వాడి కిచ్చాడు. వాడా బిడ్డను లాంచీ పైతట్టు కటకటాల వద్దకు ఆడించడానికి తీసుకెళ్ళాడు. ఉమీ ఏడ్పు ఆగింది. కాని సీతాబాయి తన చేతులో వున్న పసిపాపను సముదాయించలేక పోయింది. గంటసేపటి నుంచీ ఆ పసిది అడపాదడపా ఏడుస్తూ వుంది. ఏడ్పు మరీ ఎక్కువైంది. పాప ఎందుకు ఏడుస్తున్నదో సీతాబాయికి బాగా తెలుసు. అందులోనూ ఆహారం లభించనప్పుడు పసిపిల్లలు ప్రయోగించే భాషను తల్లులు ఇట్టే అర్థం చేసుకోగలరు. కాని కులీన హైందవ కుటుంబానికి చెందిన ఆవిడ చుట్టూ మగవాళ్ళున్న కారణంగా బిడ్డకు స్తన్యం ఇవ్వలేక పోయింది. తమ భార్యలను వంటింటి నాలుగుగోడల మధ్య మాత్రమే తిరగనిచ్చి తద్వారా వారిని రక్షించుకొనజూచే హైందవ సమాజానికి చెందిన స్త్రీ సీతాబాయి! పాప ఆకలి సంగతి తనకు అనుభూతి కలుగుతున్నప్పటికీ బిడ్డను రొమ్ము కానించుకోలేక పోయింది.

కావాలంటే అక్కడే ఒకమూలకెళ్ళి చన్ను గుడపవచ్చు. కాని నవనాగరికులైన ప్రయాణీకుల మధ్య నుంచి దారి చేసుకు వెళ్ళేందుకు ఆమె సాహసించలేకపోయింది.

చివరకు మాతృ హృదయం జయించింది. పాప యేడ్పు మరీ భరించరానిదయ్యే టప్పటికి హైందవ స్త్రీ సహజమైన సిగ్గు విడియాలను త్రోసిరాజని, ఒక్క ఉదుటున తన కుర్చీని మగవాళ్ళు లేని వైపుకు తిప్పుకొని పాప నోటికి స్తన్య మందించింది. అయినా ఆ కాస్త దానికే ఆవిడ అభిమానం దెబ్బతిన్న దేమో ముఖం ఎర్రబారింది. నుదిటిపై చెమట చుక్కలు తేలాయి.

పాపకు పాలివ్వాలనే సాకుతో ఇతర ప్రయాణీకులకు ముఖం చూపకుండా అటుతిరిగి కూర్చోవడం వారిని అగౌరవపరచడమే. అందులోనూ జోన్ పాశ్చాత్య మర్యాదలు పాటించే వాడు. ఇలాంటి మర్యాదలు, మన్ననల విషయంలో అతగాడికి పట్టింపు జాస్తి. అతని సూత్రాల ప్రకారం తానెంత అమర్యాదకరమైన పని చేసిందీ సీతాబాయి ఎన్నటికీ గ్రహించలేదు. అక్కడ అలా వీపు పెట్టి కూర్చోవడంకన్న లేచి మరొక తావుకు వెళ్ళి వుంటే బాగుండేది.

ఏమైనా జోన్‌కు ఈ హైందవ కుటుంబం వ్యవహారం బొత్తిగా నచ్చలేదు. మనఃక్లేశం కూడా కలిగించింది. అసలు వాళ్ళు లాంచీ పైకి రావడమే తిక్కిరిబిక్కిరిగా రావడం, ఇరుగు పొరుగు మర్యాద పాటించకుండా నాగరికత లేనివిధంగా మాట్లాడుకోవడం, వాళ్ళ పిల్లలు చేసే గందరగోళం, ఇప్పుడు ఇల తృణీకారం చూపడం— ఇవన్నీ అతగాడికి బాధ కలిగించాయి.

"ఆహ్, చూచావా ఆ భారతీయ మర్యాదకు మచ్చుతునకను! వంటి నిండా బంగారం దిగేసుకున్న ఆ భామామణి కొంచెం సభ్యత అయినా లేకుండా మనకేసి వీపు పెట్టి కూర్చొంది. ఇలాంటి అఘాయిత్యం పోర్చుగల్లులోనైతే జరుగుతుందా!" అంటూ జోన్ ఆశ్చర్యార్థకాలతో తన ఆవేదన వెళ్ళబుచ్చుకొని భూతేబాబు కేసి సీతాబాయి కేసి కోపంగా చూచి భారతదేశాన్ని గూర్చి, హైందవ సంఘాన్ని గూర్చి ఆధిక్షేప ధోరణిలో ఏవేవో పేలుతున్నాడు.

దూరంగా కటకటాల దగ్గిర ఉసిని ఆడిస్తూ వున్న కామ్నా జోన్ మాటిమాటికీ సీతాబాయి కేసి చూస్తూ వాగుతూ వున్న తీరును గమనించి అతను తన యజమానురాలిని అవమానపరుస్తున్నాడని వెంటనే గ్రహించాడు. భూతేబాబు కూడా ఈ పింత వ్యక్తి ధోరణిని అర్థం చేసుకున్నాడు. కాని మెదలకుండా వుండటమే మంచిదని అనుకున్నాడు. కాని కామ్నా ఇదంతా చూస్తూ వూరుకోలేకపోయ్యాడు. వాడికి భయభక్తులు లేనివి కాదు. వున్నాయి. కాని నవనాగరికత ఆపాదించే హద్దులు ఆటంకాలు అతనికి లేవు. అవి వున్నవాడు ఆత్మగౌరవాన్ని కూడా కాదని కొన్నిసందర్భాలలో నోరు మూసుకు పడుంటాడు. కామ్నాకు చదువు సంధ్యలు లేవు. సభ్యత తెచ్చిపెట్టే మొగమాటాలు లేవు. కాబట్టే చెప్పుతో కొట్టినట్లు "ఏయ్, ఏమిటి సంగతి? ఆడవాళ్ళను గూర్చి దురుసుగా మాట్లాడుతున్నావ్? నువ్వు చదివిన చదువు ఇందుకేనా ఉపయోగపడేది?" అని జోన్ మొహానే అనేశాడు.

సరిగా ఈ అవకాశం కోసమే జోన్ కాచుకు కూర్చున్నాడు.

"ఏమిటిరా దున్నపోతా పేలాప్?" అంటూ పెదాలు కొరుక్కుంటూ కామ్నా మీదికి లంఘించి వాణ్ణి బాదడం మొదలెట్టాడు. అంతటితో ఆగక, అప్పుడే లేచి కామ్నా తరఫున క్షమాపణ చెప్పుకోవచ్చిన భూతేబాబు ముఖంపై ఒక్క పెట్టు పెట్టి పట్టరాని కోపంతో నీచంగా మాట్లాడుతూ "జాగ్రత్త! ఇకనుంచి నీ అడవిమృగాలను ఇంట్లోనే కట్టేసిరా. నాగరికులలోకి తీసుకురాకు" అని చేతులు దులుపుకు కూర్చున్నాడు.

"పైన దేవుడున్నాడు. నిష్కారణంగా ఇవాళ నువ్వు నన్ను కొట్టిన దెబ్బలకు నీకు ఎట్టి ప్రతిఫలం ఇవ్వాల్సిందీ ఆ దేవుడే నిర్ణయిస్తాడు" అంటూ కామ్నా, జోన్‌ను హెచ్చరిస్తూ తనకు కలిగిన పరాభవానికి ఉద్రిక్తుడయ్యాడు.

కాని ఆశ్చర్యపడవలసిన సంగతి ఏమిటంటే ఇంత జరిగినా కామ్నా యజమాని అయిన భూతేబాబు పోర్చుగీసు భాషలో ఇంకా క్షమాపణలు చెప్పుకొంటూనే వున్నాడు.

దీనికంతటికీ తానే బాధ్యురాలని అనుకొంటూ సీతాబాయి దించిన తలఎత్తక కన్నీరు పెట్టుకుంది.

చూస్తూ వుండగానే పరిస్థితి చేయి జారిపోయినందుకు ఎలైన్ కూడా బాధపడి, చెమ్మగిల్లిన నయనాలను నదికేసి తిప్పుకొని ఎటో చూచింది.

## 2

"భూటూ.....!"

ఈ పిలుపు వినేసరికి పల్లకీ ఎత్తవలసిన బోయీలు, ఆ పల్లకీలో కూర్చోబోయ్యే భూతేబాబు ఒక్కసారిగా ఉలిక్కిపడి సావధానులై నిల్చున్నారు. పిలిచింది భూతేబాబు తండ్రి జీలూ బాబు.

భూతేబాబు ముఖం కందగడ్డలా అయింది. ఈ రోజు తండ్రి అతనికి చాలా పెద్ద బాధ్యత అప్పగించాడు. అందుకే మనిషి బెంగ పెట్టుకొన్న వాడికి మల్లే వున్నాడు.

కాన్సెల్‌హో ఆఫీసుకి వెళ్ళి అక్కడ తన ముఖ్యమైన ఒక వ్యవహారాన్ని చక్కదిద్ది రావలసిందిగా జీలాబాబు భూతేబాబును కోరాడు. ఈ మధ్యాహ్నమే వెళ్ళాలి. ఆ ఆఫీసు వీరి గ్రామానికి రెండు మైళ్ళ దూరంలో వుంది. ప్రయాణ సన్నాహం తెల్లవారు జామునుంచే జరుగుతూ వుంది. ఎట్టకేలకు మిట్ట మధ్యాహ్నమయ్యేసరికి ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు పూర్తి అయినవి. అరడజను మంది బోయీలు పల్లకీతో ద్వారం వద్ద సిద్ధంగా వున్నారు.

కొద్ది సేపట్లో జీలూబాబు తన ధివంతి తిన్నె మీది నుంచి దిగి పల్లకీ దగ్గరికి వచ్చాడు. ఆనాడు భూతేబాబు పడవ ప్రయాణం చేసి ఇంటికి తిరిగివచ్చిన నాటినుంచి ఈ రోజు

వరకూ ప్రతిరోజూ పొద్దస్తమానం వ్యవహారం విషయమై చర్చలు జరిగినప్పటికీ ముఖ్యమైన కార్యం గనుక అప్రమత్తంతోనే తన కుమారునికి చివరిక్షణంలో కూడా కొన్నిమాటలు చెప్పి తగు సూచనలు చేయడం అవసరమని తండ్రి భావించాడు.

''భూతూ, ఇవాళ నువ్వు వెళ్ళి ఆ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌తో మాట్లాడి ఆయనకూ మనకూ మధ్య మంచి స్నేహం సంపాదించగలిగావా అది మన పాలిట వరప్రసాదమవుతుంది. ఇప్పుడు మనం మన దాయాదులతో వ్యాజ్యమాడుతున్నామన్న సంగతి నీకు తెలుసుగా. చూడు, బాగా విను. పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను కలవడంతోనే మొదట ఆయన తండ్రి గారికీ మన కుటుంబానికీ మధ్య కొన్ని సంవత్సరాల క్రితం ఏర్పడ్డ స్నేహాన్ని ఆప్యాయతనూ గుర్తుకు తేవాలి. గుర్తుకు తేవడమే కాదు, ఆయన మనస్సుకు బాగా నాటుకొనేట్లు వెనకటి సంగతులన్నీ చెప్పాలి.''

కాని భూతేబాబు అంటూ ''పబ్లిక్ ప్రాసిక్యూటర్ పెద్ద అధికారి కదా. క్షణం తీరిక లేకుండా ఏవో వ్యవహారాలలో వుంటాడు. సవిస్తరంగా నేను చెప్పవచ్చా? బాల్యం నాటి సంగతులు ఆయన కింకా జ్ఞాపకమున్నాయా?'' అన్నాడు.

జీలూబాబు కోపోద్రిక్తుడై ''ఏమిటిరా నీ అర్థంలేని వాగుడు! వెనకటి సంగతులే జ్ఞాపకముండవ?'' అని కసిరాడు.

''అదికాదు నాన్నా. ప్రాసిక్యూటర్ తండ్రి రాబర్ట్స్ ఆండ్రేడ్ ఊరి బయట పొలంలో వున్న మన పాత ఇంట్లో పదకొండేండ్లు అద్దె లేకుండా వున్నాడు కదా. ఆ రోజులలో ఆయన మైనపు వత్తులు చేసి జీవనోపాధి సంపాదించుకొనేవాడు కదా. అంతకుమించి చిల్లిగవ్వ ఆస్తి కూడా అప్పుడు వాళ్ళకు లేదు. పైగా అడపాదడపా మన నుంచి ఏదో సహాయం పొందుతూ వుండేవాళ్ళు. ఆ తర్వాత పంజిం (పనజీ) లో స్థిరనివాసమేర్పరచుకొని బాగుపడి పైకి వచ్చారు. కాకపోతే ఒకటి మాత్రం చెప్పాలి. ఆ ముసలాయన ఉత్తముడు. మంచి హృదయం కలవాడు. అదృష్టదేవత ఆయన్ని అనుగ్రహించిన తర్వాత మన ఋణం కొంతైనా తీర్చుకొనే ఉద్దేశంతో కొన్ని ఉపకారాలు చేశాడు. ఆయన ఈనాడు బ్రతికి వుంటే కొడుకు అంతపైకి వచ్చి కుటుంబానికి అంత పేరుప్రతిష్ఠలు తేవడం చూసి ఎంతగా ఆనందించేవాడో! మైనపు వత్తులు అమ్మి జీవించిన ఒక వ్యక్తి కొడుకు లిస్బన్ వెళ్ళి అక్కడ బ్యారిస్టరీ చదివి స్వదేశానికి తిరిగి వచ్చి న్యాయశాఖలో అంతపెద్ద పదవి—ప్రభుత్వ న్యాయవాది ఉద్యోగం పొందగలిగాడంటే నిజంగా అద్భుత విషయమే కదా! అయినా, ఈ లిస్బన్ చదువులు చదివి తిరిగివచ్చిన క్రైస్తవులు ఏమి మనుష్యులులే!'' అంటూ భూతేబాబు తన అసలు అభిప్రాయం చెప్పబోయాడు.

''భూతూ! ఆగు, ఆగు. నువ్వేమి చెప్పాలనుకుంటున్నావో నాకు తెలుసు. అది నిజమే. ఆ తరగతి మనుష్యులలో ఈ రోజులలో ఎక్కడలేని గర్వం, మిడిసిపాటు, డాబు, దర్పం కన్పిస్తూ వున్న మాట వాస్తవమే. ఇది తమ మాతృదేశమన్న విషయం వాళ్ళు విస్మరిస్తున్నారు. యూరోపియనులను అనుకరించడం గర్వ కారణంగా భావిస్తున్నారు. వేషభాషలలో, ఆహార విహారాలలో యూరపియనులంటే మించిపోతున్నట్లు ప్రవర్తిస్తున్నారు. కాని యూరోపియనులలో చాలమందిలో వుండే కొన్ని గొప్ప గుణవిశేషాలు వీరిలో శూన్యం. అది అంతా నిజమే. ఆ విషయం అలా వుంచు. అది ఎవరి మాటో. ఈ పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాత్రం అలా ప్రవర్తించడని నా అంతరాత్మ చెబుతూ వుంది. నువ్వు చేయవలసిందల్లా ఏమిటే అంటే నీ తెలివితేటలు చూపి, ఆయనతో వినయంగా గౌరవంగా మాట్లాడి మన పాత స్నేహ సంబంధాన్ని పునరుద్ధరించాలి. ఇది కష్టమైన పనేమీ కాదు. పైగా నువ్వు అతని వద్దకు వట్టి చేతులతో వెళ్ళడం లేదు. ఇదిగో, చక్కని కానుక తీసుకెడుతున్నావు'' అంటూ కామ్బ్లా చేతిలో వున్న పెద్ద పండ్లబుట్ట కేసి చూపించాడు.

''కాని పోయిన సంవత్సరం ఇదే ఇప్పుడూ జరిగితే ఏమిటి చేయడం? నువ్వు చెప్పిన ప్రకారం ఇలాంటి కానుకే తీసుకొని ఆ జడ్జికి బహూకరిద్దామని వెళ్ళాను. ఆయన నా పేమిరా తీసుకోనని తిప్పి పంపాడు.''

''భూతూ, అందుకేరా నీకు లోకజ్ఞానం సున్న అని నేను అఘోరించేది'' అంటూ జీలూబాబు కొడుకు ధోరణిని అరికట్టాడు. ''ఆ జడ్జి యూరోపియను. యూరోపియనులలో మాత్రమే అలాంటివి జరుగుతాయి. దేశవాళీ ఆఫీసరు మంచి కానుకను తీసుకోకుండా తిప్పిపంపాడన్న మాట ఎప్పుడైనా విన్నావా?'' అని కూడా ప్రశ్న వేశాడు.

భూతేబాబు తండ్రి ప్రశ్నకు జవాబు చెప్పకుండా ''ఆ, నువ్వు అంతే అంటావులే. పైగా ఆ యూరోపియను జడ్జి ఏం పని మీద వచ్చావని అడిగాడు. ఏమీలేదు, వూరికే చూడటానికి వచ్చానంటే పని లేకుండా ఎందుకొచ్చావని కోపపడ్డాడు'' అని వెనకటి సంగతి గుర్తుకు తెచ్చాడు.

''నీకా మాత్రం తెలివి లేకపోయిందా? ఏదో ఒక సాకు చెప్పలేకపోయావా? ప్రాసిక్యూటరే గనుక అలాంటి ప్రశ్న వేస్తే వారం క్రితం జరిగిన లాంటి సంఘటన చక్కని సాకుగా ఉపకరిస్తుంది. మనం పెద్ద ఫాయాకు చెందిన సంపన్న కుటుంబీకులమని చెప్పి, కేసుపెట్టి ఆ దుష్టుడికి తగు గుణపాఠం చెప్పదలచుకున్నామని అంటే సరిపోయె? మరీ గుచ్చి అడిగితే కేసు ఎలా వుండాలో సలహా చెప్పండంటే పోయె. నిజంగా కేసు పెడుతున్నామని అనుకునేవు. ఇప్పటికే దాయాదులపై వ్యాజ్యంతో మునగానాం తేలావాంగా వున్నాము. వాళ్ళు పొలం ఆక్రమించుకు కూర్చున్నారు.''

ఈ మాటలతో జీలూబాబు తన కుమారునికి చెప్పవలసిన హితోపదేశమంతా పూర్తిచేసి ''ఊఁ—ఇక కదలండి!'' అని పల్లకీ బోయీలను ఆజ్ఞాపించాడు.

పల్లకీ ముందుకు సాగిందో లేదో జీలూబాబు దృష్టి నెత్తిన పెద్దబుట్టతో పల్లకీ వెంటపడి పరుగెత్తుతూ వున్న

కామ్నాపై ప్రసరించింది. ఆగ్రహోదగ్రుడై "ఒరే కామ్నా, నీ నోటి దురుసుతనం వల్లనే ఆ రోజు లాంచీలో అప్రతిష్ఠాకరమైన సంఘటన జరిగింది. నువ్వు వట్టి మంద బుద్ధివి. దేవుడు నీకు పెద్ద నోరిచ్చాడుకాని మెదడు ఇవ్వలేదు. కాబట్టే నీకు నోటిని దేని కుపయోగించుకోవాలో చెప్తే తెలియదు. అయినా నీ కులమే అటువంటిది. కుమ్మరి వాములో ఇత్తడి పెంకు లెలా దొరుకుతాయి? ఇకముందెన్నడైనా అలా నోరు పారేసుకున్నావా— ఆరోజే నిన్ను నీ తాత ఇంటికి సాగనంపుతాను. బాగా జ్ఞాపకం పెట్టుకో" అని హెచ్చరించాడు.

పాపం అంతవరకూ చిన్న యజమాని వెంట బస్తీకి వెడుతున్నానన్న సంబరంలో వున్న కామ్నాకు ఈ చీవాట్లతో ముఖం కందగడ్డలా వాచింది. బరువైన పండ్లబుట్ట నెత్తిపై వుండి కూడా నిటారుగా నిల్చొని వున్నవాడు ఈ చురకలతో అవమానంతో క్రుంగిపోయాడు.

## 3

ఒకగంట సేపట్లో పల్లకి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గారి బంగళా గేటు ముందుకు వెళ్ళింది. భూతేబాబు పల్లకీ దిగి, కాలర్ సవరించుకొని, షర్టు చేతులు సాగదీసి, జేబులో వున్న రుమాలు కొసనూ వాచీ బంగారు గొలుసునూ ఎదుటివారికి కన్పించేట్లు కొంచెం పైకి లాగి, వెండి పిడి బాగా కన్పించేలా చేతికర్ర పట్టుకొని, తనకు సాధ్యమైనంత హుందాగా బంగళా గేటు గుండా లోపలికి నడిచాడు. అతని వెనకే కామ్నా కూడా వచ్చాడు. తోట దాటి బంగళా ద్వారం సమీపించేసరికి గిటార్ వాద్యంతో పాడబడుతూ వున్న పోర్చుగీసు పాట వినిపించింది. ఒకటిరెండు మార్లు సంగీతం ఆపడంతో లోపలి నవ్వులు, వికవికలు, పకపకలు విన్పించాయి. లోపల స్త్రీపురుషులున్నట్లు వాటివల్ల తెలుస్తూనే వుంది. దీనితో సమయోచిత బుద్ధి లేనివాడయ్యాడు భూతేబాబు! తలుపు తట్టే సాహసం లేకపోయింది. భయంభయంగా బైట అక్కడే నిల్చున్నాడు. సరిగా అప్పుడే అలా వెడుతూ వున్న నౌకరు భూతేబాబును చూచి వెంటనే తిరిగి లోపలికి వెళ్ళి ఒక హిందూ మనిషి వచ్చి బైట వేచి వున్నాడని తన యజమానితో మనవి చేశాడు. హిందువే కదా అతన్ని లోపలికి రమ్మని చెప్పేదేమిటని ప్రాసిక్యూటర్ ఉపేక్షించాడు.

కొంతసేపటికి ప్రాసిక్యూటర్ "ఎవరదీ?" అని కేక పెట్టాడు లోపలి నుంచే.

డ్రాయింగ్ రూము దర్వాజాకు చక్కని డిజైను గల తెర వేలాడుతూ వుంది. లోపలి వెళ్ళాలంటే అది అడ్డం. దాన్ని తొలగించి చూచే ధైర్యం చాలక భూతేబాబు బైట నిల్చొనే తడబడుతున్న కంఠంతో "నేనండీ. జీలూబాబు కుమారుణ్ణి. మీ దర్శనం చేసుకొని మా కుటుంబం వారి గౌరవాభివందనములు సమర్పించుకుందామని వచ్చాను" అన్నాడు.

"జీలూబాబా? సృష్టిలో ఏ ప్రాణి పేరది? ఎన్నడూ అలాంటి పేరు నేను వినలేదే" అన్నాడు ప్రాసిక్యూటర్ వెటకారంగా.

"అవునండీ, జీలూబాబు సరయుంకర్ అని అంటారు. మీకు జ్ఞాపకముండే వుంటుంది. మావూరు సరయు. వెనక మీ కుటుంబం వారు మా గ్రామంలో వుండేవారు. మీ నాన్నగారు, మా నాన్న ఇద్దరూ మంచి స్నేహితులు. మీరూ నేనూ ఒకే వీధి బళ్లో చదువుకున్నాము చిన్నప్పుడు." ఇలా నట్టుతూ అన్నాడేకాని తాను చెప్పదలచుకున్నది సరిగా చెప్పగలిగాడా లేదా అన్నది భూతేబాబుకు అనుమానంగానే వుంది. మాటలు సరిగా పెగిలి రాలేదని లోపల బాధపడ్డాడు.

"వీధి బడా? వెధవది. చరిత్రకు పూర్వం నాటి కథ చెబుతున్నట్లున్నావే. అది దంపతులు ఆదాము, ఈవు నాటి కథకాదు గదా! నీ కుటుంబానికీ, మా కుటుంబానికీ మధ్యగల స్నేహసంబంధాన్ని పరిశోధించి తేల్చే పనిని ఒక ప్రసిద్ధ చరిత్రకారునికి అప్పగించాలి. సరే, నీవన్నట్లు జీలూబాబు మా తండ్రిగారికి నిజంగా స్నేహితుడే అనుకుందాము. అయితే ఏం కావాలి?"

ప్రాసిక్యూటర్ ఈ సమాధానం చెప్పడంతో భూతేబాబు నోరు పిడచకట్టుకు పోయింది. బదులు చెప్పడానికి వెంటనే నోరు పెగలలేదు. అతికష్టం మీద "ఏమీ అక్కర్లేదండీ. మీరింత పెద్ద పదవిలో నియమింపబడ్డారని తెలిసి మానాన్నకు పరమానందం కలిగింది. స్వయంగా వెళ్లి మిమ్మల్ని అభినందించమని చెప్పి నన్ను పంపాడు.' అన్నాడు.

"ఓ, అభినందనలా! చాలా కృతజ్ఞతలు."

"మీకో చిన్న కానుక కూడా తెచ్చాను."

"కానుకా? మీ హిందువుల వద్ద నుంచి కానుకలు పుచ్చుకోవడం ప్రమాదంతో కూడుకున్న పని. పెద్ద అధికార్లకు ఏదో కాన్క ఇచ్చి అదే లంచంగా ఇచ్చినట్లు మీరు భావిస్తారు. అలా మేము అనుకోవాలని లోపల మీ అభిలాష. కాబట్టి నీ కాన్కను స్వీకరించడం నాకు సమ్మతంకాదు. అయితే తెచ్చిన కాన్కను తిరగకొట్టడం అమర్యాదకరమైన పని. సరే, ఏం తెచ్చావో చెప్పు."

"మేందోరీ అరటిపళ్ళూ, మాన్‌కురాడో—అల్ఫాన్సో మామిడిపళ్ళూ తెచ్చానండీ."

"ఏమిటీ, వెధవ అరటి పళ్ళూ మామిడి పళ్ళూనా! అవా నాకు కాన్కలు! తినితిని నోరు చెడింది. అల్ఫాన్సో మామిడి పళ్లు తిని మా నౌకర్లకు కూడా మొహం మొత్తిపోయింది. కనీసం ఫెర్నాండిసో రకమైనా అయితే ఏదో కొంత మార్పులే అని సరిపెట్టుకొనే వాళ్ళం."

అతను అలా అన్నప్పటికీ లోపలి నుంచి ఒక నౌకరు వచ్చి భూతేబాబు తెచ్చిన పండ్ల బుట్టను స్వాధీనపరచుకొని వసారాలో ఒకమూల పోశాడు.

"మరింకేమైనా పని వుందా?" అని ప్రాసిక్యూటర్‌గారి ప్రశ్న.

తను ఈ భేటీ మంచి మలుపులో పడుతున్నదని భ్రమించిన భూతేబాబు "లేదు, అంత పెద్ద విషయమేమీ కాదులెండి. మీరు ఏమీ అనుకోకపోతే చాలా స్వల్ప విషయం. వారం రోజుల క్రితం నేను పాంజిమ్ వెళ్ళాల్సి వచ్చింది. అక్కడ రెండుమూడు రోజులుండి లాంచీలో మా గ్రామం తిరిగి వెడుతున్నాను..."

"ఊఁ, త్వరగా కానీ. అసలు సంగతి చెప్పు. చేట భారతం వినడానికి నాకు టైము లేదు."

"మన్నించాలండీ. అదంతా ఇట్లా జరిగింది" అంటూ భూతేబాబు లాంచీ సంఘటనను సాధ్యమైనంత సంగ్రహంగా చెప్పుకుపోయి "ఆ క్రైస్తవ ప్రయాణికునిపై కేసు పెట్టాలనుకున్నాను. అతను పెద్ద అధికారిలా వున్నాడు. ఈ విషయంలో మీ అమూల్యమైన సలహా తీసుకుందామని వచ్చాను" అన్నాడు.

ఇందుకు వెంటనే సమాధానం రావడం పోయి లోపల ప్రాసిక్యూటర్ గారూ, ఆయన భార్యామణి గారూ హడావిడిగా గుసగుస లాడుకోవడం భూతేబాబుకు వినిపించింది.

కొంతసేపటికి ప్రాసిక్యూటర్‌గారు వేళాకోళంగా తిరస్కార భావంతో బిగ్గరగా నవ్వి "ఆ క్రైస్తవునిపై ఫిర్యాదు దాఖలు చేయాలనుకుంటున్నావా? ఎంత పరిహాసాస్పదమైన పని! మీ హిందువులకు ఈ ఆత్మగౌరవం ఎప్పటి నుంచి అబ్బింది? నిజంగానా? లేకపోతే పైడాజేనా? కొన్ని తరాల నుంచీ క్రైస్తవ అధికార్ల వల్ల మీరు రోజూ ఇలాంటి అవమానాలు పొందుతున్నారే! ఇవాళ ఇది కొత్తా? కాబట్టి వెర్రి మా లోకవా, మీ పాత సంప్రదాయాన్ననుసరించి నోరు మూసుకొని పడుండు. నేను చెప్పదగ్గ ఉత్తమమైన సలహా అదే. ఇక వెళ్ళు. నా కివతల చాలా పనివుంది" అని ముగించాడు.

ఈ భేటీ జరిగినంతసేపూ పాపం భూతేబాబు డ్రాయింగ్ రూము బయట నిల్చునే వున్నాడు. ఇక భేటీ ముగిసిందని గ్రహించాడు. తండ్రితో ఏమి చెప్పాలబ్బా అనుకున్నాడు. "వచ్చిన వాణ్ణి నన్ను లోపలికి వచ్చి కూర్చోమని కూడా అనలేదే! జరిగిన మర్యాద చూస్తే ఇలా వుంది!"

ఏమీ పాలుపోక భూతేబాబు సిగరెట్ తీసి ముట్టించి మెల్లగా వచ్చిన దారిపట్టాడు.

ఖాళీ బుట్ట తీసుకొని కామ్నా తన యజమాని ననుసరించాడు. వెడుతూ వాడు వెనక్కు తిరిగి ప్రాసిక్యూటర్‌గారి అందమైన బంగళాను మరోక మారు కలయజూచాడు. అసహనంగా "వెధవ ప్రాసిక్యూటర్! చూశారా బాబూ, వాడే వీడు!" అని అరిచాడు. ఈ అరుపు భూతేబాబుకు ఏదో పీడకలను స్ఫురణకు తెచ్చింది.

అతను నడుస్తున్న వాడల్లా తటాలున ఆగి బెదురుగా కామ్నా వంక చూచాడు.

కామ్నా చూపు డ్రాయింగ్ రూము కిటికీపై కేంద్రీకరించి వుంది. సరిగ్గా వాడు చూస్తూ వున్న వంకే భూతేబాబు కూడా ఆసక్తితో చూచాడు. అక్కడ ప్రాసిక్యూటరు, ఆయన భార్య నిల్చొని వున్నారు. ప్రాసిక్యూటర్ విజయగర్వంతో ఛాతీ విరుచుకొని నిలబడి వున్నాడు. ఆయన భార్య భూతేబాబు కేసి జాలిగా చూస్తూ వుంది.

కామ్నా పట్టరాని కోపంతో పెదిమలు కొరుక్కుంటూ ప్రాసిక్యూటర్‌ను తిట్టిపోశాడు. "అవును బాబూ, ఈ వెధవ వాడే. చూశారా ఎట్లా నవ్వుతున్నాడో! వీడి నాలుక కొయ్య! వీడే ఆనాడు అపభ్రంశపు మాటలతో అమ్మగారిని లాంచీపై నలుగురిలో అవమానపరిచాడు. హరిశ్చంద్ర మహారాజులాంటి నా యజమానిపై చెయ్యి చేసుకున్నాడు. ఇంతకీ రాసిపెట్టి వుంటే తప్పుతుందా? ఈ దుర్మార్గుడికి కానుక ఇవ్వడానికా వూరునించి అంత బరువైన పండ్ల గంప మోసుకొచ్చాను! నా బుద్ధి గడ్డితిని ఈ ప్రయాణానికి సమకట్టే ముందు దేవుడు నా కాళ్ళయినా విరగ్గొట్టాడు కాదు!"

(అనువాదం : డి. రామలింగం)



# జయంతి తే....

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

జైను—

ఆ సూక్తి జ్ఞాపకం రాకుండా ఎట్లా ఉంటుంది! అంతటి మహాకవి మళ్ళా ఈ గడ్డమీద పుట్టలేదాయెను. ఇంతలో ఆవిర్భవిస్తాడనే ఆశ కూడా లేదాయిరి. ఏ మంచి కవి కయినా అన్వయించవలసిన ఆ మాట ఆ మహానుభావుని తలపెట్టగానే ఎందుకు ప్రత్యక్షం కాదు?

.......................... సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః।
నాస్తి యేషాం యశఃకాయే
జరామరణజం భయమ్॥.

'సుకృతాత్ములు రసయోగులు అయిన కవీశ్వరులకు జయము. వారి విశుద్ధమయిన యశశ్శరీరానికి ముసలితనం రాదు. మృత్యువు లేదు.'

వైద్యశాస్త్రరీత్యాకూడా రసయోగసిద్ధులకు జరామరణభయం లేదని ప్రతీతి.

'కాళిదాస జయంతి'

అనగానే అందరి జయంతిసదంతో ఈ సత్యం స్ఫురణకు వస్తుంది.

ఈభారతదేశపునదుల్లో, కొండల్లో, ఆకాశంలో ఆయన లీనమై ఉండి వాటిపైనుంచి వచ్చే ప్రతివాయు స్పర్శతోను మనలను తాకుతున్నాడేమో అనిపిస్తుంది.

ఆయనరచనలు ఏవో కొన్ని యేండ్ల కిందట పత్రపుటాల్లో వ్రాసివుంచిన మూగ— అక్షర పంక్తులు కావు. ప్రియమిత్రుడు ఆప్యాయంగా కౌగిలించుకొని పలికిన మధురోక్తులుగా, ఛలోక్తులుగా ప్రత్యక్ష మౌతాయి. ఆతని ఉపమానాలూ ఉక్తులూ దైనందినజీవితాల్లో కరిగి కలిసి పోయాయి.

ఐనప్పుడు—

ఆయన గతించినవాడని ఎట్లా అనుకుంటాం? గురుశిష్యుల కావ్యపాఠాలమధ్య, రసజ్ఞుల సాహిత్యమీమాంసల్లో ఆయన జీవిస్తున్నాడు.

ప్రేయసీప్రియుల సుందరసాంగ్రసారాల్లో వసిస్తున్నాడు.

ప్రియావియుక్తుల శూన్యశయ్యలలో నిట్టూరుస్తున్నాడు.

భారతదేశపు ఆరుఋతుశోభల్లోనుంచీ తొంగి చూస్తున్నాడు.

వేయేల—

ఇక్కడిక్కడ ఉన్నాడు అని ఎంచి చెప్పడంకంటె— ఎక్కడ లేడు! అని ఒక్కప్రశ్నవేసి ఊరుకుంటే సరిపోతుందనుకుంటాను.

భారతాత్మ తాను ముక్తకంఠంగా ఏమిచెప్పదలచుకొన్నదో అది ఆయనకంఠంద్వారా పలికింది. సర్వభారతీయ సంస్కృతికి, సంపత్తికి, సౌందర్యానికి ఆయన ఏకైక ప్రతినిధి. కనుకనే భారతదేశం అనగానే అన్నిటికి ముందుగా కాళిదాసు, కాశ్మీరం అనే అక్షరాలు సాక్షాత్కరిస్తాయి.

వందే మాతరం— అని ఆయ నెక్కడా వినాదాలు చెయ్యలేదుగాని మాతృభూమిని అంతగాఢంగా ప్రేమించిన వేరొక సంస్కృతకవి కనపడడు. ఆయన దేశభక్తి శుష్క భూగోళవివరాలతో జడప్రాయంగా ఉండదు. అది సౌందర్య భరితము. వ్యంగ్యసుందరము.

ఆయనదృష్టిలో భారతభూమిఅంతా ఒక అఖండ మాతృస్వరూపం. దానికి నిలువుగా అడ్డంగా గళ్ళా, గీతలూ లేవు. తాళీవనశ్యామమైన తూర్పుసముద్రతీరంమీద ఎంత ఇష్టమో మరీచవనములనుంచి హారీతపక్షులుఎగిరే మలయాద్రిఉపత్యకలమీదనూ అంత అభినివేశం. తామ్రపర్ణీనదితో కూడిన దక్షిణ సముద్రపు ఆణిముత్యాలమీద ఎంత ఆసక్తియో మొగలిపువ్వుల్ని ఎగిరే కేరళదేశపు మురళానదీతీరంమీదనూ అంత మోజు. గుర్రాలు తమజూళ్ళమీద పడ్డ కుంకుమపువ్వుకేసరాలను మాటిమాటికీ విదలించే సింధునదీప్రాంతాలను, కస్తూరీమృగాలు కూర్చునిలేవగా గుమగుమలాడే రాతిపలకలమీద సైనికులు విశ్రమించే హిమాలయ ప్రదేశాలనూ ఆర్ద్రనయనాలతో ఆయన చూడకుండా ఉండలేదు.

భారతదేశపు బహిరంగస్వరూపాన్ని ఎంత గాఢంగా ఎరుగునో అంతరంగనిక్షిప్తమైన అపూర్వ సంస్కృతినికూడా అంతలోతుగానూ అవగాహనచేసుకొన్నవాడు. శాస్త్రాలూ,

సంప్రదాయం, మతం, కళలూ, ప్రకృతిసౌందర్యం, సర్వ మానవానుభవవిభూతినీ తన అమృతకవితాస్పర్శతో అజరామరాలు చేసి భారతీయచైతన్యం అంటే ఇదీ అని సకలప్రపంచానికీ చాటిన విశ్వకవి ఆయన. మహర్షిప్రోక్తమైన భారత పరిజ్ఞానానికి రుచిరభాష్యాలుగా, వ్యాఖ్యానాలుగా ఆయన రచనలు దర్శన మిస్తాయి.

కాళిదాసదృష్టిలో మతం, సంకుచితమూ, పాక్షికమూ కాదు. ఆయన స్థూలదృష్టికి శైవుడుగా కన్పించినా ఆయన సిద్ధాంతం సువిశాల మైనది.

కుమారసంభవంలో శివకల్యాణోత్సవానికి బ్రహ్మ విష్ణువులు విచ్చేసి ఈశ్వరుణ్ణి అభివందించారు. ఆ సందర్భంలో మహాకవి అంటాడు.

'ఏకైక మూర్తి ర్బిభిదే త్రిధా సా
సామాన్య మేషాం ప్రథమావరత్వం।
విష్ణో ర్హరః తస్య హరిః కదాచిత్
వేధా స్తయోః తావపి ధాతు రాద్యౌ'॥

కుమా. 7.44

'ఒకేమూర్తికి మూడురూపాలు. వారిలో ఎక్కువా తక్కువా అనేవి లేవు. విష్ణువుకంటె శివుడు ఆయనకంటె విష్ణువు వారిద్దరికంటె బ్రహ్మ, బ్రహ్మకంటె వారిద్దరూ మొట్టమొదటివారు.' అనగా వీరిలో ఏ ఒక్కరి ఆధిక్యం స్థాపించబూనడంఅయినా తెలివి తక్కువ అన్నమాట.

ఈయన రెండుచోట్ల భగవత్స్తుతి చేశాడు. అక్కడ లౌకిక కథలనుగాని, అవతారప్రసక్తినిగాని ఎత్తక రెండు చోట్లను ఉపనిషత్ప్రతిపాదిత తత్త్వమును గూర్చియే ప్రవచించినాడు.

నమ స్త్రిమూర్తయే తుభ్యం,
ప్రాక్ సృష్టేః కేవలాత్మనే
గుణత్రయ విభాగాయ
పశ్చా ద్భేద ముపేయుషే॥

కుమా. 3.4

'సృష్టికిపూర్వం కేవలాత్మస్వరూపుడవు. పిమ్మట గుణత్రయవిభాగము నందినవాడవు. అందువల్ల భిన్నభావము కలిగినవాడవు. అట్టి త్రిమూర్తికి నీకు నమస్కారము.' "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్" అనే శ్రుత్యర్థం ఇందులో ప్రతిపాదితం అయింది.

త్వ య్యావేశిత చిత్తానాం
త్వత్సమర్పితకర్మణాం
గతి స్త్వం వీతరాగాణాం
అభూ యస్సన్నివృత్తయే॥

రఘు. 10.28

'నీయందే చిత్తముంచి నీకే కర్మలను సమర్పించి విరాగులైన వారి పునరావృత్తిరాహిత్యమునకు నీవే గతి నసి చున్నావు'. 'మన్మనా భవ మద్భక్తః' అను గీతార్థమున్ను, 'త మేవ విద్వా నమృత ఇహ భవతి, నాన్యః పన్థా అయనాయ విద్యతే' అనే శ్రుత్యర్థమున్నూ ఇచట ప్రతిఫలించిన వని మల్లినాథు లంటారు.

పురుషార్థాల్లో ధర్మం శ్రేష్ఠమనీ, అర్థకామాలు రెండూ తదధీనంగానే నడవవలసి ఉన్నవనీ ఈ కవి అభిప్రాయం. దిలీపరాజును వర్ణిస్తూ ఇట్లా అంటాడు. 'అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మ ఏవ మనీషిణః'

బ్రహ్మచారివేషంలోని శివుడు తపస్విపార్వతితో ధర్మం త్రివర్గసార మని కంఠోక్తిగా పలుకుతూ 'అపేవ ధర్మ స్సవిశేష మద్య మే త్రివర్గసారః ప్రతిభాతి భామిని' అని అంటాడు.

కామానిదిపై చేయి అయితే ప్రవాహం ఏటిఒడ్డును విరిచినట్లు అర్థధర్మాలను ధ్వంసం చేస్తుంది అని ఇంద్రసభలో కాముడిచేతనే అనిపిస్తాడు. 'కస్యార్థధర్మౌ వద పీడయామి సింధో స్తటా వోఘ ఇవ ప్రవృద్ధః'.

కాళిదాసుశాస్త్రదృష్టి విచిత్రమైనది. ఆయన తన శాస్త్రపరిజ్ఞానాన్ని అనవసరంగా ముందుకు తీసుకొని రానీయక ఒక ఉపమానంగానో, ఒక విశేషణంగానో ఒక పరిమిత వ్యక్తిచిత్రణంలోనో ఇమిడ్చి చమత్కరిస్తాడు.

రఘు॥ ఒకటవసర్గలో వసిష్ఠునిగూర్చిచెప్తూ అంటాడు. 'అ థాథర్వ నిధే స్తస్య' ఇక్కడ అథర్వనిధి అన్న వసిష్ఠునివిశేషణం ఆలోచిస్తేగాని ఎందుకో తెలీదు. ఇక్కడ శాస్త్ర సంప్రదాయ మేమిటంటే పురోహితుడైనవాడు అథర్వవేదవిహితంగా శాంతికపౌష్టిక కర్మలు నిర్వహించాలి. ఇచ్చట దిలీపుని అనర్థనివృత్తికి వసిష్ఠునికి ఈ విశేషణం అవసరం.

పెండ్లికాగానే శివుడు నవవధువు పార్వతిచేయిపట్టుకొని శయనమందిరంలో ప్రవేశించాడు. అక్కడ నేలపై పాన్పు పరచియున్నది. 'ఇచట నేలపై పాన్పు' అనగానే వింతగా కనపడుతుంది. ఇక్కడ ఒక ధర్మరహస్యం ఉంది. పెండ్లి అయినమూడురోజులవరకూ అక్షారలవణాశిత్వం, బ్రహ్మచర్యం శాస్త్రనిర్దిష్టములై ఉన్నాయి. 'అత ఊర్ధ్వం అక్షారలవణాశినౌ, అధ శ్శాయినౌ బ్రహ్మచారిణౌ స్యాతాం' అశ్వలాయన సూత్రం.

ఇక్కడ ఈ వైద్యశాస్త్రవిషయాన్ని చక్కని ఉపమానంగా ఉపయోగించుకున్నాడు. తారకాసురపీడితులైన దేవతలు బ్రహ్మతోఅన్నమాట—

తస్మి న్నుపాయాః సర్వే నః క్రూరే ప్రతిహతక్రియాః
వీర్యవన్త్యౌషధానీవ వికారే సాన్నిపాతికే॥

'మాఉపాయాలన్నీ అరాక్షసునియెడల బలమైన ఔషధాలన్నీ సన్నిపాతజ్వరంలోవలె నిష్ఫలములైపోయాయి.'

అట్లాగే ఒక వ్యాకరణశాస్త్రమర్యాదను తీసికొని ఇట్లా ఉపమిస్తాడు.

దేవతల మొరవిని బ్రహ్మదేవు డంటాడు.

లబ్ధప్రతిష్ఠాః ప్రథమం యూయం కిం బలవత్తరైః
అపవాదై రివోత్సర్గాః కృత వ్యావృత్తయః పరైః

'మొదట గట్టిగా నిలదొక్కుకున్న మీరు బలమైన అపవాదసూత్రాలచేత సామాన్య సూత్రాల్లాగు ఎట్లా నిలకడ కోల్పోయినా రయ్యా.'

రఘువంశాదిని 'యోగే నాంతే తనుత్యజాం' అని రఘువంశరాజుల విశిష్టమైన అంత్యదశను నిర్దేశించి ఆయోగి సాధనక్రమాన్ని రఘుజీవితాంతంలో చక్కగా నిరూపించాడు.

న నవప్రభు రాఫలోదయాత్
స్థిరకర్మా విరరామ కర్మణః
న చ యోగవిధే ర్నవేతరః
స్థిరధీ రాపరమాత్మదర్శనాత్॥ రఘు. 8.22

'అజరాజు ఫలప్రాప్తివరకు తాను చేపట్టిన పనిని విడువలేదు. రఘురాజు పరమాత్మదర్శన మయ్యేవరకును పట్టిన యోగసాధనమును విడువలేదు.' ఒక్క రఘువంశమునందేకాక పరమేశ్వరుని తపస్సందర్భంలోకూడా యోగసాధనవిశేషాలను ఇట్లా నిరూపిస్తాడు.

కించిత్ప్రకాశ స్తిమితోగ్రతారైః
భ్రూవిక్రియాయాం విరతప్రసంగైః
నేత్రై రవిస్పందితపక్ష్మమాలైః
లక్ష్యీకృతఘ్రాణ మధో మయూఖైః॥
కుమా. 3—47

'పరమేశ్వరుడు తపోనిష్ఠలో నుండగా అతనికన్నులు కొంచెముప్రకాశముతో నిశ్చలముగా, తీవ్రముగా ఉన్న కనుగ్రుడ్లుగలవై భ్రూవిక్షేపములను ఉడిగి రెప్పలను అల్లార్పక క్రిందికి ప్రసరించుచున్న కాంతులు గలవై నాసాగ్రమును చూచుచున్నవి.' ఈ యోగస్థితి యోగసార మనే గ్రంథంలో ఇట్లా వర్ణింపబడి ఉన్న దని మల్లినాథులవివరణం.

కరణాని అబహిష్కృత్య స్థాణువ న్నిశ్చలాత్మకః
ఆత్మానం హృదయే ధ్యాయేత్ నాసాగ్రే న్యస్త లోచనః॥

కాళిదాసు శృంగారప్రియుడు అనేది సుప్రసిద్ధవిషయం అయితే ఆయనశృంగారప్రీతి ఇంద్రియలౌల్యాన్ని, మానసిక దౌర్బల్యాన్ని ప్రోత్సహించేది కాదు. అది ఉదాత్తము, ఉత్తమస్థాయికి చెందినది. స్త్రీపురుషుల ప్రేమతత్వాన్ని గూర్చి ఆయన సిద్ధాంత మిది.

అనాతురోత్కంఠితయోః ప్రసిధ్యతా
సమాగమే నాపి రతి ర్న మాం ప్రతి
పరస్పరప్రాప్తినిరాశయో ర్వరం
శరీరనాశోపి సమానురాగయోః॥

'స్త్రీ పురుషులలో ఒకరికి గాఢమైన ప్రేమ ఉండ రెండవవారికి లేకపోతే అట్టికలయిక రుచిహీనమైనది. సమాన రాగంకలవారు కలుసుకోలేక నశించిపోయినా అస్థితి మంచిది' అని మాళవికాగ్నిమిత్రంలో నాయకునిచేత అనిపిస్తాడు.

గొప్పప్రేమ సిద్ధించవలెనంటే చార్మికలావణ్యంవల్లను పైపూతమెరుగువల్లను అది లభ్యంకాదు. దానికి ఏకాగ్రమైన తపస్సు చెయ్యాలి—సాధించాలి— అంటాడు. పార్వతి మహేశ్వరప్రాప్తికోసం తపస్సు చెయ్యబోతూ ఇట్లా అనుకొంటుంది.

ఇయేష సా కర్తు మవంధ్యరూపతాం
సమాధి మాస్థాయ తపోభి రాత్మనః
అవాప్యతే వా కథ మన్యథా ద్వయం
తథావిధం ప్రేమ పతిశ్చ తాదృశః॥

'ఆమె తపస్సుచేసి తన రూపాన్ని సఫలంచేయ దలచింది. లేకపోతే అట్టిప్రేమ అట్టిపతి ఎట్లా లభ్యమవుతారు.'

కాళిదాసుసృష్టిలోని పత్ని తనపతితో ఇట్లాంటి అద్వైతం కోరుతుంది.

శశినా సహ యాతి కౌముదీ
సహ మేఘేన తటి త్ప్రలీయతే
ప్రమదాః పతివర్త్మగా ఇతి
ప్రతిపన్నం హి విచేతనై రపి॥
కు. 4—33.

'చంద్రునితో వెన్నెల పోతుంది. మబ్బుతోకూడా మెరపు లయమవుతుంది. స్త్రీలు భర్తృమార్గానుయాయినులని చైతన్యంలేనివి కూడా చెపుతాయిగదా!' దీనికి జవాబు అన్నట్లుగా కాళిదాసు చిత్రించినపతి అనన్యప్రేమ మగ్గడిస్తాడు.

గృహిణీ సచివః సఖీ మిథః
ప్రియశిష్యా లలితే కలావిధౌ
కరుణావిముఖేన మృత్యునా
హరతా త్వాం వద కిం న మే హృతం॥
రఘు. స. 8. ప. 67

'నా గృహిణివి. మంత్రివి. మిత్రమవు. లలితకళల్లో ప్రియశిష్యురాలవు. దయమాలిన మృత్యువు నిన్నెత్తుకొనిపోయి నా కేమి మిగిల్చింది?'

చిత్రకళ, సంగీతం, నాట్యం మొదలైన లలితకళల్లో కాళిదాసుకున్న అభినివేశం ప్రవేశం ఆయనరచనల్లో పలుచోట్ల ప్రత్యక్ష మౌతాయి.

పార్వతీయౌవనాన్ని వర్ణిస్తూ 'ఉన్మీలితం తూలికయేవ చిత్రం'' అంటాడు. కుంచెతో (పరపర) వికసించిన బొమ్మ

వలె నున్నదట ఆమె యౌవనం! నందికేశ్వరుని హుంకారం విని అడవిఅంతా కిక్కురుమనకుండా బొమ్మవేసినట్లు నిశ్చలంగా వున్నదట.

'తచ్ఛాసనాత్ కానన మేవ సర్వం
చిత్రార్పితారమ్భ మివావతస్థే'.

ఈచిత్రకళాప్రవేశం తనపాత్రలకు కూడా సుపరిచిత మైనట్లు పలుకుతూ ఉంటాడు అక్కడక్కడ. పార్వతి స్వహస్తచిత్రిత చంద్రశేఖరుణ్ణి రహస్యంగా ఉల్లసమాడు తుంది. 'ఇతి స్వహస్తోల్లిఖితశ్చ ముగ్ధయా రహస్యుపాలభ్యత చంద్రశేఖరః.'

ప్రవాసియక్షుడు ధాతురసంతో రాతిపలకమీద తన ప్రియురాలిని చిత్రించి ఊరట పొందబోతాడు.

'త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగై శ్శిలాయాం...'

సంగీత నాట్యాల్లో ఆయనకున్న పరిచయవిశేషం అనేక స్థలాల్లో అభివ్యక్త మౌతుంది.

శివపార్వతుల కల్యాణానంతరం వారి వినోదంకోసం అప్సరలు నాట్యం చేశారు.

తౌ సంధిషు వ్యంజితవృత్తిభేదం
రసాంతరేషు ప్రతిబద్ధరాగం
అపశ్యతా మప్సరసాం ముహూర్తం
ప్రయోగ మాద్యం లలితాంగహారం॥

'ముఖాది సంధుల్లో రసానుగుణంగా కైశిక్యాదివృత్తుల్ని ప్రకటించి శృంగారాదిరసప్రదర్శనంలో ఉచితమైన రాగాలు పాడి సొగసైన అంగవిన్యాసాలతో అప్సరసలు ప్రదర్శించిన నాటకాన్ని కొంతసేపు ఆనూత్నదంపతులు చూశారు.'

గిరికన్య తనప్రియుడు పినాకుని చరిత్ర గానం చేస్తుంది. 'ఉపాత్తవర్ణే చరితే పినాకినః.........'

వసంతోత్సవంలో కింపురుషుడు ప్రేయసీ గానమధ్యంలో ఆమెముఖం చుంబించినాడట! 'గీతాంతరేషు శ్రమవారిలేశైః కించిత్ సముచ్ఛ్వసితపత్రలేఖం.............ప్రియాముఖం కింపురుష శ్చుచుమ్బ'

అగ్నివర్ణునిఒడిలో మధురరుతులు పలికే వీణగాని మంజువాక్కుల కులికే మదవతిగాని విడవకుండా ఉండాలి.

అంక మంక పరివర్తనోచితే
తస్య నిన్యతు రశూన్యతా ముభే
వల్లకీ చ హృదయంగమస్వనా
వల్గువా గపి చ వామలోచనా॥ రఘు 19.13

అలకానగరభవనాలు సంగీతమురజధ్వనులతో ముఖరితము లౌతాయి. 'సంగీతాయ ప్రహతమురజాః'.

రసరామణీయకాలు ఆమహాకవి పూజాపీఠంమీద నిలిచిన రెండు ఉపాస్య దైవతాలు. మానవీమానవుల హృదయదఘ్న మైన రసానుభూతిని చిత్రించడంలో ప్రకృతిలోని రామణీయక ము:ము సమమాహాత్మ్యంగా గ్రహించి పలకడంలో ఆయనకు వేరొకరు సాటిరారు. అజేందుమతులు వరవధువు లైనారు. పెండ్లిపీటల మీద వారి చూపుల మాధుర్యం ఇది.

తయో రపాంగ ప్రతిసారితాని
క్రియాసమాపత్తి నివర్తితాని
హ్రీయంత్రణా మానశిరే మనోజ్ఞాం
అన్యోన్యలోలాని విలోచనాని॥ ర. 7. 23.

'పరస్పరాసక్తిగల ఆవధూవరుల చూపులు కనుగొలకుల నుంచి బయలుదేరి తలవనితలంపుగా కలిసికొని వెంటనే మరలి మనోహరమైనసిగ్గుతో సంకోచమును పొందుచున్నవి.' ఈ అనుభావవర్ణనంవల్ల కలిగిన ఇచటి శృంగారస్ఫూర్తి దర్శనీయమైనది.

'క్షణే క్షణే యన్నవతా ముపైతి
తదేవ రూపం రమణీయతాయాః'.

క్షణక్షణానికీ ఏది కొత్తగా కనపడుతుందో అదే రమణీయత గదా! ఈ రమణీయత కాళిదాసకవితలో సమృద్ధిగా దొరుకుతుంది. ఋతుకావ్యంలో ఆయన శరద్వర్ణనం ఇది.

కాశాంశుకా వికచపద్మ మనోజ్ఞవక్త్రా
సోన్మాదహంసరవనూపురనాదరమ్యా
ఆపక్వశాలిలలితానతగాత్రయష్టిః
ప్రాప్తా శరత్ నవవధూరివ రూపరమ్యా॥
ఋతు. శర

'రెల్లుపూలచీరకట్టుకొని వికసించినపద్మముఖంతో, హంసరవమంజీరనాదంతో పక్వసస్యయౌవనభారంతో శరత్తు కొత్తకోడలిలా వచ్చింది.' ఆయనసౌందర్యదృష్టికి ఇది ఒక మచ్చుతునక. ఆయనసౌందర్యదివ్యదృష్టికి ఈ క్రింది వాక్యాలను ఉదాహరణాలుగా గ్రహించవచ్చు.

కైలాసపర్వత మంటే ప్రతిదినమూ పరమేశ్వరుడు నవ్విన నవ్వులప్రోవట. 'రాశీ భూతః ప్రతిదిన మివ త్ర్యంబకస్యాట్టహాసః'

చెట్లచివుళ్ళఎర్రనిపొట్లాలలో పడిన మంచుబిందువు వలె ఉన్నదట అజరాజు పెదవిపై చిరునవ్వు. రఘు. 5 స. 70 శ్లో.

హిమపర్వతం పైకి జడస్వరూపం. కాని ఆయనదేవతాత్ముడు. ఆయనకు చైతన్యం వస్తే ఎట్లా వుంటాడో? ఇట్లా ఉంటా డని కాళిదాసు చెప్పగలడు.

ధాతుతామ్రాధరః ప్రాంశుః
దేవదారు బృహద్భుజః
ప్రకృత్యైవ శిలోరస్కః
సువ్యక్తో హిమవా నితి॥ కు. 6.51

తువుల రెండెదవితో, దేవదారుతరూన్నత భుజములతో సహజశిలావక్షస్కుడై హిమవంతుడు దర్శనమిస్తాడు.'

అలకాపట్టణస్త్రీలందరు పూలరాణులు. చేతిలో లీలా కమలం. ముంగురులలో మల్లెలు. ముఖమున పుప్పొడి. కేశపాశంలో కొత్తగోరింటపువ్వులు. చెవిలో శిరీషం. పాపటలో కడిమిపూలు. (మేఘ 2.2.) ఓహో! నిలువునా పులకించే ఆయన సౌందర్యదృష్టికి నమోవాక మర్పించడంకన్నా ఏమి చెప్పగలం? అంతటి నిశితశాస్త్రనైపుణ్యమూ ఇంతటి రసార్ద్రహృదయమూ ఒక్క వ్యక్తిలో ఎట్లా ఇమిడినవో అని ఆశ్చర్యచకితులం ఔతాము.

కాళిదాసకవితనుగూర్చి ఇన్ని చెప్పి ఆయన ఉపమానాలను గూర్చి తలపెట్టకపోవడం చెప్పరానంత వెలితి అవుతుంది.

ఆయన ఉపమానపరంపరలోని లోతు ఔచిత్యమూ తెలియడానికి వాచవిగా రెండుపమలు చూస్తే చాలు.

స్వర సంస్కార వత్యాసౌ
పుత్రాభ్యామథ సీతయా
ఋచే వో దర్చిషం సూర్యం
రామం ముని రుపస్థితః—రఘుః 15—16

'స్వర సంస్కారములు గలిగిన సూర్య దేవతాకమైన ఋక్కుతో వెలుగుచున్న సూర్యుని సేవించినట్లు వాల్మీకి మహర్షి పుత్రులతో కూడిన సీతతో రాముని సమీపించెను.'

కుశలవులు స్వరసంస్కారముఃవంటివారు. సీత వేద ఋక్కువంటిది. సూర్యునివంటివాడు రాముడు. ఆయన తీవ్రముగా నున్నాడు.

వాల్మీకి ఉపాసక మహర్షి. సీతను ప్రజలు శంకించినారు. ఆమెను రాముడు దూరముచేసినాడు. వాల్మీకి ఆమెశుద్ధశీల అని యెరుగును. ఆమెను రామునికి సమర్పించాలి. అతడు రాజధర్మంచేత దుర్నిరీక్ష్యుడు. ఇక్కడ ఆమె పావిత్ర్యాన్ని చెప్పడానికి ఋగ్వేదమంత్రం తప్ప ఇంకేఉపమానం సూటిగా సరిపోతుంది? ఆవేదమంత్రం స్వరసంస్కారములచేత మరింత పావనమైనది. దాన్ని ప్రయోగించినవాడు మహర్షి. అట్టి మంత్రమహిమచేత ఎంత తీక్ష్ణమైనవాడైనా ప్రసన్నుడై తీరాలి. రాముడు ప్రసన్నుడైనాడు. ఇంతేకాక ఇచట వాల్మీకి సుస్వరశబ్దసంస్కారవంతమైన మంత్రవాక్యంవంటి వాక్కుతో సీతారాముల కథను పలికి ధన్యుడైనాడని ఒక వ్యంగ్యాన్ని కూడా భావించవచ్చు. ఈ ఉపమాన మందలి లోతు ఇట్లా చిరము భావించి ఆనందించదగ్గిది. ఇంకొకటి:—

సా కిలాశ్వాసితా చండీ
భర్త్రా తత్సంశ్రుతౌ వరౌ
ఉద్వవామేంద్రసిక్తా భూః
బిలమగ్నా వివో రగౌ॥. ర. 12. 5

'కోపన ఐన కైకేయిని భర్త లాలించినాడు. తొలివాన జల్లుచే తడిసిన భూమి పుట్టనుంచి రెండుపాములను వెలి గ్రక్కినట్లు ఆమెరెండువరాలను వెల్లడించింది.' కోపనను లాలించితే మరీ క్రౌర్యం వహిస్తుంది. అట్టి చండికకోరికలు త్రాచుపాములకన్న క్రూరమైనవి. కైకవరాలతీవ్రతను సూటిగా ఇంతకంటే ఏ కవి చెప్పగలడు? ఆయనఉపమానాలు రంగులతికించిన లక్కబొమ్మలు కావు. కొమ్మపూచితే రాలే పువ్వులు!

తుది కొక్కమాట—

ఆయనకవితాసాగరంనుంచి ఎన్నని మణులు ఏరగలం! ఎంత అమృతాన్ని పుడిసిట పట్టగలం! 'తద్గుణైః కర్ణమాగత్య చాపలాయ ప్రచోదితః' అని ఆయనే ఒకచోట అన్నట్లు ఆతని రచనాభోగంనుంచి రేఖామాత్రంగా కొన్నిటిని స్మరించి తృప్తిపడడమే ఇప్పటికి శరణ్యం. మొత్తంమీద ఒక్క అంశం చెప్పవలసివుంది. మహాకవి తన కవితను వినోదంకోసం విలాసంకోసం ఉద్దేశించినట్టు కనపడదు. ఆయనకు నిర్దిష్టమైన రచనాలక్ష్యం ఉంది. నిష్పన్నమైన సిద్ధాంతా లున్నాయి. ఆయన రచనాసర్వస్వంనుంచి ఈ సందేశాలు స్ఫుటంగా వినిపిస్తాయి.

మానవజీవితం చేదు కాదు. అది మాధుర్య పరిపూర్ణం. మెలకువతో అనుభవించాలి. మానవులు వీరులై ధీరులై తమ కర్తవ్యం నెరవేర్చాలి. ప్రజలను తిరస్కరించి భోగాలకు దాసుడైన రాజుకు వినిపాతం తప్పదు. ప్రేమకు పైపై మెరుగులు ఆధారం కావు. తపఃపక్వమైన హృదయంలో అది పవిత్ర సుందరంగా వికసించాలి. స్వాధికారప్రమత్తులకు దుఃఖం తప్పదు. ఆర్ద్రహృదయులు దీనులకు ఊరట కల్పిస్తారు. జీవులకు మరణమే సహజం. జీవనం తాత్కాలికమైనది. జీవి అదృష్టవశాత్తు ఒక క్షణమైనా బ్రతికివున్నందుకు సంతోషించాలి. వివేకవంతుడు తుదకు తనకు పునర్భవం లేకుండా జగత్ప్రభువును వేడుకోవాలి.

ఎందరు కవీశ్వరులు భారతభూమిలో పుట్టి అద్భుత రచనలు చేసినా భారతాత్మ ఒక్కకాళిదాసకవీంద్రునివలననే వెలిగింది.

'నక్షత్రతారాగ్రహసంకులాపి
జ్యోతిష్మతీ చంద్రమసైవ రాత్రిః' (రఘు—11—22)

అని ఆయన అన్నమాట సంస్కృతసాహిత్యప్రశంసలో ఆయనస్థానమెట్టిదో వ్యంగ్యంగా చెపుతుంది.

ఒకనాడు గొప్పవెలుగువెలిగిన భారతసమగ్రపటాన్నిచూడదలచావా, మిత్రమా ఒకసారి కాళిదాసరచనల్ని చదువుచాలు.*

---

* తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఆర్ట్సు కళాశాలలో జరిగిన కాళిదాస జయంతి సందర్భంలో చేసిన ఉపన్యాసానికి పరివర్ధిత పరిష్కృత వ్యాసరూపం.

# నేను మేల్కొని ఉంటాను

శ్రీ మాదిరాజు రంగారావు

బ్రతుకులో మార్పుల ఊర్పులతో
పయనిస్తూ గాలుల కదలికలో,
పగలు మరపు మగతలో
రాత్రి ఆరని తెలివితో ఉంటాను.

నాపై పగటి ముద్రలు
పూర్తిగా వదలవు రాత్రి,
నాపై రాత్రి ముద్రలు
పూర్తిగా వదలవు పగలు,
అందుకే అందరిలా సూటిగ కాకపోయినా
మీతో మాట్లాడగలుగుతున్నాను.

గొంగళీ పురుగునుండి
సీతాకోక చిలుకవలె
రాత్రినుండి అవతరించిన ఉదయం
బలంగా గాలి వీస్తే
ఎక్కడికక్కడ తునాతునకలై పోతుందా ?
అన్నంత సుకుమారంగా ఉన్న ప్రపంచం,
ప్రొద్దు ఎక్కిన కొద్దీ
వేడిమి హెచ్చినకొద్దీ ప్రశంసలు పొంది
మొండి ఘటమనిపించుకుంటుంది.

ఉదయం రావడంతోనే అంతటా
సన్నని కన్నీటి తెరవలె
కన్పిస్తుంది నాకు మంచుపొర.

అంతగా మండే సూర్యుని క్రింద
చెమటోడ్చుతూ, పరుగెత్తుతూంటే
అంతగా వీసరే చలి, వానలో
శరీరం ముడుచుక పనిచేస్తూంటే ఎందరో,

నీవు చూస్తున్నావుగా
నేనింకా నిదురపోతున్నాను!
ఈ నిదుర మృత్యువుకన్న
కొంత తేలికైంది,
ఈ ప్రపంచం మృత్యువుకన్న
చాల బరువైంది.

పగలంతా ప్రపంచం ఎందుకో
సముద్రంలో పడబోతున్నట్లు ఉంటుంది.
పగలంతా ప్రపంచం ఎందుకో
అగ్నిలో ఆహుతి కానున్నట్లు ఉంటుంది.

ప్రతిమూల ప్రతిధ్వని తప్ప
ఎక్కడో కాని అసలు ధ్వని వినిపించదు,
ప్రతిచోట ప్రతిరూపం తప్ప
ఎక్కడోకాని అసలు రూపం కనిపించదు.

కాలుపెడితే కంఠ దఘ్నంగా
కూరుకపోయే ఇసుక దిబ్బలు.
మన బుజాలపైనుండి
శవాలు నిక్కి చూస్తుంటాయి.
మన పాదాల వెనకాలే
నీడలు నక్కి వస్తుంటాయి.

శూన్యంలోకి దృక్కులు ప్రసరిస్తూ
కూర్చున్న పెద్ద మనుషుల
లాంతరు ముఖాలు దూరదూరంగా,
ఇప్పుడివి ఎవరికి కావాలి?

పిచ్చి ఊహలకు రూపాలు చిత్రించి
వట్టి మాటలకు అర్థాలు తీసి
గ్రుడ్డిచూపులకు అందాలు కల్పించి
చెవిటి దొప్పలకు సంగీతం సృజించి
ఎంతకాలం ఇలాగా
ఎక్కడినుండి ఎక్కడికి పోతున్నామో
ఎందులకో ఎవరికీ తెలియదు.

అవును, మన గమనం నాకు తెలియకపోదు.
ఊళ్ళూ, పట్టణాలు, మైదానాలు
పొలాలు, పర్వతాలు, అడవులు
నదులు, ఎడారులు సముద్రాలు దాటి
ఇంకా గగనంలో చంద్రునిపైకి, ఆపైఆపై-

మన గమనానికి హద్దులు లేవు.
మన ప్రతిభకు పరిధులు లేనట్లే.
మన ప్రవర్తనకు తీరూ తెన్నూ లేదు
మన మనస్సుకు రూపం లేనట్లే.

ఈ పగటి బ్రతుక్కి
వ్రేళ్ళు దన్నుకొని అలవాట్లు
ఎంత లోతుగానో
పాతుకపోయి ఉన్నాయి.

రాత్రి అంతా ప్రపంచం
శాంతిని వరించనున్నట్లు అనిపిస్తుంది.
రాత్రి అంతా ఎవరో
దేనికోసమో అన్వేషిస్తున్నట్లు ఉంటుంది.

మానవుడు గమనం సాగించవలసింది
అతడు ఊహ ప్రసరించవలసింది
స్థూలప్రకృతినుండి సూక్ష్మస్వభావంవరకు
వైయక్తిక పరిధినుండి విశ్వాత్మలోకి.

## నేను మేల్కొని ఉంటాను

నేను తప్పకుండా మేల్కొంటాను.
పగటి మగత పోయి తీరుతుంది.

ఈ భూమి పూలతో పండ్లతో పంటలతో
కంటికి నిండుగా ఉండాలనే అందరి ఆకాంక్ష.
ప్రతి మనిషీ ముఖ్యంగా తనలో తాను
మేల్కొనవలసిన అవసరమూ ఉంది.

ఆశ అగ్నివలె ఉద్వేజిత మొనరిస్తూంటే
చావు వేలలో భయంవలె
శత్రుముఖంలో దాపరికంవలె
ఆవరించిన నిరాశ జయింపబడుతుంది.

రాత్రి వెనుక కాంతి స్వప్నంవలె
మానవుని కన్నీటి తెర వెనుక
అణగిఉన్న ఊహలు వాంఛలు
భవిష్యత్తులో మొగ్గ తొడిగి
వికాసించి ఫలరూపం ధరిస్తాయి.

ఒక తరంపోయి మరో తరం వస్తూంది.
అసహజమైన పగటి భయం పోయి
మనస్సు ఆనందరూప మందుకుంటుంది.

పగటి కలల కవకాశ మీయని
నవోదయం వెల్లివిరిసిన మనోరూపులు,
వసంతం చిగిర్చిన కాలసీమలు
నా ఆశారూపానికి జీవకళలు

పిరి కన్నులలో రెక్కలు విచ్చి
ముఖంలో పరచుకొని ఉన్నకాలం
అమృతం వర్షింపజేస్తుంది.,
నేను తప్పకుండా మేల్కొనే ఉంటాను.

---

# చిఱుమఱ్ఱి నరసింహకవి

# లక్షణ నవరత్నమాలిక*

## పీఠిక

'లక్షణ నవరత్నమాలిక' అను నీ ఛందోలక్షణగ్రంథమును రచించిన యతడు 'చిఱుమఱ్ఱి నారసింహకవి' అని గ్రంథాంతమందున్న 'గద్య' యిట్లు తెలుపుచున్నది.

"ఇది శ్రీమ ద్రుమణీరమణ వరప్రసాదలబ్ధకవితా చమత్కార భారద్వాజసగోత్రపవిత్ర, పుల్లనామాత్యపుత్ర సరస వాక్య ప్రధాన చిఱుమఱ్ఱి నారసింహాభిధాన ప్రణీతంబైన లక్షణ నవరత్నమాలిక సంపూర్ణము."

పై గద్యవలన నీతడు విష్ణువరప్రసాదకవియని, భారద్వాజసగోత్రుడని, తండ్రి పుల్లనామాత్యుడని, రసమయ వాక్కులు గలవాడని స్పష్టమగుచున్నది.

నారసింహకవి, ఆంధ్రలోకమున కీ వఱకు సుపరిచితుడు కాడు—గోలకొండ కవుల సంచికలో రెండుచోట్ల నీ కవిని గూర్చి సంగ్రహముగా నున్నది[1]. కాని యిటీవల యీ కవి విశేషము లనేకము నాకు తెలియ వచ్చినవి—వానినన్నిసమన్వయించి కవి జీవితమిట పొందుపఱచుచున్నాను.

## కవి జీవితము

ఈతని వాడుకపేరు సింగయ్య. జన్మస్థలము తెలంగాణాలో నల్లగొండజిల్లా మిర్యాలగూడెం తాలూకా కంపాలపల్లి గ్రామము. ఇంటిపేరైన చిఱుమఱ్ఱి గ్రామము— నేడు పిరుమర్తి 'చి మర్తి' అని వ్యవహరింపబడుచున్నది—అది కవి నివాస గ్రామము. చిఱుమఱ్ఱి నల్లగొండ జిల్లాలోనే కలదు. కవి వంశీయు లిప్పటికిని నా గ్రామమందు కలరని తెలియుచున్నది. పై విషయములవలన నీతడు 'తెలింగాణా కవి' యని తెల్లమగుచున్నది.

ఈతడు క్రీ. శ. 1814 వ సంవత్సరమున జన్మించి, ఎనుబదేండ్లు జీవించి క్రీ. శ. 1894 లో కీర్తిశేషుడయ్యెను. కాబట్టి యిప్పటి కొక శతాబ్ది ముందువాడు.

## కవితా రచనలు

నరసింహకవి, కంపాలపల్లి శ్రీ కృష్ణస్వామి భక్తుడైనను పేరుకు తగినట్లుగ—ఉగ్రకవి అని ప్రసిద్ధి చెందినవాడు. ఇతడు శాపానుగ్రహ సమర్థుడు—అనగా తిట్టు దీవించ శక్తిగలవాడు.

---

* విజ్ఞప్తి: 'లక్షణ నవరత్నమాలిక' యను నీ యత్యంత మూల్యగ్రంథమును మా పితృపాదులైన శ్రీమాన్ శ్రీ రాఘవాచార్యులవారు పితత్కృతికర్త వంశీకులనుండి సంపాదించి తాళపత్రగ్రంథమునుండి యుద్ధరించి యొక ప్రతి వ్రాసి యుంచుకొనిరి. అదియును జీర్ణదశ ననుభవించుచుండ నేను వ్రాసుకొని యుంటిని. ప్రసంగ వశమున నొకమాఱు నిరంతరతాళీదళ సంపుట ప్రకర కాంతారమున, మార్గదర్శకులును, 'పరిశోధన పరమేశ్వర' 'విద్యారత్న'— ఇత్యాది సార్థక బిరుదాభిధానములును అన్వర్థాభిధానులైన మా గురువర్యులు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారితో ప్రసంగింప వారు దీనిని జూడనెంచిరి. 'నడచుచు నున్నవారి చరణంబులకే గద కాళ్ల ద్రాకుడుల్'— అన్న విధముగ జూచుటతోబాటు, పరిష్కరణ పీఠికారచన యను భారములును వారికే దగిలినవి. సాహితీ వ్యాసంగమున నెంతమాత్రము వ్యవధి లేకున్నను నాపై గల శిష్యవాత్సల్యమున నీ గ్రంథమును పరిష్కరించి యమూల్యమగు పీఠికను వ్రాసి యిచ్చిరి. వారికి నా మనః పూర్వక వినయ నమస్కృతములు.

గురువర్యులకు సాయముగను—లేఖకుడుగను నుండి ఈ కావ్యమును త్వరలో పూర్తి చేసిన నా ప్రియ సుహృద్వరుడు శ్రీ ఎస్. భాస్కరరావుకును;

ఇందు దోషము లుండవచ్చునేమో! తెలిపిన సవరించుకొందును.

విధేయుడు
శ్రీరంగాచార్య.

1. గోలకొండ కవుల సంచిక—సంపాదకులు శ్రీ. శ్రీ సురవరము ప్రతాపరెడ్డి. పుట 385. కవి క్రమ సంఖ్య 227. చిఱుమఱ్ఱి నారసింహకవి—పుట 415; 170. పిరుమర్తి సింగయ్య.

ఉద్దండకవియైన వేములవాడ భీమకవి కోవలోనివాడు.[2] ఆ వివరములు లభించనందున—నిచ్చట నుదాహరణల నీయలేదు.

ఈతని కృతులలో ముఖ్యమైనవి మూడు—అవి

1. మహాభారతము.
2. ఇంద్ర నారద సంవాదము.
3. లక్షణ నవరత్న మాలిక.

ఇవి గాక ప్రస్తావిక రచనలు కొన్ని గలవు. వానిని తరువాత తెలుపుదును.

## మహాభారతము

ఇది సంస్కృత మహాభారతమునకు సంపూర్ణాంధ్రీకరణము. ఈ గ్రంథము మనకు లభ్యము కాకున్నను, విషయము మాత్రము చాలా ముఖ్యమైనది.

తెలుగు భాషలో కవిత్రయమువారి మహాభారతము జగద్విదితమైనా, అది యథామూలముకాదనియు, నన్నయ తిక్కనలు కొన్నిచోట్ల—పెంచియు, కొన్నిచోట్ల మూలప్రోక్తములైన వానిని త్రుంచియు, తెలుగుచేసిరని సాహితీవిమర్శకు లేక గ్రీవముగా నంగీకరించిన విషయము. ఇంతేకాదు. ఆరువందల యేండ్లవరకును, భారతమును మూలానుసారముగా నెవ్వరును తెలిగింపలేదనియు, క్రీ. శ. 1915 ప్రాంతమున అట్టి యుద్యమము ప్రారంభించి కీ. శే. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు సంపూర్తినొందించిరనియు, మూలానుసారముగా శ్రీకృష్ణ భారతమను పేర ననువదించినవారనియు కృష్ణమూర్తిశాస్త్రి గారే అట్టి రచనకు ప్రథములనియు విమర్శకులు వ్రాసియున్నారు. కాని యిది యెంతమాత్రము సరికాదు.....

మహాభారతమును మొదటిసారిగా మూలానుసారిగా ననువదించిన గౌరవము తెలింగాణాకే చెందవలయును గాని, తీరాంధ్ర ప్రాంతమునకు చెందదని యీ క్రింది విషయమును బట్టి నిర్ధారణ చేయవచ్చును.

శ్రీకృష్ణభారతరచనకు వేబదేండ్లకుముందే తెలంగాణమున రెండు సంపూర్ణ మహాభారతాంధ్రీకరణము లుద్భవిల్లినవి.

1. త్యాగరాజమొదలి—ఆంధ్రభారతము.[3]
2. చిలుమర్తి నారసింహకవి—ఆంధ్రభారతము

కాలక్రమమునుబట్టి త్యాగరాజమొదలికన్న నారసింహకవి పెద్ద. త్యాగరాజమొదలి క్రీ. శ. 1833 లో జన్మించినాడు. కావున నారసింహకవియే తొలుత సంపూర్ణ యథా మూల భారతము తెలిగించుటకు ప్రథముడని చెప్పవచ్చును. నారసింహకవి భారతమునురచించెననుటకు నింకొక ప్రమాణము గలదు. నారసింహకవి తన భారతమును భోనగిరి యందొక వైశ్యుని కంకిత మిచ్చెననియు, తాము చూచితిమనియు, శివశ్రీ చిదిరె మఠము వీరభద్రశర్మగారు మురవరమువారితో చెప్పిన మాటలు గ్రంథస్థములై యున్నవి.[4] మహాభారత సువరిష్కృత ముద్రణము ప్రారంభమగుచున్న యీ కాలమున, చిలుమర్తి, త్యాగరాజమొదలి భారతముల వ్రాతప్రతులను సంపాదించి సంప్రతించుట యత్యావశ్యకము.

## ఇంద్రనారద సంవాదము

ఈ గ్రంథము లభ్యమగుటలేదు.

## ప్రాస్తావిక రచనలు

వీనిలో కొన్ని మాత్రమే లభించినవి. వాని నుదాహరించుచున్నాను.

క. శుభమగు విభజిద్వరస
న్నిభవిక్రమ కోటిభానుదీప్తాంచిత సా
రభరిప్రవక్త రక్షః
ప్రభువిభవమద్గ్రభంగ పతగతురంగా.

నారసింహకవి చనిపోవుటకుముందుగా, ఆ సమయమున నొక మిత్రుని కోరికపైని—అశువుగా సూర్యస్తోత్రములు చెప్పిరట—వాని పేరు—"సూర్యభగవన్నవరత్నములు"—వానిలో లభ్యములైన మూడు పద్యముల నిందు పొందుపఱచుచున్నాను.

శా. శ్రీమత్సారసమిత్రమిత్ర! కరుణాసింధూ! జగన్నేత్ర!
సుత్రామస్తుత్య! బుధేంద్రపూజ్య! భవవిధ్వంసార్క!
నిత్యంబు నీనామం బెన్నగ
మోక్షమున్ సిరులు విజ్ఞానంబు
భోగప్రపంచామోదంబులు డాయునయ్య
గ్రహరాజా! సూర్యనారాయణా!

మ. దినముల్ ప్రస్తుతులెన్నకే మననమున్ దీంద్రింపకే
కల్లాలాధన మర్పింపక కూహాక ప్రతతి చేతమ్మూర్తి
విన్ వేడినన్ ఘనభక్తిన్ ప్రకటించినన్
భవముచీకాకై జనుల్ నిక్కమౌ
జనితప్రాభవుడా గదయ్య గ్రహరాజా! సూర్యనారాయణా!

---

2. ఈతని ప్రఖ్యాతి విని శ్రీ మురవరము ప్రతాపరెడ్డిగారు కవి వంశీయులవద్దకు స్వయముగావెళ్ళి వివరము లడుగగా, వారు, వివరములు తెలుపకపోవుట సరిగదా, వారిని అవమాన పఱచి, ఆ కవి వంశీయులు పంపివేసివారట.

3. ఈతడు పుట్టుకచేత తమిళుడయ్యు ఉద్యోగవశమున తెలింగాణాలో స్థిరపడెను. ఈతడు ఒరంగలు నివాసి. ఈతని అముద్రిత భారతము సభాపర్వమునుండి 32 పద్యములు క్రీ. శ. 1918 లో గ్రంథాలయ సర్వస్వమున ప్రకటితమైనవి.

4. శ్రీ వీరభద్రశర్మగారు కాశిలో జంగమవాడిమఠమునగల విశ్వారాధ్యపీఠాధ్యక్షులై సిద్ధినందిరి.

శా. మందుండున్ జముడున్ విజాత్మజాలు
ప్రేమం గూర్చుచున్
సంతతానందంబందెడి ఛాయయున్ బోరయు
విజ్ఞానాత్మ యా పద్మినీసౌందర్యంగువ భార్యయై వెలగు
నీ చందంబు చిత్రంబగున్
సందేహంబికలేదు మాకు
గ్రహరాజా! సూర్యనారాయణా!

## లక్షణ నవరత్న మాలిక

ఈ లక్షణ నవరత్నమాలికయందు తొమ్మిది సీసమాలికలు గలవు. ప్రతిసీసమాలికకుచివర గీతపద్యము గలదు. మొదటి సీసమాలిక చివర నొక కందపద్యము, నవమసీసమాలిక చివర నొక కందపద్యము గలవు. ఆ మాలికల వివరము లివి—
మాలికల సంఖ్య—పంక్తులు + గీతము

| | | | |
|---|---|---|---|
| 1. | 22 | ,, | 4 పంక్తులు |
| 2. | 38 | ,, | ,, |
| 3. | 38 | ,, | ,, |
| 4. | 46 | ,, | ,, |
| 5. | 23 | ,, | ,, |
| 6. | 28 | ,, | ,, |
| 7. | 29 | ,, | ,, |
| 8. | 29 | ,, | ,, |
| 9. | 38 | ,, | ,, |
| | 291 + 36. | | |

మొత్తము 327—రెండు కందములు 8 పంక్తులు—కలిపి గ్రంథమున—335 పంక్తులున్నవి.

## విషయవిభాగము

| | | |
|---|---|---|
| ప్రథమమాలిక | | వర్ణములు |
| ద్వితీయ | ,, | బీజాక్షరములు |
| తృతీయ | ,, | గణములు |
| చతుర్థ | ,, | యతులు |
| పంచమ | ,, | ఉభయవళులు |
| షష్ఠ | ,, | ప్రాసలు |
| సప్తమ | ,, | శబ్దములు |
| అష్టమ | ,, | సంస్కృత శబ్దములు |
| నవమ | ,, | సంధి. |

ఈ ప్రణాళికవలన నేగాక గ్రంథప్రారంభమునగల "ఆద్యాయాః పంచాశద్వర్ణాః" అను చింతామణి సూత్రము నుదాహరించుటచేతను నిది యాంధ్రఛ్ఛందోగ్రంథములలో నధిక ప్రచారము గాంచిన 'అప్పకవీయము' ననుసరించి వ్రాయబడినట్లు స్పష్టము.—అందలి మొదటి మూడాశ్వాసముల విషయములు నిందు క్రమముగానే యున్నవికాని చతుర్థాశ్వాస విషయములు అనగా ఛందఃప్రస్తారము—వృత్తలక్షణలక్ష్యములు—కళి కోత్కళికాది వివరణము—బంధకవిత్వము—ఇందు లేవు. తిరిగి పంచమాశ్వాస విషయమున్నది.

దీనినిబట్టి నారసింహాకవి—గ్రంథరచనాప్రారంభము నందే నీ ఛందః ప్రస్తారాదిక చతుర్థాశ్వాసము, విడుచుటకు నిర్ణయించినట్లు కానవగును. ఏలనవగా—సీసములలో, తిక్కిసి వృత్త లక్షణములు లక్ష్యము చెప్పుట దుర్ఘటము. అప్పు డైన నది సరిగా యతుకదు. ఇక నారసింహాకవి యుద్దేశ్యము ప్రశంసనీయమైనది. అప్పకవీయమున తృతీయాశ్వాసము చాలా ముఖ్యమైనది, కావున దానికి పూర్వ పరాంగమునమున్న విషయములను ధారణ కనుకూలముగా సీసమాలికలుగా రచించియున్నాడు. అందును—యతుల విషయమున అప్పకవీయ తృతీయాశ్వాసమున నున్న యతులలో ఉభయవళులను వేఱుపఱచి నారసింహాకవి ప్రత్యేక మాలిక సమకూర్చినాడు. ఇది విద్యార్థులకేగాక విద్వాంసులకు నెంతయు నుపకార మొనరించును.

ఇందున్నవి సీసములేగాని ఛందోవిషయములన్నియురత్నములే!

నిడుదవోలు వెంకటరావు

## లక్షణనవరత్నమాలిక

### 1. 'వర్ణములు'

మూ. సూ. ఆద్యాయాః పంచాశద్వర్ణాః॥

రమణీయ సంస్కృత ప్రాకృతాంధ్రములందు
గల వర్ణవిరతి విక్రంబుగాఁక (గ)
నమరభాషకుఁ జెల్లునచ్చులు పదియాఱు
మొదలు గాళాంత మొప్పిదముగాఁగ
నందు లఘ్వఃఘువు లైనట్టి రులు వర్ణ
ములు రెండు ఐజౌ శషలును వేయు
నాద్యను నావికందున తొలిరెండు
సారవు ప్రాకృతమున శుభగచరిత
యచ్చతెనుంగుల యందు ముప్పదియాఱు
వర్ణంబులొప్పు నవ్వలదలంప
తత్సమ దద్భవ తతుల బొసంగి యేఁ
బదియయ్యె నక్షరపంక్తిఁ దలఁప
నాదులి లోపల నఱరు నేత్వోత్వము
ల్వక్రముల్వానిసైఁ బరగు రెండు
వక్రతమంబులు వానియౌ పూర్ణబిం
దువు విసర్గ లనంగి తోరమలరు
నట్టి బిందువులతో నఱుసున్న (నెలసున్న)
లన రెండు విధముల నమరు నిజము
హ్రస్వదీర్ఘములందు నమరు నిత్తెఱగున
కాది త్రివర్గములే గనుగ వ ర ల

వర్గయుగంబెల్ల వలనొప్పు స్పర్శవర్ణ
ములు వానిలోపలఁ గలుగు చజలు
దంతతాలవ్య వర్ణతుల రంజిలుచుండు
చెక్కులు చెంగల్వ చెన్ను చేవ
చెలఁగుట చేసుట చెట్టు జేజేగట్టు
తెల్లతాలవ్యము లొప్పెల్ల మగుచు
చందురులోనల్లు చక్కి చక్కదనంబు
జాజాలు జాబిల్లి జాణ జంట
మొదలగునవి దంత్యములు ద్రుతంబున
కాది గిరిమ రంజిలు చుండు క, చ, ట, త, ప లు
పరుషంబులగు వర్ణపంచకాంతంబుల
నా నొప్పునవి యనునాసికములు
గజడదబల్ పెంపు గాంచగ సరళంబు
లా సరళంబుల యందుఁ దలఁప
ద్వంద్వసమాస సంతతుల యందున శేష
గసుగొనగానయ్యె గసడదవలు
నలుపొందుఁ గాలుసేతులు మూరువల్లెల
తలిదండ్రులన్నచో దానవారి
ప్రథమావిభక్త్యంతపై బిందువుం పొన్ను
లందున దలఁపగ విందిరేశ
కచటతపల్ గూడి గజడదబల్ గాఁ జె
లంగును యరలవ లనంగు గాఁగ
నంతస్థలగు నూష్మలగు శషసహలు త
క్కినయవి గణుతింప వనధిశయన
స్థిరము లగునట్టి సంజ్ఞచేఁ గాన
శబ్దశాస్త్రంబు వలన నెంచంగఁ దనరె
భవ్యమణిహారి 'కంపాలపరి' విహారి
రాక్షసమదాపహారి శ్రీరంగశౌరి.

లఘు యకారములు :

2

కం. సురనది యాత్మజ కాకో
దరపతి యాసనము మరుఁడు తనయుఁడు రతిసుం
దరి యున్న నమఁగఁ గోడలు
సిరి భామిని యబ్ధి యురవు శ్రీహరికవినన్.

## 2. బీజాక్షరములు

శ్రీకారమునకు భాసిల్లు శకార మా
కార బీజము దాని గతిఁదలంప
శౌరవంబగు మహాప్రాణంబు గావున
నగు దరిద్రత మహాపాప జీవ
హింసయు దిగువశాయుని జెందు రేఫాది
పతి కృశానుఁడు దాహఫలము దలఁప
తిర్యగ్గమనమగు తీక్ష్ణంగిరుజములుఁ
గీడు గైసేయు బ్రేడులకును
ప్రథమోష్మ వర్ణంబు పరగరేఫార్ణంబు
లోకహాటఁ దనరిన నుగ్రమొదవు
భంగులు గణుతించి బసువును క్షారంబు
లోకచో మెలంగి యెన్నికబరంగు
తమతమవన్నియు ల్దరలి కెంపుమెఱుంగు
గైకొను సరణి ధాకల్పటంచు
వక్కరంబులు సంయుతార్ణంబు లగుచు దు
ష్కృయలాద్రి దోసము ప్రేమ్మఁ జేయు
ననుచు శ్రీకారంబునందు నమరగ నిల్చు
శోభాకరంబు విస్ఫురణము బ్రౌ
సిరిపేర 'మోదమిచ్ఛేద్ధుతాశన' యను
రేఫాధిపతుల ధాత్రిని దలంచి
యదియు మొదల్గార్చి రాదిమ కవు లాది
గాన శ్రీకారంబు ఘనతఁగాంచు
నదిగాక నైత్యంబు నౌత్యంబు నూర్ధ్వము
ఖంబులు నిత్య మేత్యంబు లెన్న
గా నధోముఖము లక్కజముగు నుత్పార్శ్వ
ములు పార్శ్వ ముఖముపై మొనయుచుండు
తలకట్టులెల్ల నుజ్జ్వలముగు నమముఖ
ఖ్యాతి నాటిల్లు నిక్కఁబు గాక (గ)
భువిని నధోముఖంబున రుజంబు బొసంగు
పార్శ్వముఖంబున బాయునిరులు
నూఁది ముఖంబున మితియుంచుఁ గృతివాఖు
నమముఖ వర్ణము సౌఖ్యమమరు
నిదిఁగాక మొదల ప్రవృత్తి గైసేయంగ
క్లీబ లింగమ్ములు కీడొనర్చు
పొసఁగు స్త్రీలింగముల్ పుంలింగములు మొద
లుచరించ నృపతి సౌభాగ్య మొదవు
నైదింట మూఁడింట నాఱింట నా నొక్క
టను రుద్ర సంఖ్యల ఘనత లబ్బు
అ క చ ట త ప లు దాయఁగఁ గూర్పవలదు మూఁ
డవ తావులందున గవులు ప్రథమ
పరశ్రతయఁబును స్వరమమూఁడవయది
మూఁడవయూష్మంబు మొనయు నిడుట
వలదిఁక వ్యంజనంబుఁలోన గల పది
యాఱవ వర్ణంబు నాది నగ్ని
వర్ణంబు గూర్చి చెప్పఁగరాదు వాఁడెంత
శ్రుతుఁడైన బలంబు వడసి ద్రెళ్లు
స్వరములుఁ బదియాఱు పరచి కా మొదలు న
కార మంతంబుగ గణనసేయు
ముప్పదియొకటిగనొప్పు భానుర వర్ణ
ములు తథదధన పఫబభములు (?)
రేఫ నకారము శ్రేడును రాజార్హ
ములు యుల్ శషసహల్ వెలయు వైశ్య
జాతి యక్కరములు చజలు రెండును ఆకా

5. 'సిరి యంగన' చూ. అప్పకవీయము. 2—194.

గణయుగ్మమును సూర్యగణము లైదు బొసంగు
నాటవెలంది కంజాప్తుఁ డొకఁడు—
సుత్రాములిద్దరు సూర్యులిద్దరు గూడి
తేటగీతి యనంగ నే టలర్చు
కందంబునందు గగంబు భజల్ సన
లంబులై తగు జగణంబు లేసి
నందెందు నంజ రింపొందు నాఱిట మాత్ర
కాళి చౌషష్టిగా నలరుచుండు
పదిగాగ నిరుబ(వ)ది యాఱు ఛందంబుల
జనియించు సమవృత్త సంఖ్య లెన్న
పదమూడు కోట్ల నల్బది రెండు లక్షల
పదియాఱునొకవేయి పైని సప్త
శతముపై నిరుబ(వ)దా ఱ్సంఖ్యగా దనరు న
టంచు ము న్బుధులెన్నునట్టి సరణి
మదిని గై జేసి మోదంబు గుదురుపఱచి
గణముల విధంబు లివి తెల్పఁ గడఁగినాఁడ
భవ్యమణిహారి కంపాలపలి విహారి
రాక్షసమదాపహారి శ్రీరంగశౌరి॥

## 4. యతులు

శ్రీకరలక్ష్మీ నృసింహ శంకరమిత్ర
ధారుణీధరరూప వేఁటధీర
యనుచు వర్ణించి వే యతుల క్రమంబెల్ల
వినబల్కెదను మోద మనుసరించి
స్వరమెద్దిగల్గ వచ్చుట తదాకారంబు
నిలిపిన 'స్వరమైత్రి' నెఱకొనంగ
సరవిందలోచన యార్తావనచరిత్ర
యని పల్కఁగ 'నకారయతి' దనర్చు
ఋభురిపుద్వేష ధరిత్రీవిమల రమా
ధవ యనంగను దేవ 'ఋవలి' బరఁగు
సురగారిగమన దైత్యోగ్రభంజన యన
భువిని 'స్వరప్రధానవలి' బరగు
హరిరూప తవకింకరోఽహంబు 'లుప్త వి
సర్గక వళి' సంజ్ఞ సరవిఁజెందు
శివకోటిసంకాశ కృష్ణాంబుదశ్యామ
ఋభురాజవరద హే కృష్ణ యనఁగ
సరగును 'ఋత్వసంబంధ విరామంబు'
పృథ్వీశనిర్మలాకృతివిశేష
యనఁగను 'ఋత్వసామ్యవళి' దనర్చు దై
త్యోగ్రభంజన విబుధౌఘరక్ష
ఋభురాజపోష లోకైకవీర యనంగ
'వృద్ధి విరామంబు' వెలయుచుండు
కంధరనిభదేహ గరుడవాహ రమేశ
యన 'వర్గ యతి' పెంపుగొనుచునుండు
జ్ఞానవేద్యాయ కాంచననిర్మితభూష
ణాయ సచ్చిలకంత ప్రియాయ
యన 'బిందు యతి' వేడ్కమును నిర్మలజ్ఞాన
విహార వికారదూర ?
యన 'విశేషవిరామ' మనువగు సుగుణ సం
పూర్ణ వందితసురముఖ్య యనఁగ
'ము విభక్తి యతి' యగు మొసకొని దైత్యవి
మర్దన లోకసంరక్ష యనఁగ
నంతస్థలూష్మంబు లన్నిటికిని తోరి
నెఱమున్నలబ్ధిన నిశ్చయముగ
వలనొప్పనది యె 'సువర్ణవిరామంబు'
నగు కృష్ణపాదతోయరుహమనఁగ
'ఋజాయతి' వాటెల్ల నెలమి నిస్సులు దేరు
సది రమాధవు చేతి యదియనంగ
దివ్యారిశౌరిచేతిది యనిపల్కను
'ప్రత్యేక యతి' యగు ప్రాకటముగ
రిపులను చక్రి హరించె ననఁగ లచ్చి
నెడ(ద)శౌరి తగ ధరియించెననఁగ
'భిన్నయతి'యు నగు ప్రియముమీర ముకుంద
రార సద్రప్వసర రవ్వశేల
యన 'పేకతరయతి' దనరు దేవాధిప
వరద సంతతభవభయవిదూర
యన 'సభేదవిరామ' మమరు నీకునే
కాంతమేలర జవరాండ్రతోడ
యన 'రాగసంధియతి' యగు చెలులకు
కృష్ణుఁ డిచ్చె నాలుగేసి మణులు
యింతులకును దోసెడేసి వరాలన
నగు 'విభాగి విరామ'మనని వేంక
టప్ప రా చలమేల ననఁగ 'నాహాఖండ
వళి' మోదములరు భూమి యమునను
గణుతింప రఘుపతి కంటె దైవములేఁ
డన 'పంచమి విభక్తి యతి' దనర్చు
మానితజలదసమాంగ యనంగి 'న
ఖండ విరామంబు' ఘనతగాంచు
అంగజజనక సంప్రాప్తమనోరథ
యని పల్కఁగను 'ప్రాదియతి' దనర్చు
నవనీతచోర న వ్యాపవే యనివేడ
'సంయుక్త విశ్రామ' సంజ్ఞ దనరు
తపసుల కెంగేల దాల్చుట నీ సమం
ధరను పలాశదండంబనంగ
సరవి సమస్వరసంబంధయతియును భం
డనభీమ లలితమానస యనంగి
'సమువాసిక విరామ' మొసరు వేడుక యుష్మ
దభిమతం బెఱిగింపు మటులఁ జేసు

దయసేయు పర మస్మదన్వయాళుల బ్రోతు
వనుచు చేర్పడిన యచట 'నుభయ
వళి' యన నొప్పారు నిల దీనజనుఁడ జాం
డో నన్ను బ్రోవరా యో మహాత్మ
లారన 'కాకుస్వరోరుప్లుతం' బగు
నిక్కమైన కదలిరావే రమేశ
వోహరులనఁగను 'శోకప్లుతం'బగు
నోపిక లున్నరారో జనంబు
లెల్లరంగేశ్వరు మెల్లంపు బ్రోల్గన
ననఁగ 'నుత్కర ప్లుతా' ఖ్యం దనర్చు
నచ్యుతచరణపద్మా యని బల్క 'దూ
రాహ్వానమనెడి ప్లుతా'హ్వయంబు
హరి నన్నుగావరావా యన 'సంశయ
ప్లుతము' రాజిల్లు విశ్రుతముగాఁగ
వివిగాఁక కోరమాలు నవియేవిధములన్న
నలివాక్ష సుగుణావతంస యనఁగ
తోయజనాభ వేడుకగాగ నన్నుఁ బ్రోవు
నరవి రక్షించు మహానుభావ
మదనాగభంజన వాసవస్తుతపాద
యనెడి యీ నాల్గు యతులు గినఁగ
'వర్గాహ్య విరమణ' 'అగ్రాహ్యవర్ణస
ముష్టయ విరతు' లెంతేఁ దలంప
వర్గాహ్యవర్ణ భేద ములఁ గాఁగ న
ల్పది యొక్క యతులు సమ్మదము మీరి
పూర్వకవి లక్ష్యలక్షణముల గణించి
నయము మీరఁగ చిఱుమఱ్ఱి నారసింహ
కవి రచించెను లోకోపకారముగను
పతితపావన కంపాలపలి రమేశ[7]

5. ఉభయవళులు

ధరణీశ గోత్రభిన్మణిసన్నిభ శ్యామ
నాగారిగమన సన్మాన్యచరిత
దళితదైత్యోగ్రవేదండరాట్పోషణా
హ్లాదవిరోధివేదండసింహ
రమణీయరూపసారంగాంకసమ
ప్రదనార్తశరణ్య సారంగశయన
శ్రీ లోకరక్షణపాకరాడ్భంజన
నాగేంద్రశయన పనాకపాల
నానార్థవేద్య జనార్దన నరకసం
హరణ ముకుంద జనార్దనాఖ్య
తాపసవరద మార్తాండసంభవపోష
హతపరానీకమార్తాండరుచిర
ద్వీపవప్రస్థ సుపర్వవందిత సార
పేక్షణ పుష్కరద్వీపకలిత
ఆగమసర్వపదార్థజ్ఞ నిత్యద
యాకర సర్వపదార్థదాయి (?)
అఖిలేశ దానమందార పాతకదూర
దనుజవిధ్వంస మందారహార
రాజితానందనారాయణ గోపిక
న్యామనోహై(క్షై)కనారాయణాఖ్య
యనఁగను శివునకన్యోన్యమిత్రుఁడు శౌరి
నోమిన ఫలము లన్యోన్యమయ్యె
నోరోరి హరిని యన్యోన్యభక్తిఁదలంపు
మనఁగను వినుఁ హరి ద్వారపాలుఁ
డధికుఁడటన్న వెయ్యంబు మీరగ బహి
ర్ద్వారంబు మించుటద్దములను బూన్చు
చెలు వన్న ముదిత మంజీరవిలాసంబు
హితవయ్యె శౌరి మందిరలీల
తగ మమ్ము బ్రోచుగదా యన భువిలోన
నధికమై యొప్పె రామాయణంబు
భావితంబయ్యె రామాయణ కావ్యంబు
హరి మనంబెన్న శుద్ధాంత వీథి
దాలగునట్టి శుద్ధాంతరగ్రహంబులు (?)
వెలువడు రారాద నెలఁత లనఁగ
అన్యసంగతి నిజప్రాంతంబు కడద్రోయు
రాజిల్లు కావన ప్రాంతభూమి
భానుల కిరవని మలయుటలెల్ల న
వ్వులు హల్లులందుఁ జెందవలరు విరతు
లతుకునని వెయ్యమున శకంధ్వాది శబ్ద
విరతు లీ క్రియ దెల్పగ మతి వరంగ
భవ్యమణిహారి కంపాలపలి విహారి
రాక్షసమదాపహారి శ్రీరంగశౌరి!!

6. ప్రాసలు

సీ. జలజాక్ష గురులఘువుల లోన నెయ్యరి
తొలిపదంబున మున్ను దోచునదియె
సిమ్మటఁ గదియుంప నిమ్మగు కనకాద్రి
ధీర పద్మాక్ష మందార యనఁగ
నెస క్రిందుబడ్డలు బిరుదసున్నలు మూఁడి
ప్రాసంబులందు వేర్పడియె నవి
హ్రస్వమొక్కటి దీర్ఘమగునక్కరంబొక్క
టియు గార్వమ్ము నిశ్చయముగాను
దంతిరాడ్వరద హే శాంతమానస విశా
లాక్ష చంద్రానన పక్షిరాజ
గమన యనఁగ చాకాటంపు మేస్సలి
నకిలులబ్బుటకన్న సుకృతమెద్ది

---

7. పా. పాపగణనాశ కంపాలపలి రమేశ.

గురుడ వంగను వెల్లఁ గడు'వడి ప్రాసంబు',
    వీఁకచే దనుజుల మూఁకదార్చి
నచ్చుతుఁడున నొప్పు "వర్ణబిందు ప్రాస"
    మింద్రుండు నద్భుతపాంద్రుఁ డనగ
నటు "సంయుతాక్షరప్రాసంబు" వాటిల్ల
    కవులకు చెవికి జా గిపువనంగ
క్షత్రియకులుఁడు మాంధాతృడనంగ "రే
    ఫల్లిన్నమను ప్రాస" పరిఢవిల్ల
లోకాధినాథ భాషా క్లిష్టి (క్లు) క్లిష్టయన "లకా
    రల్లిష్టమను ప్రాస" రహి బొసంగు
సంగ్రామమందు వింతం గ్రుమ్మరుచు నుండు
    చెనఁటుల హరి గోరజీరె నవఁగ
తతమైన "రేఫయుతప్రాసము" గు చుండు
    హాజ్ఞా (జ్ఞా)గధర రోషాగ్నివిజిత
దనుజకానన యన దగు "వికల్పప్రాస"
    మిషువు సుమంబన బొసఁగె మరుని
కనఁగను కౌస్తుభమణి దల్పహారియనఁ
    గను "ఉభయప్రాస" మొనరుచుండు
మిన్నేటితండ్రి ధాతన్నాభిజనింప
    చేసెనటన్న మచ్చిక బొసంగు
'ననునాసికప్రాస'మగుచుండు దైత్యుల
    నటుచేత విదళించి యటుగ జేసె
వారి సోదిమి శౌరి భళి యనంగను 'ఋకా
    రప్రాస'మమరు తోరము గణించి
రార గోపాంగనాజార యనంగ "రే
    ఫ ప్రాస" మిద్ధరఁ బరగు చుండు
బంధురదానవప్రాగ్వంశభేదన యన
    బరగు "సవర్గజ ప్రాస"మనఁగ
సారమౌ వచనంబుచే బుధుల్పచరింతు
    రనిన "బుప్రాస"మై ఘనతఁ గాంచు
వాయుజదండ్రి లోఁ బాయక కీర్తించె
    ద మటన్న 'లఘుయకారమను ప్రాస'
కరితావ్యపరకజదళనేత్ర యనఁగ 'వ
    భేదమౌ' ప్రాసంబు పేర్మిఁ దవరు
పవిచేత జిష్ణు మొత్త నగర వను చోట (?)
    'సంధిగత ప్రాస' సంజ్ఞ బొసరు
పుష్కరచరనుత ముష్కరారివిదార
    యనుటను 'దుష్కరప్రాస'మయ్యె
  దరము గళమ్ము సుందరము నెమ్మోమన
    "త్ర్యక్షరప్రాస" మొయ్యన దనర్పు
వీరుఁడు కనకాద్రిధీరుఁడు కరుణార
    సాంబుధి యన 'చతుష్ప్రాస'మయ్యె
నిండుపున్నమనాటి చందురుతోఁ జింది
    య్యైన మోమున నొప్పు 'పంచషష్ఠ
మలరు ప్రాసంబు' గాన ప్రాసాన్వితంబు
శతవింశతి భేదంబు లెరుగ వలయు

భవ్యమణిహారి కంసాలవని విహారి
రాక్షసమదాపహారి శ్రీరంగశౌరి॥

## 7. శబ్దములు

చంద్రుండు కృష్ణుం డుపేంద్రుఁడు పురము కా
    ననము సముద్రము వన మనంగ
ప్రథమావిభక్తి నై డుము లిప్పి ళ (?)
    ల్పమములవన్ ప్రశస్తము వహిల్ల
సంస్కృత ప్రాకృత జనితంబులై కొన్ని
    పదములు తద్భవ పదము లయ్యె
చంద్ర శబ్దమునకు చందురుండగు నది
    సంస్కృతజనితమై జాతి బరగు
చందయనంగ నెంచందగు ప్రాకృత
    జనితంబటంచు రసాతలమున
నిది పూర్వకవుల కొప్పిదములేదు దలంప
    చందురుండన పల్కుజాలి రెందు
వరగ సముద్ర శబ్దమునకు సంద్రంబు
    ప్రథమప్రకృతిగాఁగ బరఁగుచుండు
లక్ష్మికి లచ్చి మొల్లంబుగ ప్రాకృత
    తజ్జపదంబుగు తలంచిమాడ
లకిమి యనఁగ నొప్పు లాలితంబని మహా
    కవులు కావ్యమునందు గాంచరైరి
శౌరశివి జనింపజాలె ద్యూతమునకు
    జూదంబు చూళికచే దనర్చె
రావకోలంబు తోరముగ నై శాచివి
    సానముయ్యెను మూగి పరభోగన వ
పభ్రంశోక్తిని వరగె మాగధి జక్కు
    లయ్యె నివ్విధమున నష్ట భాష
లందు తద్భవపంక్తి యుదిగాక హరుఁడు క
    రమ్ము శరమ్ము సరమ్ము మొదలు
ప్రాపించు ప్రథమా విభక్తులు హరిఁగూర్చి
    యనెడి ద్వితీయ రంజనము నింపు
నంత కానంతవన్నలరెడి కించి ద
    ర్థములు భళీ యన దనరునట్టి
గొనియాట అద్భుతం బనెడి యూశ్చర్యార్థ
    ములును సంతాపార్థములు గణింప
నప్పు డెప్పు డటన్న యా యర్థయుగము చే
    మను వాక్యములు కళాప్రకృతు లయ్యె (?)
వీవి నైని న కార మానదు జతలైన
    పాటిల్ల కడను విభక్తులెల్ల
నాగి ద్రుతప్రకృతులై బొఁడొందువానిపై
    ని నకారములు దేవ బొసరుచుండు
నవ్యయంబులు లిజంతాది సుప్రత్యయం
    బులు మరి ప్రత్యయంబులు తుమునులు
జొరవు తెనుంగునఁ బరగించిరేవి యం
    దున వను వాక్యంబు గొని వచింప

**కలగూరగంప:**

# మన పద్యముల వర్గీకరణము-ముత్యాలసరమునకు మూలము

శ్రీ వి. రాజగోపాలరావు

ఏ శాస్త్రమునందైనను ప్రయోగింపబడు పారిభాషిక పదములు ప్రతియొక్కటియు నొక ప్రత్యేకార్థమును సూచించును. వాని యర్థము గుర్తెరిగి సందర్భయుక్తముగ నుపయోగించినపుడే అవి శోభించును. లేనిచో నవి వ్యతిరేకార్థ ప్రతిపాదకములై అర్థవిపర్యాసమునకు దారితీయును. భారతిలో ప్రకటింపబడిన లేఖలలో గురుజాడవారి ముత్యాలసరములకు మూలమునుగూర్చిన జిజ్ఞాసయం దిట్టి వైఖరి గోచరించుటచే కొంత సమగ్రావలోకన మావశ్యకమను భావము పొడమి కృషి యొనరింపగా ఈ వ్యాస మేర్పడినది.

ఛందశ్శాస్త్రమునుగూర్చి ఆంధ్రులు మిక్కిలి పరిశ్రమించి దానిని వృద్ధి యొనర్చినారు. సంస్కృతమునందలి ఛందోరీతుల గ్రహించియు, ఆంధ్రమునగలవానిని మెరుగుపరచియు ఈ శాస్త్రమును వారు పరిపుష్ట మొనరించిరి. వివిధములగు పద్యముల వర్గీకరణమునందును, లక్ష్యలక్షణ నిరూపణములందును యుక్తమగు శాస్త్రీయ దృక్పథమునే అనుసరించిరి. నన్నయభట్టు, భీమన, పెద్దన, తాతంభట్టు, అనంతుడు, తిమ్మరాజు మున్నగు ఛందశ్శాస్త్రవేత్తల తర్వాత వచ్చిన అప్పకవి వారి వారి గ్రంథముల పరిశీలించి అప్పకవీయమును వ్రాసెను. అందు పద్యము, వృత్తము, జాత్యుపజాతులు ఇత్యాది పదములకు చక్కని వివరణము లొసగినాడు.

సంస్కృతమున ఆదికవి వాల్మీకి రామకథను రచించెను. 'కొంగిను నిషాదుడేయ కన్గొని వామలూరుభవుని శోకంబు లకార సహితమై యది శ్లోకమయ్యె, పద్యంబునంద్రు దాని కొందరు నాల్గు పాదముల కతమ.' ఇట పద్యము నాల్గుపాదము కల్గియుండ వలెనని భావమున్నది. త్రిపురాంతకోదాహరణమునకు టీకలో ప్రసిద్ధ పరిశోధకులగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు 'తెలుగు కవిత ఏకపదమై, ద్విపదమై, త్రిపదమై, చతుష్పదపరిణతి చెందినట్లు కానవచ్చుచున్నది.' అని యభిప్రాయపడిరి. సంస్కృత ఛందస్సంజాతములగు శార్దూలాదివృత్తములును నాల్గు పాదముల కల్గియున్నవి. కావున నాల్గు పాదములు గలదియే పద్యమనుభావము అనుశ్రుతముగా నేర్పడినట్లు తెలియుచున్నది. కాని యిచ్చట చిక్కు నాల్గు పాదములు గలదే పద్యమనుట. నాల్గుకన్న తక్కువ లేక ఎక్కువ పాదములు కల్గిన వాని నేమన వలెను? ద్విపద, త్రిపద, పంచపాది, షట్పదియను నామములు గలవు. కాని ఎన్నియున్నను పాదములు కల్గిన దానిని పద్యమనుట తప్పు.

పద్యపాదములు గణనియమమును కల్గియుండును. గణము అక్షర నిబద్ధములు మాత్రానిబద్ధములని ద్వివిధములు. అక్షర గణములందు య, మా, తా, రా, జా, భా, న, స, ల, గగములను నివర్గ గణములును, సూర్యేంద్ర చంద్రగణములును చేరియున్నవి. ఈ గణనియమమునందలి వైవిధ్యముచే వివిధ పద్యము లేర్పడి వర్గీకరణ మావశ్యకమైనది.

పద్యసమితి వృత్తములు— జాతు లను రెండు వర్గములుగ విభజించుట పరిపాటి. వృత్తమను పదమును సంస్కృతచ్ఛందస్సంజాత పద్యముల కుపయోగించుట కానవచ్చును. కాని ఆంధ్ర ఛందస్సంప్రదాయికములగు జాతి, ఉపజాతులను సైతము వృత్తము లనవచ్చును. సంస్కృత ఛందస్సంజాత వృత్తములు నివర్గగణములను మాత్ర మొక నియమప్రకారము కల్గియుండును. జాత్యుపజాతులు సూర్యేంద్ర చంద్రగణముల చేతను, మాత్రలచేతను జరుగును. వీనియందు గణనియమమే కాని అక్షర సంఖ్యానియమము లేదు. సంస్కృత ఛందస్సంజాత వృత్తములకు గణనియమమేగాక అక్షర సంఖ్యానియమముండును. జాతులయందు ప్రథమపాదముఖమున గురులఘువులలో నెయ్యది నిల్చునో అదియే తక్కిన మూడు పాదములమొదట నుండవలెను. ఉపజాతులం దీ నియమము లేదు. సంస్కృత ఛందము ననుసరించి సాధింప వీలగు వృత్తములు సంఖ్య 13,42,17,726.

జాత్యుపజాతులు మాత్రాగణ నిబద్ధములై, దేశభాషా సహజములై, ఆంధ్ర ఛందస్సంప్రదాయికములై పదకవిత లేక దేశికవిత లనబరగుచున్నవి. అక్షరగణనిబద్ధములై సార్వదేశికములై సంస్కృత వ్యాకరణ ఛందోనువృత్తములు మార్గకవిత లేక పద్యకవిత లనబడుచున్నవి.

పద్యములు
లేక
వృత్తములు

**సంస్కృత చ్ఛందస్సంజాతములు**
(అక్షరగణనిబద్ధములు
విసర్గగణబద్ధములు)
పద్యకవితలు
శార్దూలాదులు— దాక్షిణాత్య
లెక్కువగ నుపయోగించిన
మత్తేభ చంపకోత్పలములు
మొదలగునవి
ఇందుచేరును.

**ఆంధ్రచ్ఛందస్సంప్రదాయికములు**
(మాత్రాగణ నిబద్ధములు
సూర్యేంద్ర చంద్ర గణబద్ధములు
పదకవితలు

పాదముఖమున గురులఘువుల
నియమముగలవి

**జాతులు**
- షట్పదకందములు
- ఉత్సాహము
- తరువోజ
- పంచవిధాక్కరలు
- మంజరి
- ద్విపద
- త్రిపద
- చతుష్పద
- పంచపాది
- షట్పది
- రగడలు
- కళికలు
- ఉత్కళికలు.

పాదముఖమున
గురు లఘువుల
నియమములేనివి.

**ఉపజాతులు**
- నవవిధ గీతములు.
(ఆటవెలది, తేటగీతి
మొదలగునవి
- సీసపద్యకము.

కావున వృత్తమను పదము నేపద్యమునకైనను ఉపయోగింప వచ్చును.

## ర గ డ లు

ఇవి మార్గకవితానుయాయికములు. జాతులలో చేరినవి. ఇవి తాళాంగప్రధానములు. అందు చతురశ్రత్ర్యశ్రమిశ్రజాతులు ప్రకటితములగుచుండును. రగడకు రఘుటయని భరతుని నాట్య శాస్త్రమున ప్రవంచితమైనది. అంతమాత్రమున నివి సంస్కృతమునుండి వచ్చినవికావు. ఈ ప్రవంచితము తెల్గునకుగల సంస్కృతసంపర్కమును తెలియజేయును. రగడలు జాతీయ వాఙ్మయమునకు చెందినవి. ఇట్లు శ్రీ విశ్వనాథవారు బాగుగ వర్ణించిరి.

రగడలు వైతాళీయ భేదముచే అనేక విధములైనవి. అందు నవవిధ రగడలు ప్రసిద్ధములు. వానిని కొంత కొంత మార్చి 'యక్షగానము'ను లఘుప్రబంధముల నుపయోగించు త్రిపుట, జంపె, అట్టెర, ఏల, అర్ధచంద్రికలను తాళములను పాడింపవచ్చును. కళికలు, ఉత్కళికలు రగడ భేదములు మార్గములుగా నేర్పడినవియే. వానికి ప్రత్యేక ప్రతిపత్తి లేదు. అందుచే రగడలు, కళికలు, ఉత్కళికలు, త్రిపుట, జంపె, అట్టెర మున్నగు తాళములు అన్నియు గలసి 'రగడలు' అను వొకే కుటుంబమునకు చెందిన వనుట సమంజసము. అప్పకవి చూపిన కళికలు, ఉత్కళికలు, మాత్రలుగ విశ్లేషించిన వానికిని, రగడలకును గల సామ్యము తేటతెల్లమగును.

| రగడలు | పాదముల సంఖ్య | ఒక్కొక్క పాదమున మాత్రలు | కళికలు (8 పాదములు గలవి) | ఉత్కళికలు (4 పాదములు గలవి) |
|---|---|---|---|---|
| హయప్రచారము | 4 | 12 | — | — |
| తురగవల్గనము | 2 | 24 | 28 | 28 |
| విజయమంగళము | 4 | 24 | 20 | 20 |
| ద్విరదగతి | 2 | 20 | 24 | 24 |
| విజయభద్రము | 2 | 40 | 32 | 32 |
| మధురగతి | 4 | 16 | 20 | 20 |
| హరిగతి | 2 | 32 | 24 | 24 |
| హరిణగతి | 2 | 14 | 16 | 16 |
| వృషభగతి | 2 | 28 | 20 | 20 |

కావున కళికలకు, ఉత్కళికలకును ప్రత్యేక ప్రతిపత్తి లేదని తెలియుచున్నది. అవి రగడ భేదములు మార్గములుగ నేర్పడి నట్టివి. త్రిపురాంతకుడును తన ఉదాహరణ కావ్యమున వృషభగతి, విజయభద్రము, హయప్రచారము, జయభద్రము అను రగడలనే కళికలు, ఉత్కళికలుగ వాడి యుండెను.

## ఉదాహరణము

ఉదాహరణమునదొక నియమగు వృత్తము కాదు. అది యొక లఘు (క్షుద్ర) ప్రబంధ రచనా రీతి. అందు వృత్తము, కళిక, ఉత్కళిక అను మూడు భాగము లుండును. కాని ఉత్కళిక కళిక యుందలి భాగమే యగుటచే రెండుభాగములనియే చెప్ప వచ్చును. ద్విపదలు, యక్షగానము, శతకములు, గేయములు మున్నగు కావ్య భేదములలో చేరినవి ఉదాహరణములు. ఏక పదములగు పాటలు, ద్విపదములగు ప్రబంధములు, త్రిపదాది సంయుక్త యక్షగానములు వాఙ్మయ వీథిని ప్రథమ, ద్వితీయ, తృతీయ ఘట్టములు. ఉదాహరణములీ తృతీయ ఘట్టమున చేరును. ఇవి ద్విపదాదుల వలె నొకవిధమగు ఛందస్సుతోగాక పదకవిత యందలి ఛందో విశేషములను కల్గియుండును. సంస్కృతమునను ఉదాహరణములు కలవు. 'జయోదాహరణం' 'ప్రతేవిశేతముదాహరణం ప్రియాయు' అని కాళిదాసు రఘు వంశమున పేర్కొనెను. ఇవి శ్రీ నిడుదవోలువారు త్రిపురాంత కోదాహరణమునకు తమ పీఠికలో పేర్కొనిన అంశములు.

ఉదాహరణమునందు సప్తవిభక్తులు మఱియు

| | |
|---|---|
| సంబోధనా విభక్తితో కూడిన | 8 వృత్తములు |
| ప్రతి పద్యమునకు రగడ భేదములు | |
| మార్గములుగా కళికలు | 8 |
| కళికలో సగముగా నుత్కళికలు | 8 |
| సార్వ విభక్తికము | 1 |
| సమస్తసమర్పణము | 1 |
| మొత్తము | 26 |

పద్యము (వృత్తము) లుండును.

## గురుజాడవారి ముత్యాలసరము

ముత్యాలసరములకు మూలమును గూర్చి శ్రీ గురుజాడ అప్పారావుగారే తమ వ్యాసములో నేమనిరో గమనింప దగినది. 'ముత్యాలసరములలో నే జేసుకొన్న నియమమిది. మొదటి మూడు చరణములలోను పద్నాలుగేసి మాత్ర లుండును. నాలుగో చర ణమున ఏడు మొదలు పద్నాలుగు వరకూ వుండును. విరామమును అర్థానుసారముగా మార్చ యత్నించితిని.' (గురుజాడ వ్యాస చంద్రిక, పుట. 24). అందుచే ముత్యాలసరములు 14 మాత్రల గల హరిణగతిరగడకు సన్నిహిత మగును. ఇచ్చట గమనార్హమగు నొక విశేషము గలదు. మాత్రలు సమసంఖ్యలో నున్నను, వాని నుపయోగించి ఏర్పరచు గురులఘువుల ప్రయోగమును బట్టి ఆయా వృత్తముల నడక మారుచుండును. ఈ క్రింది వానిని పరిశీలింపదగును.

### హరిగణతి రగడ

| | |
|---|---|
| వరహార పదియు నాలుగు లఘులు | (14) |
| కరియుతి హరిణగతికి నెంపులు | (1౽) |

### గురుజాడ 'ముత్యాల సరము'

| | |
|---|---|
| దేశమంటే మట్టి కాదోయ్ | (14) |
| దేశమంటె మనుజులోయ్ | (14) |

### శ్రీశ్రీ గేయాలు

| | |
|---|---|
| ఆనందం అర్ణవమైతే | (14) |
| అనురాగం అంబరమైతే | (14) |
| ఏదేశ చరిత్ర చూచినా | (14 |
| ఏమున్నది గర్వ కారణం | (14) |

కాని శ్రీశ్రీ తన గేయాలకు నామకరణం చేయలేదు. కొన్ని గేయాలలో మాత్రా సంఖ్యా నియమం పాదములకు మారుచున్నందుచే అట్లు చేయుట కష్టము కూడ. పైగా శ్రీశ్రీ ఛందో బందోస్తులను త్రెంచదలచినాడు. గురు జాడ అట్లుగాక ఒక నియమమును ముందే ఏర్పరచుకొని ఆ ప్రకారముగా రచన సాగించినాడు.

ఇక పార్శీ గజలుకు ముత్యాలసరాలకు గల సంబంధం గూర్చి శ్రీ గురుజాడ వ్రాసుకున్న మాటలివి. "ఒక జాతి పార్శీగజల్ నడక ముత్యాలసరములలో తెచ్చుటకు యత్నించి తిని." పైన పేర్కొనబడిన శ్రీశ్రీ గేయాల నడకను, ముత్యాల సరాల నడకతో పోల్చి చూచినట్లైతే 'శ్రీ గురుజాడ వారి మాటలు బాగుగా మనమకు వచ్చును. మాత్రల సంఖ్య ఒక్కటే అయినా ఆయా గేయాల నడకలో ఎంతటి భేదం ఉన్నదో గమనింప దగిన విషయం.

ఈ సందర్భమున 'గురుజాడ ముత్యాలసరము'లకు పీఠికలో శ్రీ వాసిరెడ్డి భాస్కరరావుగారు వెలువరించిన అభి ప్రాయం ఉల్లేఖింప దగియున్నది. 'ఈ మహాకవి ఆంధ్రభాషకు ముత్యాలసరం అనే ఛందస్సు ప్రసాదించారు. వసుచరిత్రాది ప్రబంధాల్లో వాడబడిన

బాల బాలరసాలమిది పిక
పాలి పాలిటి యమర సాలము
గేలి గేలిడి గ్రుచ్చు గడు రా
గిల్లు గిల్లుము శత్రువాలము.

లాంటి వృషభగతిరగడలో నాలుగవ పంక్తిలో కొన్ని మాత్రలు తగ్గించిన ఈ ఛందస్సు ఏర్పడును. 'గుమ్మ డేడీ గోపి దేవి' లాంటి పాటలు ఇంతకు పూర్వమే ఉన్నా దీనిని ప్రచారంలోకి తెచ్చింది గురుజాడవారే.

వృషభగతిరగడ పాదము హరిణగతి రగడ పాదమును రెట్టించగ నేర్పడును. ప్రతిపాదమున 28 మాత్రలుండును.

శ్రీ ఉమాకాన్తంగారు తమ 'నేటి కాలపు కవిత్వం' అను వాఙ్మయ పరిశిష్ట భాష్యమున (31 పుటలో) ఇట్లనిరి: "భారత రామాయణాల్లో లేని రగడలను పెద్దన వాడినాడు. అప్పకవి కలిక, ఉత్కలిక— నవ విధ రగడలు మొదలగు లయతాళ సమన్విత రీతుల నెన్నిటినో చెప్పినాడు. ఈ తీరున దరువులు, విరువులు చిరకాలంనుండి ఉన్నవి గాని కొత్తవి గావు. వీటిలో గురుజాడ అప్పారావు 'కన్యక' అనే ఖండ కావ్యపు వృత్తానికి ఉత్కలిక మూల మనదగినది."

శ్రీ ఉమా కాన్తంగారు 'కన్యక' అనే ఖండ కావ్య వృత్తానికి మూలం ఉత్కలిక అనిరి. కాని ముత్యాలసరములకు మూల మే యుత్కలికయో, ఎన్ని మాత్రలు గలదియో వివరించరైరి. 'కన్యక' లో శ్రీ గురుజాడ ఎక్కువగా వాడినవి ముత్యాలసరములే.

కావున ముత్యాలసరమునకు నియమమేర్పరచుకొనుటలో శ్రీ గురుజాడవారు పద్నాలుగు మాత్రలు ప్రతిపాదమున గల హరిణగతి రగడ (దాని మార్గమున నేర్పడిన కలిక లేక ఉత్కలిక) మరియొక విధముగ పేర్కొనజాలక, ఈ రెంటి చేతను ప్రభావితులై యుండి యుండవలెను. ఇట్టి స్వతంత్ర ప్రతిపత్తి లేని ఉత్కలికను ముత్యాలసరములకు మూల మనుటకన్న హరిణగతి రగడ వారి నిర్మాణమున మార్గదర్శకమై యుండుననుట యుక్తము. ఉత్కలిక యనిన ఏ ఉత్కలిక? ఎన్ని మాత్రలు గలది? అను ప్రశ్న ఉదయించును.

---

ఆధారములు: 1. త్రిపురాంతకోదాహరణము 2. గురుజాడ వ్యాస చంద్రిక 3. నేటికాలపు కవిత్వము 4. అప్పకవీయము.

# లేఖలు

## కృష్ణాజిల్లా రచయితల సదస్సు

ఆర్యా,

కృష్ణాజిల్లా రచయితల సదస్సులో పాల్గొనిన వారెల్లరు యువకులు—అన్నివిధాలుగా అవలీ రచయితల సదస్సు తిరుపతి సాహిత్య సభల వలె జరిగినది. భేదమొకటియే! తిరుపతి సభలలో నొకరీతి చర్చలు జరిగినవి. ఈ సదస్సులో ఆ మాత్రము చర్చలు కూడ జరుగలేదు. మరి జరిగినదేమి? వివరింతును.

ఈ సదస్సు ప్రత్యేకవర్గ దృష్టితో ప్రారంభమయినట్లు విజయవాడలో కొందరు భావించిరి. నిజము సదస్సు నిర్వహించిన వారికే తెలియవలయును. ఏ వర్గమునకు చెందని వారికి కూడ ఈ సదస్సులో అవకాశము లభించినది. నిర్వాహకుల మనుకొను వారు వారి నే దృష్టితో పిలిచిరో తెలియదు. ఒకటి మాత్రము నిజము. ఈ సదస్సును నిర్వహించు భారము వహించిన వారందరు విజయవాడ పత్రికలలో పని చేయువారే. ఇద్దరో, ముగ్గురో, యితర రచయితలుండిరి.

చదివిన వ్యాసములలో అనుపదమునందు ఆత్మప్రత్యయము అవసరమగుదానికంటె నెక్కువగా ప్రదర్శితమయినది. ఆత్మవిమర్శ శూన్యమయినది. శక్తియుక్తులు చూచికొని మాటాడుట శూన్యమైనది. వర్తకుడు సంవత్సరాంతమందు లాభనష్టములు జేరీజు చేసినట్లుగా, ఇంతవఱకు ఆంధ్రసాహిత్యము పోయిన పోకడలు మాత్రమే సింహావలోకనము చేయుటయినది. అయితే యీపని సమర్థులైనవారిదివఱకే చేసిరన్న విషయము తెలియనిదిగాదు.

ఇకముందు జరుగవలసినదేమి?

ఈనాడు రచయిత నెదుర్కొనుచున్న సమస్యలేమి? ఈనాటి సాహిత్యము ఒక ప్రమాణమునందుకొనుచున్నదా? రచయిత సమగ్ర జీవిత సాహిత్యానుభవము పొంది వ్రాయుచున్నాడా? ఈ నవీనయుగములో ఆంధ్రసాహిత్య స్థితిగతు లెట్లున్నవి? ఈ సమస్యలను గూర్చి చర్చింపలేదు.

దానికి కారణమొకటే. ఆ సమస్యలను చర్చించు శక్తియుక్తులు లేవు. లేవని యెవరయిన నన్నచో ఒప్పుకొనము. సాహిత్య సంస్కారమెంత? జీవితానుభవమెంత? యని ప్రశ్నించుచో, చెప్పుటకు సమాధానము లేదు. పోనీ, జిజ్ఞాసయున్నదా? లేదనియేసమాధానము. మరి మేము వేదిక లెట్లెక్కు చున్నారము? ఇప్పటికే యేదో కొంత వ్రాయుచున్నారము. ఆ యర్హతయే మాకు చాలును. ఏ పత్రికలో చూచినను మాపేరు లుండవా?

రవీంద్రుడు డొకచో వ్రాసిన యీ వాక్యములు గమనింపదగినవి. "The temptation of easy success lands one in serious difficulties, This leads to carelessness and carelessness is an insult to the goddess of art: she in her turn revenges herself by sending failure to the artist''. కాని ''carelessnes'' బాధ కల్గించుట లేదు. ఏలయన రాగద్వేషములతో,వర్గములతో నిండినది సాహిత్య ప్రపంచము. ఇందుచేతనే సంస్కారము పెరుగుట లేదని తెలియుట లేదు. యువకులకు పరిపూర్ణ సాహిత్యజీవిత సంస్కారములు స్వాధీనమగుటకు కొంతకాలము పట్టుననుమాట నిజమే. కాని సంస్కారము నింకను సంపాదించుకొనవలయునను జిజ్ఞాస యుండినగదా దానిని పెంపొందింపజేయుటకు ప్రయత్నింతుము! మొదటనే పరిపూర్ణుల మనుకొనుచున్నారము, నటించుచున్నారము, ఇంక సంస్కారము పెరుగుట యెక్కడ?

ఒక్క నరసింహారావుగారు చదివినవ్యాసమే పరిపూర్ణముగా నున్నది. వారు పత్రికారచన మననేమియో, అది యింతవరకెట్టి పరిణామము చెందినదో, యికముందు పత్రికారచనము శుద్ధముగా నుండుటకేమార్గము నవలంబింపవలయునో చక్కగా చర్చించిరి. అందువలననే వారి ప్రసంగము సదస్యులను ఆకర్షించినది. విశేషమేమనగా నరసింహారావుగారు ఆంధ్రపత్రికా ప్రపంచములో వచ్చిన, వచ్చుచున్న, రాదగిన మార్పులను కూలంకషముగా చర్చించిరి. మిగిలిన వ్యాసములు వారివ్యాసమువలె నున్నవని నికరముగా చెప్పజాలను.

ఈ నాడున్న రీతిగనే యికముందు కూడ యున్నచో తెలుగు సాహిత్యానికి భవిష్యత్తుండునని అనిపించుటలేదు. అసలు ఒక దర్శనము (vision) ఉన్నదా? యని యనుమానము. సాహిత్యమునుగాని జీవితమునుగాని తాత్త్వికముగా పరిశీలించు చున్నారమని చెప్పగలమా? లక్ష్యములేని, తాత్త్వికదృష్టి (Critical and Philosophical outlook)లేనినాడు ఏదో చేయగలమని భావింపవలదు. ముందు ఎవరయిన నిర్దిష్ట లక్ష్యముతో, సమగ్రజీవితానుభూతితో, తాత్త్వికచింతనముతో రచనలు చేయుదురేమో?అట్టి వారివలననే సాహిత్యము ముందునకు పోవును.ఈనాడు అటువంటివారిస్థాయి నందుకొనలేదని మాత్రము గట్టిగా చెప్పగలను.

"ఒక సదస్యుడు"

## వృత్తశబ్ద విచారం

ఆర్యా,

ఫిబ్రవరి భారతిలో స్వామినాథ శాస్త్రిగారు వృత్తశబ్ద విచారం కొంత చేశారు. (శిఖల్లో చివరిది). దాని మీద ఈ మాటలు చెప్పాలని తోచింది.

ఉక్తాది ఇరవయ్యారు ఛందాలనుంచి యేర్పడ్డవి వృత్తాలు, అక్షర గణ బద్ధమైనవి అన్నమాట. ఈ విషయాన్ని లక్షణ శాస్త్రకారులు "ముక్తకంఠముతో" చెప్పారని శాస్త్రిగారు ఒప్పుకున్నారు.

"పద్యం' అన్నది పాద వియతి గల దానికి అర్థం., ఇది సామాన్య వాచకం. దీని భేదాలు వృత్తం, జాతి. ఇవి విశేష వాచకాలు.

శ్లో. వృత్తం జాతి శ్చేతి
ద్వివిధం పద్యం, గణై ర్నిసర్గాఖ్యైః!
సంబద్ధం వృత్తం స్యా
దుపగణ మాత్రాభి రన్వితా జాతిః!!
(ఆంధ్రశబ్ద చింతామణి—అప్పకవీయ పాఠం)

జాతిపద్యాలు మళ్లీ రెండు రకాలు— జాతి, ఉపజాతి
రగడలు, కళికలు, ఉత్కళికలు గూడా —జాతిపద్యాలు.

సీ. "కందభేదములాఱు గాక నుత్సాహంబు
తరువోజ మధ్యమాక్కరలు నైదు
దీపించు మంజరీ ద్విపద త్రిపద చతు
ష్పద పంచపాది షట్పదవిధములు
తొమ్మిది విధములతో నొప్పు రగడలు
కళికలు నుత్కళికలును గూడ
జాతులు, నవవిధ గీతంబులును సీస
వృత్తకంబును నుపజాతు లయ్యె".
(అప్పకవీయం IV, 260.)

కాబట్టి "ఉత్కళిక" జాతి పద్యం, 'వృత్తం' అనరాదని లాక్షణిక సంప్రదాయం.

ఒకశాస్త్రంలో ఒక నిర్దిష్టార్థంలోనే ప్రయోగం ఉండే పదాన్ని "పారిభాషికం" అంటారు. ఆ పరిభాషా పదాన్ని నిర్దిష్టార్థంలోనే ప్రయోగించడం శాస్త్ర మర్యాద. తప్పినప్పుడు శాస్త్రార్థం అస్పష్ట మవుతుంది. నానార్థ నిఘంటువులకు ఇట్టి చోట్ల ప్రామాణ్యం చెప్పడం అప్రశస్తం.

మన ఛందశ్శాస్త్రాల్లో అవ్యవస్థ ఉన్నదనీ, దేనికదే ప్రామాణికమనీ, శాస్త్రిగారంటున్నారు. "ముక్తకంఠము"తో చెప్పినమాట అప్పుడే యేమైంది? తెలుగు ఛందశ్శాస్త్రాలు చాలా భాగం పద్య గ్రంథాలు కాబట్టి, గణ బంధాన్ని తప్పుకోడానికి వృత్త శబ్దం పద్యానికి పర్యాయంగానూ, 'ఛందస్సుకు' అర్థంగానూ వాడారు. అంతేగాని జాత్యుపజాతులకు వాడ లేదు. జాతిపద్యమైన "ఉత్సాహ"ను 'వృత్త' మన్నందుకు— ఛందశ్శాస్త్ర పరిశోధకులైన శ్రీ రావూరి దొరస్వామిశర్మ గారు ఇట్లా అంటున్నారు.

"ఉత్సాహము భీమ నాసంత చ్ఛందములలో వృత్తమని లేదు. కావ్యాలంకారచూడామణియందు, అప్పకవీయమందు నుత్సాహ వృత్తమని కలదు. కాని యిది వృత్తమెంత మాత్రము గాఁజాలదు." (సులక్షణ సారం, వావిళ్ల వారిది, 1962 సం.)

ముందు ఉదాహరించిన సీసం (260)లో అప్పకవి ఉత్సాహను జాతిగా చెప్పి, తర్వాత "ఉత్సాహ వృత్తము" (273) అన్నాడంటే అది ప్రమాదం. పరిశీలకులైనవాళ్ళ' ప్రమాదాన్ని ప్రమాణంగా స్వీకరించరు. తప్పు ఎవరు చెప్పినా తప్పే అవుతుంది. విచక్షణ గలవాళ్ళు సమర్థించరు. సవరిస్తారు. కాబట్టి ఉత్కళికను వృత్తమనడం పారిభాషిక దోష మౌతుంది.

ఇంకో సందేహం— "దండనాథ నిఘంటువులో" వారు ఉదాహరించిన వాక్యం ఉందా? అసలది ఎక్కడిది?"

దండనాథుని పూర్తిపేరు— "ఇరుగప" దండనాథుడు. అతడు రచించింది — సంస్కృతంలో "నానార్థరత్నమాల". దాన్ని సటీకగా వావిళ్ళవారు (1924లో) ప్రచురించారు. అందు "ద్వ్యక్షర కాండ" లో "తాంత పద వర్గంలో" వృత్తానికి నానార్థా లిట్లున్నాయి—

శ్లో. "వృత్తం స్యా ద్వర్తు లాతీత
దృఢేషు త్రిషు స ద్వయోః,
స్వరూపే చరితే పద్యే
జవనే వర్తనే౽ పిచ." (౧౯౧) 49 పు.

దీనికి టీక. "వృత్త" ఇది వట్రు వయిన దానికి, గడచిన దానికి. బటు వయిన దానికిని— నామమయ్యేని

॥త్రి॥ (త్రిలింగములందు.)
స్వరూపము,
చరిత్రము,
పద్యము,
వేగము,
జీవనోపాయములకును నామమయ్యె నేని
॥న॥ (నపుంసక లింగమందు)

మరి వారు చెప్తున్న పుస్తకం ఏదో?

ఒకరి పరిశీలనకు ఒకపుస్తకం సూచన చేసి నపుడు అదిమిక్కిలి ప్రసిద్ధమయితే సరేగాని, కొంచెం వెతుక్కో వలసిఁదై నపుడు వివరాలు సరిగ్గా ఇవ్వాలి. ఉమాకాన్తమ్ గారి పుస్తకం పేరు, పుట వగైరాలు గూడా స్పష్టంగా ఇవ్వ నక్కర్లేదా? అసలు ఉమాకాన్తమ్ గారి మాటనుసరిగా ఉటంకించారా?

"ఉత్కళిక గురుజాడ అప్పారావు కన్యక అనే ఖండ కావ్యపు వృత్తానికి మూల మనదగినది." అన్న గ్రంథస్థ వాక్యానికీ, "గురజాడ, ఖండకావ్య వృత్తములకు ఉత్కళికయే మూలము." అన్న ఉటంకింపునకూ, ఎంత భేదం ఉందో వ్యాఖ్యానించ నక్కర్లేదు.

సరైన పరిశీలన లేని ఇలాంటి మాటలవల్ల జిజ్ఞాసువులకు అనవసర శ్రమ తప్ప ఉపయోగంలేదని చెప్పడానికి బాధపడుతున్నాను.

—సులోచన.

## 'ఫస్టు కేస్' కథలో భాష

ఆర్యా,

నమస్కారాలు. ఫిబ్రవరి భారతి చదివాక, యీ పుత్తరం రాయాలనిపించింది.

టీనాదేవిరాసిన 'ఫస్ట్ కేస్'— యీ పుత్తరం రాయడానికి యేకైక కారణం. కథను గురించి కాదుగానీ, కథలోని భాషగురించి నా అభిప్రాయాలు తమకి నివేదించాలి. అదో ఫేషనూ, అందమూ అనుకున్నారు కాబోలు టీనాదేవి అక్షరాల మీద అక్షరాలూ, పదం మీద మరోపదం యెక్కించి వికారంగా రాశారు. మచ్చుకి కొన్ని కథమొదటిపేజీలో మూడో పేరాలో ఆఖరి పదం" "అమెరికన్ని"; అదేపేజీలో ఎనిమిదో పేరాలో "అతన్దగ్గరే"; కథ రెండో పేజీలో రెండో పేరాలో "అమెరికన్కారులో"; "సొదమెరికన్"మొ.. ఇలాంటి వికార ప్రయోగాలు ఇంకా వున్నాయి. వ్యావహారికాన్ని యథాశక్తి ఖూనీ చేస్తున్న యిలాంటి అసహ్యమైన విచిత్రపు పోకడలు యీ కథలో ఎన్నో వున్నాయి. ఎందుకంత శ్రమ పడాలి. ? శుభ్రంగా, సాధారణంగా "అమెరికన్ ని" అనీ, "అతని దగ్గరే" అనీ, "అమెరికన్ కారులో" అనీ రాయొచ్చుగా ? ఇలాగ ఒకదాని మీద కొకదానిని యెక్కించి, అక్షరాల్ని అవస్థ పెట్టడం ఎందుకు?

భారతి! చెప్పాలంటే—సాహిత్యసేవ అవిచ్ఛిన్నంగా, అర్థవంతంగాచేస్తున్న ఏకైక మాసపత్రిక, సాహిత్య మాసపత్రిక. భారతి—అంటే, నాకు ఎంతో "గురుభావం" వుంది. కథ సంగతి ఏమోగానీ భాషవిషయంగా, టీనాదేవి కథ నాకునచ్చలేదు. నా అభిమాన భారతి ధరించదగిన ఆభరణం కాదు. !

వ్యావహారిక భాషవిషయమై అనర్గళంగా జరిగిన చర్చలకి భారతి 'వేదిక'గా ఉపయోగ పడింది. పాఠ్య గ్రంథాలలో వ్యావహారికాన్ని వుపయోగించే విషయమై జరిగిన ఎన్నో వాగ్వివాదాల్ని కూలంకషంగా, పరిశీలనాత్మకంగా పరిష్కరించే ప్రయత్నం చేసింది. ముందు ముందు యీ విప్లవం వల్ల వ్యావహారిక భాష పాఠ్యగ్రంథాలకి ఎక్కితే, ఆ ఘనతలో భారతికి మొదటి వాటా వుంటుంది. వ్యావహారిక భాషని రచయిత లందరూ నిలబెట్టాలి. దాని స్థాయిని మరింత వుద్ధరించాలి. గ్రాంథిక భాషకున్నంత స్థానం దానికీ రప్పించాలి. అలా కాకుండా పైన వుదహరించినటువంటి వింత ప్రయోగాల ప్రయోగంతో, వర్తమానమౌతున్న వ్యావహారిక భాష గొప్పతనాన్ని కించపరచ కూడదు. ఎంత వ్యావహారిక భాష అయినా, దానికీ దాని పరిధులున్నాయి. ఆ మేరకు రచయితలు పోవాలేగానీ, అసహ్యమైన పోకడలు పోకూడదు. ఇలాగే రాస్తే—వ్యావహారిక భాష వున్న గౌరవాన్ని నిలుపుకో జాలదని, భాషాభిమానులు, ఎవ్వరైనా ఒప్పుకుంటారు. పైన వుదహరించిన పదప్రయోగాలు వ్యావహారిక భాషా ప్రవాహానికి అడ్డులేగానీ, ధారాళంగా, ఉత్సాహంగా పోవడానికి తోడ్పడవు.

దయచేసి ఇలాంటి కథల్ని, ఇలాంటి ప్రయోగాలున్న భాషని— భారతిలో వెయ్యకండి. ఇతర పత్రికల సంగతి వేరు.

—వక్కలంతం సూరి.

## "ఒక జిజ్ఞాస"కు సమాధానము

ఆర్యా,

ఫిబ్రవరి భారతిలో 'ఒక జిజ్ఞాస ' అను భాస్కరరావు గారి లేఖ గాంచిన పిమ్మట వారి కోర్కె మేఱకే క్రింది విషయము వ్రాయు కోర్కె గల్గుటచే వ్రాసి పంపుచున్నాను. భారతారణ్య పర్వమందలి మార్కండేయ చోదిత యుపాఖ్యానములందు 'ధర్మవ్యాధోపాఖ్యానము ,చక్కనిది.అందలి ప్రతివ్రతామణి కౌశికుడను బ్రాహ్మణునితో తాను బ్రాహ్మణ ప్రభుల మహిమల నెఱుంగుదునని కొన్ని గాథల దెల్పుచున్న సందర్భమందు ఒక సీసపద్యమందు ముగ్గురు మహనీయుల మహిమ తెలింగించుచు

"ఒక విప్రుడలిగి పయోనిధి జలము ల
పేయముల్ గాఁగ శపియింపఁ డెట్లు"

అని పల్కెను. అదే పద్యమందు నాల్గవ చరణమున అగస్త్య మహర్షి గూర్చి ప్రస్తావింపబడుటచే నాకు నాల్గేండ్ల క్రితము సందేహము జనించి పృచ్ఛఁజేసి క్రింది విధముగా గ్రహించితిని.

"ఉచథ్యుడను విప్రుడు సోముని యల్లుడు. యమునా నది కొకనా డితడు స్నానార్థమేగిన సమయమం దీతని భార్య సౌందర్యము గాంచి వరుణుడామె నెత్తుకొని పోయెను. నారదుఁడావిషయ ముచథ్యున కెరింగింప ఆ నారదునే వరుణునకు బుద్ధిఁ జెప్ప పంపెను. వరుణుడు నారద వచనముల లెక్కింప కుండుటచే యుచథ్యుడా వరుణనగరి కేగి యచట నీరు నింకునట్లు శపించెను. ఈతని ప్రభావముచే వరుణ నగరము ధూళితో నిండిపోయెను. అద్దాని గాంచిన వరుణుడు భీతుడై యా యుచథ్యున కాతని భార్య నొప్పగించెను" (భారతగాథ).

పేయము—నీళ్ళు, త్రాపదగినది (శబ్దార్థ చంద్రిక, శబ్దరత్నాకరము), పేయములు లేనివిగా—నీరు లేనివిగా, త్రాగుటకు పనికి రాని వగునట్లుగా, ఆపేయములను విథముగా చేసెను. ఇదే విషయము పూర్వ గాథాలహరి యందు గూడ వివరింప బడినవి.

—అవధానుల నారాయణ సన్యాసిరావు.

# గ్రంథ విమర్శలు

## భగవన్నామ సంకీర్తన

(కూర్పరులు: శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర సరస్వతిస్వామి. ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి. క్రౌను 1/8 పేజీలు 184, వెల: రు. 2 లు.)

సాధన గ్రంథమండలివారు సాధకుల ఉపయోగార్థము వరుసగా ప్రచురించుచున్న గ్రంథ పరంపరలో నిది యొకటి. ఇది ఈ గ్రంథమునకు సప్తమ ముద్రణ మగుటవలన ఎంత ఎక్కువగా ప్రచారములోనున్నదో స్పష్టపడుచున్నది. ఈ కూర్పులో నూతన నామములు స్తోత్రములు హిందీ కీర్తనలకు తాత్పర్యములు చేర్చుట విశేషము. కూర్పరులైన శ్రీ స్వామివారి త్రివర్ణ ముఖచిత్రముతో ఈ గ్రంథము జనాకర్షకముగా ముద్రితమైనది.

శ్రీ అవధూతేంద్ర సరస్వతిస్వాములవారు ఆంధ్రదేశములో సంకీర్తన రూపముగా ప్రచారము చేయుచున్న స్తోత్రములు 102 ఇందులో కలవు. అవి సంస్కృతములో కొన్ని, తెలుగులో కొన్ని, హిందీలో కొన్ని ఉన్నవి. వీనిలో కొన్ని మిక్కిలి ప్రసిద్ధమైనవి. ఎక్కువ భాగము మహాభక్తులు రచించినవి. "అన్నారా! విన్నారా! మీరూ.." వంటివి మాత్రము సినిమా పాటలను జ్ఞాపకమునకు తెచ్చుచున్నవానిని ఇందులో చేర్చకుండిన బాగుండెడి దనుట తప్ప, ఇందు చేర్చిన స్తోత్రములను గురించి ప్రత్యేకముగా ప్రస్తావింప నవసరము లేదు. ఇందులో చేర్చని ఉత్తమ స్తోత్రములు చాలా ఉన్నవి.

కాని శ్రీ స్వామివారు వ్రాసిన 'గమనిక' యందును, శ్రీయుతులు కుందుర్తి వేంకటనరసయ్య, బలుసు సూర్యప్రకాశ శాస్త్రి గారలు వ్రాసిన 'ప్రస్తావన' యందును, వ్రాసిన దెవరో తెలుపని 'కలౌ కేశవకీర్తనాత్', 'నామాపరాధములు' నామాపరాధములకు 'ప్రాయశ్చిత్తములు' అను శీర్షికలతో నున్నవాని యందును, కనబడుచున్న వాక్యములలోని కొన్నిటిని గూర్చి పేర్కొనుట తప్పనిసరి యైనది. అందులో ఒకవంక శ్రుతి స్మృతి సదాచారములను పాటింపవలెనని ఉద్ఘోషించుచునే, మరియొక వంక వానికి విరుద్ధమైన విపరీత విషయములు సూచించుటచే ప్రస్తావింపక తప్పుట లేదు.

శ్రీ స్వామివారు 'గమనిక'లో కలి సంతరణోపనిషత్తు నందలి 'హరే రామ హరే రామ' ఇత్యాది మంత్రమహత్త్వమును గూర్చి ప్రత్యేకముగా ప్రస్తావించియు, గ్రంథములో నెక్కడను దానిని చేర్చకపోవుట ఆశ్చర్యము కలిగించును. భగవన్నామ సంకీర్తనముల కెల్ల అది మూలసూత్రమను భావము కాబోలు, ప్రత్యేకముగా లేకుండుటకు కారణము!

"కొందరు 'హరే రామ' ఉపనిషత్తు లలోనిది గాన నామముగా గూడ జేయరాదు. అట్లు చేసిన పతితులగుదురని జెప్పుచున్నారు. కాని అటు చెప్పుట ఆత్మద్రోహము" అని 'గమనిక'లో తీవ్రమైన భాష స్వామివారు ఉపయోగించిరి. అందులోనే వారు మరియొకచో పంచాక్షర మంత్రమును, ప్రణవమును జేర్చి, హరే రామాదులు కొందరు ప్రచారము చేయుచున్న దానిని పనికిరాదని గర్హించిరి. ఇక ప్రస్తావన వ్రాసినవారు 'ఓంకారమును మహావాక్యములను గూడ భగవన్నామములే' అనిరి. గమనికలో నొకచో "భగవన్నామము లన్నియు ఉపనిషత్ప్రతిపాదితములే— మంత్రముతో ప్రణవము గాని, స్వాహా స్వధాలు గాని యున్నపుడే మంత్ర శబ్ద వాచ్యములు. అట్టివి యెన్నడును సంకీర్తనగా నుచ్చరింపరాదు....అట్టి మంత్రములను సంకీర్తనగా ఉచ్చరించుట గురుద్రోహము, మంత్రద్రోహము, ఆత్మద్రోహము" అనిరి. 'ప్రస్తావన'లో మోక్ష ప్రాప్తికి కల నాలుగు సాధనములు, (1) ద్విజసన్యాసుల ప్రణవ జపము, (2) శతపథ రుద్రీయ పారాయణము (3) వారణాసి నివాసము, (4) కలిమలమును హరించు శ్రీ విష్ణు నామమును స్మరించుటయునని వివరించి వీనిలో చివరిది అందరికి అందుబాటులోనిది, సులువైనది, శీఘ్రఫల మిచ్చునది, సాధన యోగ్యమైనది అని సాధకులను ఊరించిరి. 'నామాపరాధముల'లో 7వ దానినిగా, 'దానధర్మవ్రతహోమాది శుభకర్మలతో నామమును సమానమని తలచుట' అని ఉటంకించిరి. అనగా దానధర్మవ్రత హోమాదుల కంటె నామము అత్యుత్కృష్టమైనదని భావము. 'కలౌ కేశవకీర్తనాత్' అను శీర్షిక క్రింద, ఈ కాలములో యజ్ఞములు, తపస్సు, యోగసాధనము, సాధ్యములు కాని వనిరి. నామాపరాధ ప్రాయశ్చిత్తములో 'హరి' యను రెండక్షరముల నుచ్చరించినవాడు నాలుగు వేదముల అధ్యయనము చేసిన ఫలము పొందునని చెప్పిరి. నామాపరాధములలో ఐదవదిగా, నామమునందు అర్థవాద కల్పనము చేర్చి, అది మిక్కిలి భయంకరమైన అపరాధ మనిరి. అనగా నామమహత్త్వమును చెప్పెడి వాక్యములు ప్రశంసామాత్రములు కాక కేవల సత్యములే యని వీరి నిశ్చయము!

ముఖ్యముగా పై వాక్యముల నన్నిటిని గమనించినచో, బుద్ధిమంతులైన వారికి పరస్పర వైరుధ్యమే కాక, ప్రత్యక్షముగనో పరోక్షముగనో శ్రుతిస్మృతి సదాచారముల యనావశ్యకతయే కాక నిరసనము నింద కూడ కనబడుచున్నది. వేదాధ్యయనము, వ్రత హోమాదికములు, శతరుద్రీయాధ్యయనము, తుదకు సన్యాసము, ప్రణవ నిష్ఠయు, వృథాశ్రమ యని చెప్పినట్లయినది. ఇక యజ్ఞాదులు, తపస్సు, యోగము అసాధ్యమైనవని పరిహరింపబడినవి. ఈ విధముగా నామాపరాధములలో 4దిగా పేర్కొనబడిన 'శ్రుతి శాస్త్రనింద' పుష్కలముగా చేయబడుట ఎంతయు శోచనీయము!

'హరే రామ, నామముతో సులభముగా సరాసరి ముక్తి లభించుచుండగా, ప్రణవము, స్వాహా స్వధాలతో కూడిన ఇతర మంత్రాలతో పనియే మున్నది? అవి కొందరికే విబంధించుట, గురూపదేశము, శౌచనిష్ఠ, ఏకాంతజపము వృధా ప్రయాసలు కదా! ఈ శిష్య సంగ్రహము ఎందుకు సాగించుచున్నట్లు? ఎవరి లాభము కొరకు? శిష్య విత్తాపహారకులైన గురువులు సులభసాధ్యులని మంత్రశాస్త్ర గ్రంథములు ఉద్ఘోషించుచున్నవి!

స్వామివారు సంకీర్తనలలో నిషేధించిన మంత్రములలో 'స్వధ' ఉన్న మంత్రములు కూడా ఉన్నవి. స్వధాకారము శ్రాద్ధ కర్మలలో వచ్చునదే కాని ఉపాసన చేయు మహామంత్రములలో రాదే! 'స్వధాకారోహి పితౄణామ్' అని గదా!

'గమనిక'లో మరియొకచో సంకీర్తనలలో పంచాక్షర మంత్రము నిషేధించిరి. శివపంచాక్షర మంత్రములో ప్రణవము, స్వాహా, స్వధాలు లేవు. ప్రణవయుక్తమైనప్పుడు దానిని మేరు తంత్రాదులలో శివ షడక్షరమంత్ర మనియే వ్యవహరించిరి. ప్రణవాదులు లేని కొన్ని యితర పంచాక్షర మంత్రము లున్నవి. వాని నన్నిటిని సంకీర్తనములతో కలిపి చేయుటకు స్వామివారికి అభ్యంతరము లేదన్నమాట!

ఇక ప్రణవము! నారాయణాష్టాక్షర మున్నది. అది ప్రణవము కలియనిది అష్టాక్షరము కాదు. శ్రీ మద్రామానుజుల వారి వంటి ఆచార్య పురుషులు శ్రీ నారాయణాష్టాక్షరమంత్రమును శ్రీరంగగోపుర శిఖరము నుండి సర్వజనులకు ఉద్ఘోషించిరనుట జగత్ప్రసిద్ధము కదా! ఆళ్వారులలో ఒకరైన శ్రీ కులశేఖరులు తాము రచించిన ముకుందమాలాస్తవములో 18 వ శ్లోకమునందు 'నారయణాయేత్యముం మంత్రం సప్రణవం ప్రణామ సహితం ప్రావర్తయధ్వం ముహుః' అనుచు ఆ మంత్రమునే సంసారార్ణవతారకముగా సకల జనులకు హితోపదేశము చేసియుండిరే! ఇప్పుడు సంకీర్తనములు చేయువారిలో శ్రీవైష్ణవులును వైష్ణవులును పలువురున్నారు గాన వారు యాచార్యోపదేశము ననుసరించి, ప్రణవముతో కలసిన అష్టాక్షరమంత్రము సంకీర్తనములలో కలిపినచో, నట్టివారిని స్వామివారు నిషేధించుట ధర్మమా?

ఈ గ్రంథములో నామాపరాధములు పేర్కొని, నామాపరాధములకు ప్రాయశ్చిత్తముగా నామసంకీర్తనమే యని విధింపబడుట గమనింపదగినది. పైన మేము పేర్కొను శ్రుతిస్మృతి యజ్ఞ తపోవ్రతాదికములయు, సన్యాసుల ప్రణవాదిజపములయు, యోగాదికముల యొక్కయు, నింద నామాపరాధములలో ఉగ్గడించియు, ఆ దోషము నామసంకీర్తనమే హరింపగల దను ధైర్యముతో వాని నిందించుటకు సాహసించిరా?

ఈ కలిసంతరణోపనిషత్తు మిక్కిలి చిన్నదే యైనను దానిని శ్రద్ధగా పఠించినవారు అరుదుగా కనబడుచున్నారు. అందులో 'హరేరామ' మంత్ర విధిని గూర్చియు ఫలమును గూర్చియు ఇట్లున్నది: "దీనికి విధి లేదు. శుచియైనను అశుచియైనను ఎల్లప్పుడును పఠించినచో, బ్రహ్మ యొక్క సలోకత, సమీపత, సరూపత, సాయుజ్యత పొందును. ఈ పదునారు నామములు కలదానిని సార్ధత్రికోటి జపము చేసినచో, బ్రహ్మహత్య, వీరహత్య, స్వర్ణస్తేయము, వృషలీ గమనము, పితృ దేవ మనుష్యులకు చేసిన యపకారములు, సర్వ ధర్మ పరిత్యాగ పాపము— ఈ అన్నిటి వలన ముక్తుడై సద్యశ్శుచిత్వము పొందును". ఈ ఉపనిషత్తు జపమునే విధించినది. ఉచ్చారణ వాచక శబ్దములు కూడ జపపరములుగానే అన్వయింపవలెను. సంకీర్తన ప్రస్తావ మెక్కడను లేదు.

నామసంకీర్తనములలో సంగీతావసరములకై అందులో 8 మారులు వచ్చు 'హరే' అను సంబోధనము 'హారే'గా మార్చబడుచున్నది. ఆప్టే నిఘంటువులో ఇట్లు అర్థము లిచ్చినారు. "హారః F. I. Defeat 2. Losing game' కాబట్టి ఈ సంకీర్తనములలో శ్రీరామకృష్ణులను అపజయ స్వరూపులనుగా సంబోధించుచున్నా రన్నమాట!— శాంతం పాపమ్!

అసలు ఈ కలి సంతరణోపనిషత్తు వేద భాగముగా ప్రామాణికముగా పరిగణింప దగినదేనా అను సందేహము కలదు. ఆంధ్రాక్షర ప్రతిలో ఇది యాజుషీయ మని కలదు. యజుర్వేదము సాంగముగా అధ్యయనము చేసినవారు తైత్తిరీయోపనిషత్తు చెప్పుకొందురు, కాని దీనిని చెప్పుకొనరు. ఉపనిషత్తులనే పేరుతో ఎన్నో ఉత్తమ విషయాలు ఇతర విషయాలు గ్రంథస్థములైనవి. మదరాసు దివ్యజ్ఞాన సమాజమువారు ప్రచురించిన "Unpublished upanishads" లో "అల్లోపనిషత్తు" కూడ కలదు. అది 'అల్లా' నామముతో ముసల్మాను మతనిష్ఠను ప్రబోధించుచున్నది. అది కూడ వైదికమే యని వాదించువా రుండరు. అందుచేత ఉపనిషత్తు పేరుతో గ్రంథస్థమైనంత మాత్రమున, వేదశిఖగా గ్రహించుట భావ్యము కాదు.

ఈ ఉపనిషత్తు ప్రతిపాదించు 'హరేరామ' మంత్రములో ప్రసిద్ధములైన మహామంత్రముల కన్నిటికి విరుద్ధమైన స్వభావమున్నది. దీనిలో హరిరామకృష్ణుల సంబుద్ధి మాత్రమే ఉన్నది. కేవల సంబుద్ధి రూపమైనది ప్రసిద్ధమైన ఏ మహామంత్రములలో నేదియు లేకుండుట గమనింప దగినది!

మహామంత్రములను ముఖ్యముగా మూడు విధములుగా స్వరూపమును బట్టి విభజింపవచ్చును. మొదటి వానిలో దేవతా నామము, దానికి చతుర్థీ విభక్తి ప్రత్యయము, నమశ్శబ్దముకాని స్వాహాకారముగాని కలుపుట అను త్రిపుటితో నుండును. నమశ్శబ్దములున్నవి దేవత అతిశయమును స్తుతించును, స్వాహాకార మున్నవి ఆ దేవతకు సాధకుని ఆత్మార్పణము నివేదించును. రెండవ తరగతిలో, ఏదో ఒక దేవతకు ధ్యాన నమస్కారాదులు చేసి 'నాకు ధీ ప్రసాదింపుము, మేధ నిమ్మ, ప్రజ్ఞ నిమ్ము!' ఇత్యాదికములైన కోరికలతో ప్రార్థించును. ఈ కోటిలోనివే సావిత్రీ మంత్రము, శ్రీవిద్యాప్రపంచమైన దక్షిణామూర్తి మంత్రము! శ్రీవిద్యామంత్ర రాజములు కూడ ఈ తరగతిలోనివే. కామనలో నించుక భేదమున్నది. అవి పరమేశ్వరిని సంబోధించి బ్రహ్మవిష్ణ్వాత్మక మయిన మాయను అనగా అజ్ఞానమును నివారింపుమని ప్రార్థించును. ఇక మూడవ తరగతిలోనివి కేవల బీజాత్మకములుగా నుండును. వాని ఉపాసనము కేవలము ఆత్మానుసంధాన స్వరూపమైనది. ఈ తరగతిలోనివే మహావాక్యములు, సర్వకర్మ సన్న్యాసు లనుష్ఠించు ప్రణవమును!

మనలను పిలుచువారిలో మన మిత్రులు, శత్రువులు ఉదాసీనులు, భక్తులు నుందురు. రమ్మన వచ్చును, పొమ్మన వచ్చును, తిట్టవచ్చును, దీవింపవచ్చును, నమస్కరింపవచ్చును. అట్లే కేవల సంబుద్ధి దేవతాధ్యానము కాదు, నమస్కారము కాదు, అర్పణము కాదు, ప్రార్థనము కాదు, అనుసంధానము కాదు. ఈ గ్రంథప్రచురణకర్తలకు కేవల సంబోధన రూపముగానున్న 'హరేరామ' మంత్రములోని చిక్కు తెలిసియే కాబోలు, 'ప్రస్తావన'లో, ''భగవన్నామ సంకీర్తన స్మరణములకు భావము మిక్కిలి సహాయము చేయగలదు. కావున నామసంకీర్తనము చేయునపుడు భావము వచ్చుట భావయుక్తముగ కీర్తనములతో గీర్తించుట వలనే గలుగును'' అని భావయుక్తమగు కీర్తన లిందు జేర్చుటకు కారణముగా తెలిపిరి. దీని వలననే 'హరేరామ' మంత్రము భావవిహీనమైనదని ప్రకాశకులు అంగీకరించినట్లయినది.

కాని కలిసంతరణోపనిషత్తు మాత్రము దాని నట్లు భావయుక్తముచేసి కీర్తించుటకు అభ్యనుజ్ఞ యిచ్చుటలేదు. నామమునే సర్వదా శుచిగా అశుచిగా పఠింపవలెననియు, దాని వలన బ్రహ్మలోకము, బ్రహ్మసామీప్యము, బ్రహ్మసారూప్యము బ్రహ్మసాయుజ్యము వచ్చు ననుచున్నది. ఇందులో ఒక యసందర్భము కూడ బుద్ధిమంతులకు గోచరించును. హరిని రాముని కృష్ణుని సంబోధన చేయగా చేయగా ప్రాప్తించునది విష్ణులోకము, విష్ణుసామీప్య సారూప్య సాయుజ్యాదులేమాత్రము కాదు! ఈ బ్రహ్మ త్రిమూర్తులలో ఒకరగు చతుర్ముఖ బ్రహ్మ యను విషయము ముఖ్యముగా సంకీర్తనపరులలో వైష్ణవులైనవారు గమనింపదగినది.

ఇంకొక విషయము! సంకీర్తన పద్ధతిలో ఈ మంత్ర మొక్కసారి అనుటకు అరనిముషము పట్టును. ఆ విధముగా రోజుకు ఆరుగంటల చొప్పున చేసినచో, సార్ధత్రికోటి పూర్తి కావించుటకు, 133 సంవత్సరముల 2 నెలల 6 గంటల 50 నిముషములు పట్టును! అప్పటికి ప్రాప్తించుచున్నది శుద్ధి మాత్రమే.

మరియొక విషయము! శివకేశవుల యందు భేదదృష్టి యుండుట, 'నామాపరాధముల'లో రెండవ దానినిగా తెలిపిరి. మరి ఈ 'హరేరామ' మంత్రమే ఈ యపరాధము చేసినదా? మూడు విష్ణునామములు మొత్తము పదునారు మారులు ఉచ్చరించిన ఈ నామమంత్రమునకు ఆ యభేద భావమే యున్నచో, ముచ్చటగా ముమ్మారు కాకున్నను, అధమ పక్షమున ఒక్కమారైనను మంగళస్వరూపమైన శివనామము ఈ ఉపనిషత్తు ఉచ్చరింప రాదా? ఎంత కాదన్నను ఈ గ్రంథమందంతటను విష్ణువునం దభిమానము ఎన్నోవిధములుగా కనబడుచున్నది. విష్ణుపరమైన స్తోత్రములే చాలా ఎక్కువయున్నవి. 'క్షశా కేశవకీర్తనాత్' అను శీర్షిక వలననేమి, నామాపరాధ ప్రాయశ్చిత్తములో 'హరి' యను నక్షరద్వయము మాహాత్మ్యమునే చెప్పుట వలననేమి, ఈ ఊహయే బలపడుచున్నది.

కలి సంతరణోపనిషత్తు వేదశిఖయే యైనచో, వేదాధికారము లేనివారికి 'హరేరామ' మంత్రము నిషిద్ధ మనుట నిర్వివాదాంశము. సర్వవర్ణ సామాన్యమని చెప్పుటకు కలి సంతరణోపనిషత్సారమని ఇంకొక దాని ప్రమాణము చూపవలసిన యవసరము స్వామివారికి ఏర్పడినది. కాని ప్రామాణికమైన యుపనిషత్తు కాదు, కనుక హరేరామ స్మరణము సర్వవర్ణ సామాన్య మనుటకు ఎట్టి యభ్యంతరమును ఉండజాలదు. భగవన్నామ స్మరణము ఎవరు ఏ రూపముతో ఏ నామముతో చేసినను శుభప్రద మనుటకును ఎట్టి యభ్యంతరమును ఉండదు. ఏ వ్రతము చేయుచున్నను 'వ్రతానా ముత్తమం వ్రతమ్' అని యుండునట్లే, ఏ నామమహాత్మ్యము చెప్పునప్పుడైనను, అదే ఉత్తమోత్తమ మైనదని చెప్పుటకును అభ్యంతర ముండదు. ఆస్తికులైన వారందరు నట్టివి అర్థవాదలుగానే గ్రహింతురు. అవి యర్థవాదలు కాదని ప్రచారము చేయుట శాస్త్రవిరుద్ధము.

భగవన్నామ స్మరణము ధ్యానము ముఖ్యముగా ఏకాంతమున చేయదగినవి. అది యభ్యాసము చేసినవారికి గాని, దాని యానందాతిశయము తెలియదు. ఎప్పుడైనను మహోత్సవ సమయములలో హృదయములోని ఉత్సాహము పట్టలేక సమాన ధర్మము గల పదిమందితో కలిసి కీర్తించుటయు మంచిదే! అట్టి దానిచే పొంగు వెడలగ్రక్కబడి స్థిరబుద్ధితో ఏకాంత ధ్యానము చేయుటకు సాధారణ సాధకులకు ఉపకరించును.

కాని కొంతకాలము నుండి ఆంధ్రదేశములో భగవన్నామము భగవద్భక్తి రచ్చ కెక్కింపబడు చుండుట శోచనీయము. ఎందరికో ఇది జీవనోపాధి కలిగించు వృత్తిగా పరిణమించుచున్నది. వారు వారి స్వలాభము నిమిత్తము దానికి లేనిపోని మహాత్మ్యము కల్పించి ప్రచారము చేయుచున్నారు. దానికై అన్నిరకముల వారిని కూడగట్టుకొనుటకు పరస్పర విరుద్ధమైన వాక్యములు శాస్త్రములని ఉద్ఘోషింపబడు చున్నవి. దాని వలన ధర్మనిష్ఠులైన ఆస్తికులు కొందరు అమాయికముగా ఈ వ్యామోహములో పడి కొట్టుకొని పోవుచున్నారు. శ్రుతి

స్మృతిసదాచారముల యందు శ్రద్ధ క్షీణించుచున్న ఈ కాలములో ఈ భక్తి ప్రదర్శనముల వలన ఉత్తమమైన భగవద్భక్తి హాస్యాస్పదముగా పరిణమించు చున్నది. భక్తుడు ఒకానొక స్థితిలో "నవ్వును ఏడ్చును, అరచును, పాడును, ఉన్మత్తుని వలె లోకబాహ్యుడై నృత్య మొనరించును" అని వర్ణించిన వాక్యములు యథార్థములే! కాని ఆత్మవంచన పరప్రతారణములతో భక్తి నటన చేయుచు నవ్వుట, ఏడ్చుట, అరచుట, పాడుట, ఆడుట తరుచుగా తటస్థించుట మనము చూచుచున్నాము. కొందరు తామసికముగా ఆవేశము తెప్పించుకొనుచున్నారు. ఇది యంతయు బుద్ధిమంతులకు ఏవగింపు కలిగింపక తప్పదు.

నామసంకీర్తనము చేయువారు జనాకర్షణమునకై దాని నొక వేడుకగా జేయుచున్నారు. అది యొక టిక్కెట్టు కొన నక్కరలేని సినిమా ప్రదర్శనముగా సిద్ధమయినది. శబ్దవిస్తరణ యంత్రములతో నగరాంతరాళములలో ప్రతిధ్వనింప జేయుచు, భగవద్భక్తి లేనివారికి కోపకారణమై, ఏకాంత భక్తులకు పిచ్చి యెత్తునట్లును చేయుచుండుట శోచనీయము!

సాధన గ్రంథమండలి వారు తాము ప్రచురించు గ్రంథములలో సాధకులను సాధుశాంత మార్గములలో నడిపించుటకు కృషి చేసినచో తమ మండలి నామము సార్థకము కాగలదని సూచించుచున్నాము.

—విజ్ఞానానందనాథః.

## సుభాషిత నీవి

(సంస్కృత మూలము: శ్రీ వేదాంత దేశికులు; ఆంధ్ర వివరణము: శ్రీమాన్ సడాదూర్ అమ్మాళ్ నరసింహాచార్యులు, ప్రతులకు: కే. యం. సౌందరవల్లి, 17 బ్రాహ్మణవీథి సైదాపేట, మద్రాసు—15, మూల్యము: మూడు రూపాయలు.)

వైష్ణవ వాఙ్మయమున శ్రీ వేదాంత దేశికుల వారి కృతులకు విశిష్ట స్థానము కలదు. ఆ కృతుల సంఖ్య నూటయిరువదియొక్కటి దాక ఉన్నది. అందు కొన్ని అలభ్యములు. శ్రీవారి స్తుతి గ్రంథములలో పాదుకా సహస్రము, దయా శతకము బహువిధముల ప్రసిద్ధము అయినవి. ఈ సుభాషిత నీవి ఉపదేశాత్మకమైన రచన. ఇందు పన్నెండు పద్ధతులు గలవు. ఒక్కొక్క దాని యందు పన్నెండు శ్లోకములు అనగా మొత్తము నూటనలుబదినాలుగు శ్లోకములు.

నీవి యనగా 'మూలధనము' 'వస్త్రపుముడి' అను రెండర్థములను అనువాదకులు సూచించిరి. ఇహ పరములు రెండును ఫలించుట కవసరమైన సర్వజ్ఞాన, భక్తి, వైరాగ్యాదికము, లోకధర్మ, భగవద్విషయాదికము సుభాషితాత్మకముగా నిందున్న దని యర్థము. ఈ గ్రంథమున శ్రీమన్నిగమాంత మహాదేశికులవారు లోకహితము నభిలషించి ఉపదేశమును ప్రపంచించిరి. ఇందు శ్రీ దేశికుల వారు శ్లేష, సమాసోక్తి, నిందాస్తుతి—మొదలైన అలంకారములను విరివిగా వినియోగించిరి. అందువలన పైకి చూచుట కెంత సాధారణముగా కనిపించునో విదారించి చూచినచో అంత అసాధారణముగా వైదగ్ధ్యముతో నిందలి శ్లోకము లాశ్చర్యమును కలిగించును.

మొదటి యైదు పద్ధతుల యందును దుర్జన విషయమును చెప్పి తరువాతి ఏడు పద్ధతులలోను సుజనుల గుణవైభవ ప్రవర్తనలను ప్రదర్శించినారు, శ్రీ వేదాంత దేశికులు. ఇందలి గూఢములైన మహార్థములను శ్రీమాన్ నరసింహాచార్యులవారు తెనుగున మిక్కిలి విపులముగా వివరించి పెట్టినారు. శ్రీ మద్వేదాంత దేశికులవారి శ్లేష చమత్కారములను వివరించుటతోపాటు ఆయాసందర్భముల కనుగుణముగా అన్య గ్రంథములనుండి శ్లోకములను—పద్యములను గూడ శ్రీమాన్ ఆచార్యులవా రుదాహరించిరి. ఆంధ్ర మహాభారతమునుండి ఉదహరింపబడిన పద్యముల వలన శ్రీమాన్ ఆచార్యులవారి బహుభాషా గ్రంథ పరిచయమెంత ప్రగాఢమైనదో తెలిసికొన వచ్చును. ఈ సుభాషిత నీవిలో నీతిమత్పద్ధతి యను తొమ్మిదవ పద్ధతిలోని చివరి శ్లోకము అధిక పాఠమని గుర్తించుటతోపాటు ఆ శ్లోకమును తిక్కన సోమయాజిగారు తెనుగు చేసిన పద్యమును గూడ ఉద్యోగ పర్వమునుండి శ్రీమాన్ ఆచార్యులవారు గుర్తించిరి.

శ్రీ మద్వేదాంత దేశికుల అంతర్యమునెంత విపులముగా తాము దర్శించిరో దాని నంతయును తెలుగు ప్రజానీకమునకు శ్రీమాన్ నరసింహాచార్యుల వారు సరళసుందరమైన భాషలో అందించిరి. అన్నిమతములవారికిని ఈ గ్రంథ ముపాదేయమైనది. లోకము నెరుగుటకు ఎరిగి వర్తించుటకు ఈ సుభాషితనీవి మార్గదర్శకము. ఇంత ఉత్తమ గ్రంథమును తెనుగు చేసిన నరసింహాచార్యులవారు అభినందనీయులు. వారి కీర్తిని శాశ్వతముగా నాంధ్రమున నిలిపిన వారి పుత్రిక సౌందరవల్లిగారు ప్రత్యేకముగా ప్రశంసింపదగిన పనిచేసి పితౄణ మీగినారు.

—క్షేమేంద్ర.

## ఎందుకీ విద్యార్థి పోరాటాలు ?

రచయిత— శ్రీ గుజ్జుల యల్లమందారెడ్డి. పుటలు—28. వెల: 0—25. ప్రాప్తిస్థానం: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2.

## లెనిన్ జీవిత చరిత్ర

బుర్రకథ. రచన: శ్రీ సుంకర సత్యనారాయణ. పుటలు:30. వెల: 0—40. ప్రాప్తిస్థానం: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2.

